


# పురుషోత్తముడు - శ్రీరాముడు



కర్త :

స్వామి జగదీశ్వరానంద సరస్వతి

అనుకర్త :

సంధ్యావందనం శ్రీనివాసరావు

ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమ ప్రచురణ**

వ్యాస్ నగర్, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 361

గాయత్రీ గ్రంథమాల - 17
ద్వితీయ ముద్రణ ప్రతులు : 1000

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 097
శ్రీరామాబ్దము : 8, 69, 697
దయానందాబ్దము : 173
ఈశ్వర ఫాల్గుణ - మార్చి - 1998

మూల్యము : **రూ. 14=00**

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, వ్యాస్ నగర్, సికింద్రాబాద్ - 61

2) స్వస్తిక్ మెటల్ ప్రాడక్ట్స్, 3-3-738, కంచరి బజార్, సికింద్రాబాద్ - 3.

3) వైదిక సాహిత్య భండార్, ఆర్యసమాజము, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 1.

4) ఆర్. కృష్ణమూర్తి బుక్ సెల్లర్స్, ఆర్యసమాజ మందిరము, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 61.

PRINTED AT ✆ 812904
PRINTSHOP
D.T.P. - OFFSET - SCREEN
SECUNDERABAD - 500 003

# వైదిక సాహిత్యాభిలాషి



డా॥ కోడూరి సుబ్బారావు గారు

వీరు క్రీ॥ సం॥ 1943 ప్రాంతంలో పశ్చిమ గోదావరి జిల్లాలో ఒక సామాన్య మధ్య తరగతి కుటుంబములో జన్మించారు. తండ్రి కీ.శే. వెంకట్రాజు గారు క్షత్రియ గుణకర్మ స్వభావములు గల దేశభక్తులు, సర్వోదయ కార్యకర్త. స్వాతంత్ర్య ఉద్యమంలో చురుకుగా పాల్గొనుచున్నందున వీరి తండ్రిగారు వీరిని రాత్రి గదిలోకి పంపి బైట తాళం వేసేవారట. తల్లి శ్రీమతి నాగరత్నమ్మ గారు బ్రాహ్మణ గుణకర్మ స్వభావము గల దయామూర్తి. ఈమె అతిథులకు, పేదవారికి అన్నంపెట్టి అవసరమైతే తాను పస్తులుండేవారు. వారాల భోజనాలు చేస్తూ చదువుకునే పేద విద్యార్థులు ఒకరిద్దరు ఈ పుణ్యదంపతుల యింట భోజనాలు చేస్తూండేవారు.

వీరు 15వ ఏటనే క్షయవ్యాధికి గురియై శానిటోరియాలలో, ప్రకృతి ఆశ్రమములో చికిత్స పొందుచుండగా భగవద్గీత, వివేకానంద మొదలగు వారి సాహిత్యాలు చదివి శేష జీవితాన్ని సాధువుగా గడపాలనే దృఢ సంకల్పముతో చికిత్సాలయం నుండి నేరుగా ఆశ్రమాలకే వెళ్ళిపోయిరి. కర్నూలు జిల్లా బేతంచర్లలో పూదోట లింగమూర్తి గారి మఠంలో 3, 4 సంవత్సరాలు గడపి బనగానపల్లె స్వస్తి ఆశ్రమానికి చేరుకొనిరి. అచ్చట కొందరు ఆర్యసమాజ కార్యకర్తలతో పరిచయమై, సత్యార్థప్రకాశం అనే గ్రంథాన్ని చదవటం జరిగింది. వీరనేక సార్లు ఆ గ్రంథాన్ని చదివి అందలి విషయాలను ఆకళింపు చేసుకొని మహర్షి దయానంద ప్రదర్శిత వైదిక ధర్మమే సర్వోత్తమమైనదని నిశ్చయించు కొనిరి. ఆర్యసమాజ కార్యకర్త కీ.శే. శ్రీ డి.వి. స్వామిగారి ప్రోత్సాహంతో, బోధనలతో యజ్ఞోపవీత ధారులై పౌరాణిక సంప్రదాయాలను విడిచి పెట్టిరి.

కీ.శే. మహేంద్రకర్ రామచంద్రరావు గారి సహకారంతో సికింద్రాబాద్‌లోని సీతాఫలమండికి వచ్చి కీ.శే. కళాప్రపూర్ణ పం. గోపదేవ్ శాస్త్రిగారి ఉపన్యాసాల ద్వారా, సాహిత్యం ద్వారా, చర్చలద్వారా, వివిధ విద్వాంసుల వైదిక సాహిత్య స్వాధ్యాయం ద్వారా తమ జ్ఞానాన్ని పెంచుకొని వైదిక పురోహితునిగా, ప్రచారకునిగా, కార్యకర్తగా వైదిక ధర్మ ప్రచారం చేసిరి. ఆరోగ్యం అనుకూలించక పోవుటచే ప్రచారం తగ్గించుకొని హోమియో వైద్యం నేర్చుకొని ఒక చిన్న వైద్యునిగా స్థిరపడిరి. కీ.శే. శ్రీ వి.వి. సత్యనారాయణ గారి ప్రోత్సాహంతో సీతాఫలమండి ఆర్యసమాజంలో సాయంత్రం పూట దయానంద ధర్మార్థ హోమియో వైద్యశాలలోను, వ్యాస్‌నగర్ ఆర్యబంధువుల ప్రోత్సాహంతో ఉదయం పూట వ్యాస్ వైదిక సేవా సమాజంలోను హోమియో చికిత్సాలయాలను నెలకొల్పి విస్తృతంగా వైద్యసేవలు చేశారు.

వీరు నిరాడంబరంగా జీవితం గడిపేవారు కనుక తన ఆదాయంలో మిగిలిన ధనాన్ని భగవంతుని ధనంగా భావించి తాను దానికి ఒక ధర్మకర్తగా నుండి తాను నమ్మిన ఆశయాలకు అనుగుణంగా ఆ ధనాన్ని ఖర్చు పెట్టుచుండెడివారు. తన తదనంతరం కూడా ఆ నిధి సద్వినియోగపడాలనే దూరదృష్టితో **'గాయత్రీ ఆశ్రమం'** అను పేరుతో 11 మంది సభ్యులతో ఒక ట్రస్టును ఏర్పరచి 1990 సం॥రంలో పబ్లిక్ ట్రస్టుగా రిజిష్టరు చేశారు. అందు 1) అనాథల, పేదల సేవచేయుట 2)ఆర్య గురుకుల పేద విద్యార్థులకు ఆర్థిక సహాయం చేయుట 3) వైదిక సాహిత్య ప్రచురణ అను లక్ష్యములను ఏర్పరచిరి. సాహిత్య ప్రచురణ లక్ష్యసాధనగా యింతవరకు 23 గ్రంథములు ప్రచురింపబడ్డాయి. అందు వీరి స్వీయ రచనలే 10 ఉన్నవి. ఈ ట్రస్టు ప్రచురణలన్నియు సరళ సుబోధకముగానుండుట వలన బహుళ ప్రజాదరణ పొందాయి. వేదాలలో వివిధ విషయాలను, మహాపురుషుల యథార్థ ప్రేరణాత్మక జీవిత పరిచయాలను తెలిపే మరికొన్ని గ్రంథాలను ప్రచురించాలని వీరి అభిలాష. అందుకొఱకై ఈ సంవత్సరం మరొక పదివేల రూపాయలను మా ట్రస్టునకు దానముగా నొసంగిరి.

సంధ్యావందనం శ్రీనివాసరావు

కార్యదర్శి - గాయత్రీ ఆశ్రమట్రస్టు

# ప్రకాశకీయము

## శ్రీరాముడు కల్పిత పురుషుడా ?

భారతదేశములో అబాలగోపాలము పండితుల నుండి పామరుల వరకు శ్రీరాముని ఎరుగని వారెవ్వరును లేరు. ఆయన దశరథుని ప్రథమ పుత్రుడనియు, సీతాదేవి భర్తయనియు, రావణాది రాక్షసులను సంహరించి సాధుసత్పురుషులను రక్షించెననియు కథలు కథలుగా చెప్పుకొందురు. అంతటితో తనివితీరక మనోరంజకముగా హరికథ నాటక సంగీత నృత్యాదిరూపములలో మననము చేయుదురు. రామాయణము నందలి పేర్లను వారి పిలల్లకు పెట్టుకొనుచు గుళ్ళు గోపురములు కట్టి ఉత్సవములు చేయుచు తమ రామభక్తిని ప్రదర్శింతురు. రాముడు జన్మించిన, నడయాడిన అయోధ్య, భద్రాద్రి మొదలగు ప్రాంతములను పుణ్యస్థలములుగా భావించి తీర్థయాత్రలు చేయుదురు. మనదేశమందే గాక ప్రపంచమందలి అన్ని దేశములందును ఏదో రూపమున రామాయణ గాథలు వినబడును. అచటి గుళ్ళు గోపురములపై రామాయణ కథా శిల్పములు గోచరించును. భారతీయుల అనేక ప్రాచీన గ్రంథములలో రామాయణ కథాంశముల ప్రసక్తి వచ్చును. ఇదంతయు ఒక కల్పిత పురుషునికి సంభవమా? ఒక నవల ఆధారంగా ఇంతటి విస్తృత ప్రచారము ఎవరికైనా లభించినదా? - ఇది ఆంగ్లేయుల కుటిల రాజనీతితో భారతీయ చరిత్ర గ్రంథాలను నశింపజేయుటకు పన్నిన కుట్రగా కనబడును. వారు జైకోబి, మెక్‌డెనాల్డ్ మొదలగు విద్వాంసులచే రామాయణ మొక కల్పనా గ్రంథమని వ్రాయించి ప్రచారము చేసిరి. డా॥ స్మిత్ కూడా తన " ది ఆక్స్‌ఫర్డ్ హిస్టరీ ఆఫ్ ఇండియా" అను గ్రంథములో " ఈ కావ్యము (రామాయణము) ఒక కల్పిత గ్రంథము, ఇది కోసల సామ్రాజ్యం, అయోధ్య ప్రాంతపు సాంప్రదాయములపై రచింపబడిన గ్రంథము" అని వ్రాసిరి. నేటి మన ఆంగ్ల మానసపుత్రులైన భారతీయ చరిత్రకారులు కూడా వాటినే అంధానుకరణ చేయుచు దీనిని ఒక నవలగా చిత్రించుచున్నారు.

ఆదికావ్యమైన రామాయణమును రచించిన వాల్మీకి శ్రీరాముని

సమకాలికుడు. ఆయన తన గ్రంథములోని మొదటి అధ్యాయములో తనకు ఈ గ్రంథము వ్రాయుటకు కలిగిన ప్రేరణను చక్కగా వివరించిరి. తన ఆశ్రమమునకు వచ్చిన దేశసంచారియైన నారదమహర్షిని తనకు తరతరముల వరకు జనులను ప్రేరేపించు ఒక ఉత్తమ పురుషుని జీవిత చరిత్ర వ్రాయవలెనను సంకల్పము' ఉన్నదనియు అట్టి సర్వశుభలక్షణ గుణసంపన్న యుక్తుడు ఎవరైనా భూమండలమున కలరా?' అని ప్రశ్నించుటయు, దానికి నారదమహర్షి అట్టి సద్గుణ యుక్తుడు అయోధ్య పురవాసి శ్రీరాముడనియు చెప్పి అతని చరిత్రను వినిపించెను. దానినే వాల్మీకి తన పాండిత్య ప్రతిభతో మనోరంజకమైన కావ్యముగా రచించెను. అందు శ్రీరాముని జనన విషయమును వర్ణించుచూ - చైత్రమాసములో శుక్లపక్ష తిథి నవమియందు, పునర్వసు నక్షత్రముండగా, పంచగ్రహములు వాటివాటి ఉన్నత స్థానములందుండగా, కర్కలగ్న మందు బృహస్పతీ చంద్రుల సంయోగము జరిగిన సమయమందు కౌసల్యాదేవి శ్రీరాముని ప్రసవించెను." అని వ్రాసెను. ఇది ఒక కల్పిత పురుషునికి వ్రాయుట సంభవమగునా? కల్పిత పురుషుడని వాదించువారు సీత అనగా నాగలి యనియు, రాముడనగా నాగలి నడుపు రైతు అనియు అర్థములు చెప్పి ఏవో భావములు వెలికితీయ ప్రయత్నింతురు. అట్లైన దశరథుడు, భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నుడు, కౌసల్య, హనుమంతుడు, రావణుడు మొదలగు అనేక పేర్లకు, క్షేత్రనామములకు ఏమి అర్థములు చెప్పగలరు? నేటికిని సూర్య వంశీయ క్షత్రియులు చాలామంది మనకు కనబడుదురు. ఉదయ్‌పూర్ మహారాణా శ్రీరాముని వంశీయుడు. ఒక కల్పిత పురుషుని పేరుతో లక్షల సంవత్సరముల నుండి ఒక వంశము ఏర్పడునా? ఇట్టివే రామాయణము కల్పితము కాదనుటకు అనేక ప్రమాణములు చూపించవచ్చును.

నేడు లోకములో అనేక రామాయణములు ప్రచారములో నున్నవి. అందు పరస్పర భిన్నములైన అంశములు కూడా నున్నవి. ఏమైనను శ్రీరాముని సమకాలీనుడైన వాల్మీకి రచించిన రామాయణము స్వతఃప్రమాణిక గ్రంథము. మిగిలినవన్నియు పరతః ప్రమాణములు. అవి వాల్మీకి రామాయణమునకు అనుకూలముగా నున్నంత వరకు ప్రమాణికము. దానికి

విరుద్ధమైన అంశములన్నియు కవుల మిథ్యాకపోల కల్పనలు. కావ్యకర్తలు మనోరంజకము కొరకు చరిత్ర గ్రంథములందు కూడా కొన్ని అతిశయోక్తులు చేర్తురు. రామకృష్ణాదుల చరిత్రలందే కాక బుద్ధుడు, ఏసుక్రీస్తు, మహామ్మద్ మొదలగు మహాపురుషుల చరిత్రలందు కూడా ఇట్టి అతిశయోక్తులు కొన్ని కాననగును. అయినంత మాత్రమున అవి చరిత్రలు కాదనుటకు వీలులేదు.

శ్రీరాముని చరిత్ర త్రేతా ద్వాపరయుగ సంధిలో జరిగినట్లు మహాభారత వనపర్వమందు వర్ణనకలదు. దానిని బట్టి 1991 మార్చి నెలలో వచ్చిన శ్రీరామనవమి నాటికి 8,69,091 వర్షములు పూర్తయినవి. ఇంకను లోతుగా పరీక్షించిన శ్రీరాముని జననము ఈ చతుర్ యుగములోని 28వ త్రేతాయుగమున కాక 24వ త్రేతాయుగములో జరిగినట్లు వివిధ పురాణాది గ్రంథములలో వర్ణనలు కనబడును. దానినిబట్టి ఒక కోటి ఎనభైఒక్క లక్షల నలభైతొమ్మిది వేల నూటొక్క సంవత్సరము లగును. భూగర్భ పరిశోధనల ప్రకారము యిదియే సత్యమగును - సుందరకాండలో హనుమంతుడు లంకానగరములో వారణశ్చ చతుర్ధంతైః' 3,4 దంతముల గల తెల్ల ఏనుగులను చూచినట్లు వర్ణించెను. 2 1/2 కోట్ల నుండి 15 లక్షల సంవత్సరముల పూర్వమందు 3,4 దంతముల ఏనుగులు ఉండెడివని వైజ్ఞానికుల కథనము. ఆర్య విద్వాంసులు అనేక ప్రమాణములతో ఈ విషయములు నిరూపించుటయే గాక నేడు లోకములో ప్రచారములో నున్న అనేక భావములకు సహేతుకమైన ప్రమాణములో కూడిన విమర్శలు చేసిరి. రామాయణ మందలి పాత్రలద్వారా మహత్త్వపూర్ణమైన ప్రేరణలను వెలుగులోనికి తీసుకొని వచ్చిరి. పరిస్థితు లనుకూలించిన వెంటనే వాటిని ఒక పరిశీలనా గ్రంథముగా ప్రచురించగలము.

మేము కోరిన వెంటనే తీరికలేకున్నను ఎటులో తీరిక చేసుకొని తమ అమూల్య సమయమును వెచ్చించి శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావుగారు ఈ గ్రంథమును అనువదించి మాకిచ్చిరి. గ్రంథకర్తకు అనువాదకులకు మా హృదయపూర్వక ధన్యవాదములు.

కోడూరి సుబ్బారావు

## విషయ సూచిక

| | | పుట సంఖ్య |
|---|---|---|



# పురుషోత్తముడు - శ్రీరాముడు

మహర్షి వాల్మీకి మునిశ్రేష్ఠుడైన నారదుని యిట్లు అడిగెను. హే భగవన్! ప్రపంచమున నేటి సమకాలికులలో గుణవంతుడు, శూరుడు, సత్యవాది, ధర్మజ్ఞుడు, ధృఢప్రతిజ్ఞుడైన వారెవరు? సదాచారి, సమస్త ప్రాణులకు హిత మొనర్చువాడు, ప్రియ దర్శనుడు, ధైర్యవంతుడు, కామక్రోధాది అరిషడ్వర్గములను జయించిన వారెవరు? అట్టివారిని గూర్చి తెలుసుకొన వలయునని నా కోరిక. అటువంటి మహాపురుషుల నెరుంగుటలో మీరు సమర్థులు కనుక తెలియజేయుడని నారదుని మహర్షి ప్రార్థించెను. అందుకు నారదముని జవాబిచ్చుచు - మహర్షి! మీరు వర్ణించిన గుణములు అతి శ్రేష్ఠములైనందున ఒకే వ్యక్తిలో అన్ని గుణములుండుట కష్టము. ఐనా ఇక్ష్వాకు వంశమున నుద్భవించి రాముడను నామముతో జగత్ప్రసిద్ధుడైన వ్యక్తి గలరు. ఆయన అత్యంత బలశాలి, ధైర్యవంతుడు, జితేంద్రియుడు, బుద్ధిశాలి, ప్రియభాషి, శత్రునాశకుడు, ధర్మజ్ఞుడు, సత్యవాది, సకల ప్రాణులకు ఎల్లప్పుడు మేలు చేయుచుండువాడు, వేదజ్ఞుడు, ధనుర్వేద విద్యలో కుశులుడు, ఆర్యుడు, ప్రియదర్శనుడు, సముద్రమువలె గంభీర స్వభావము గలవాడు, మేరునగ ధీరుడు, విష్ణువుతో సమాన ప్రరాక్రమము గలవాడు, కాలాగ్నివంటి క్రోధ స్వభావము కలవాడు, పృథివితో సమానమైన ఓర్పు గలవాడు, దానములో కుబేరునితో సమానుడు, సత్యభాషి.

త్రేతాయుగాంతమున సూర్యవంశ చక్రవర్తియైన అజునిపుత్రుడు దశరథ మహారాజు కోసలదేశమునకు అయోధ్యానగరమును ముఖ్యపట్టణముగ చేసుకొని పరిపాలించుచుండెను. అయోధ్యానగర మప్పుడు 60 మైళ్ళు పొడవు, 15 మైళ్ళు వెడల్పు విస్తీర్ణము గలిగి యుండెడిది. నగరమునకు నలువైపుల జలముతో నిండిన కందకము గలదు. నగరమునకు నలుదిశలలో నానారకముల అస్త్రశస్త్రములు, పెద్దపెద్ద ఫిరంగులుంచబడి దుర్గమమైన కోటలుండెడివి. నగరము పొడవైన వెడల్పుగల రాజమార్గములతో నుండెడిది.

ప్రతిదినము రాజమార్గమున శుభ్రమొనర్చబడి పుష్పములు చల్లబడి యుండెడివి. రాజమార్గమున కిరువైపుల ఎత్తైన విశాలమైన భవనములు గలవు. అనేక స్థలములలో అమ్రాది ఫల వృక్షములతో కూడిన ఉద్యానవనములు, తోటలుండెడివి. ఉచిత న్యాయ న్యాయస్థానములలో నిర్మల, శీతజలములతో నిండిన సరోవరములుండెడివి. స్త్రీ, పురుష గణములతో నగరము నిండియుండి శోభిల్లుచుండెడిది. బ్రాహ్మణులు వేదాది శాస్త్రములలోను, క్షత్రియులు శూరవీర యుద్ధ కళలలోను పారంగతులు. వైశ్యులు వ్యాపారము చేయుచు రాజ్యమును సుసంపన్నము గావించుచు వారు సంపదలతో విలసిల్లుచుండిరి. సేవాభావముతో శూద్రులు ద్విజులకు సేవ లొనర్చు చుండిరి. ఆకలిదప్పులతో బాధపడువారు గాని, దారిద్ర్యముతో పీడింప బడువారు గాని, ఎవరు లేరు. ప్రజలు రథములు, గుఱ్ఱములు, ఏనుగులు, గోవులు మున్నగు సంపదలతోను, సువర్ణ ఆభరణాదులతోను, తులతూగుతుండెడి వారు. విద్యాసంస్థల నిర్వహణ, భద్రతా ఏర్పాట్లు అయోధ్యలో అత్యుత్తమముగ జరుపబడుచుండెడివి.

**శ్లో॥ కామీ వా న కదర్యో వా నృశంసః పురుషః క్వచిత్ ।**
**ద్రష్టుం శక్యమయోధ్యాయాం నా విద్వాన్న చ నాస్తికః ॥ (బాలకాండ 6-8)**

కాముకులు, క్రూరులు, అవిద్వాంసులు, నాస్తికులు నిత్యాగ్ని హోత్రము చేయనివారు లేకుండిరి. స్త్రీ పురుషు లెల్లరు ధార్మికులై ప్రజలంతా సుఖ సంతోషములతో విలసిల్లుచుండిరి.

ప్రతిభావంతుడు, ప్రజలను తన బిడ్డలవలె తలంచువాడు, ధర్మము నెరిగినట్టి దశరథ మహారాజు సంతానహీను డగుటవలన అత్యంత దుఃఖితుడుగ నుండెను. మహారాణి కౌసల్యకు సంతానము కలుగనందున మహారాజు రాజకుమారి సుమిత్ర మరియు కైకేయీలను వివాహమాడెను. ఐనా ఆయన కోరిక (సంతాన ప్రాప్తి) తీరలేదు. అందులకు మహారాజు దుఃఖింపసాగెను. ఒకనాడు దశరథునకు సంతాన ప్రాప్తికై 'పుత్రకామేష్టి యాగ' మొనర్పవలయునను ఆలోచన కలిగినది. ఆ విషయమును తన మంత్రులకు తెలుపగా వారందరూ అంగీకరించిరి. సరయూనది తీరమున యాగమున కేర్పాట్లు జరుగసాగెను.

యాగ నిర్వహణకై ఋషి శృంగీని పిలిపించిరి. మహారాజు దశరథుడు మహర్షితో - భగవన్! మా వంశోద్ధరణకై ఏమి అవసరమో దానిని చేయుడని ప్రార్థించెను. అందులకు ఋషి ప్రసన్నతతో ఓ రాజా! మీ వంశోద్ధరణకై నీకు వేదమంత్రములతో విధిపూర్వకముగ పుత్రేష్టి యజ్ఞమును చేయింతునని చెప్పి తేజోమయుడైన ఆ ఋషి పుత్రేష్టిని యారంభింపజేసి మంత్ర విధి ననుసరించి అగ్నిహోత్రమునందు ఆహుతులొసంగుచు కర్మకాండ నారంభించెను.

యజ్ఞమును పరిసమాప్తము గావించిన పిమ్మట ఋషిశృంగుడు అద్భుత గుణాన్వితమైన పుత్రోత్పాదనరూప పాయసముతో కూడిన పాత్రను దశరథ మహారాజున కిచ్చుచూ - రాజా! యజ్ఞమొనర్చుచుండగా యజ్ఞశేషము (ప్రసాద) రూపమున దివ్యగుణములతో కూడిన పాయసము లభించినది. ఈ పాయసమును విద్వాంసులు యజ్ఞమునందలి అగ్నితో తయారుచేసిరి. అందువలన ఇది పుత్రోత్పాదకము, ప్రశస్తము, ఆరోగ్యవర్ధకమైనది. కనుక దీనిని స్వీకరించి మీ పత్నుల కివ్వవలయును. నిశ్చయముగ మీకు పుత్రప్రాప్తి కలుగుననెను. మహారాజు అత్యంత ప్రసన్నుడై ఆదివ్య పాయసముతో కూడియున్న సువర్ణపాత్రను గ్రహించి, ఋషిశృంగున కభివాదమొనర్చి రాజప్రాసాదమునకు వెళ్ళెను. అందలి కౌసల్య, సుమిత్ర కైకేయిలకు - ముగ్గురు రాణులకు పాయసము నిచ్చెను. ఆ పాయసమును భుజించిన రాణులు అగ్ని, సూర్యులతో సమానమైన తేజస్సుతోకూడిన శిశువులను గర్భమున ధరించిరి.

జననము :

యాగము ముగిసిన ఒక సంవత్సరము తరువాత చైత్రమాసమున శుక్ల పక్షమున నవమిరోజున పునర్వసు నక్షత్రమున మహారాణి కౌసల్యకు ఒక పుత్రుడు జన్మించెను. నగరమంతా ఆనందోత్సాహములతో నిండెను. మహారాజు గొప్పగొప్ప దానములు చేసెను. ఋషిమునుల ఆశీర్వాదమును పొందెను. తదుపరి కైకేయి గర్భమున నొక పుత్రుడు సుమిత్ర గర్భమున యిరువురు పుత్రులుత్పన్నమైరి. వీరి జన్మదినోత్సవములు అత్యంత వైభవముగ

జరుపబడినవి. వైదికవిధిననుసరించి 11వ రోజున మహారాజు తన పుత్రులకు నామకరణ సంస్కారమును చేయించెను. మహర్షి వశిష్ఠుడు జ్యేష్ఠునకు రాముడని, కైకేయీ సుతునకు భరతుడని, సుమిత్రా పుత్రులకు వరుసగా లక్ష్మణుడు, శత్రుఘ్నులని నామకరణము చేసెను. మహారాజు బ్రాహ్మణులకు, నగరమునందు, రాజ్యమునందలి ప్రజలకు విందుచేసెను. బ్రాహ్మణులకు, విద్వాంసులకు అతి మూల్యమైన రత్నములను బహుకరించెను.

విద్యాభ్యాసము :

నలుగురు కుమారులు పెద్దవారైన తదుపరి వారందరికి విధి పూర్వకముగ యజ్ఞోపవీత సంస్కారము, వేదారంభ సంస్కారములను చేయించి విద్యాభ్యాసమునకు పంపెను. నలుగురు రాజకుమారులు అత్యంత బుద్ధిమంతులగుటవలన విద్యను శీఘ్రముగ గ్రహింపసాగిరి. వేదవేదాంగముల నధ్యయనము గావించి, ధనుర్వేదము నభ్యాసమొనర్చి ధనుర్విద్యలో ప్రావీణ్యమును పొందిరి. వారు శూరులు, వీరులు, ప్రజోపయోగకర కార్యములలో శ్రద్ధాసక్తులు గలవారునై జ్ఞానులు, శ్రేష్ఠగుణములతో శోభిల్లువారు, లజ్జాశీలురు, సమస్త వ్యవహారములందు దక్షతగలవారు, దూరదర్శులుగ తయారైరి.

రాముని బాల్య లీలలను గూర్చి మహర్షి వాల్మీకి వర్ణింపలేదు. కాని ఆ నలుగురు సోదరుల పరస్పర ప్రేమానురాగములను మాత్రము అవశ్యముగ వర్ణించెను. చిన్ననాటి నుండియు లక్ష్మణునకు శ్రీరామచంద్రునిపై అధిక ప్రేమ యుండెడిది. లక్ష్మణుడు కష్టములను లెక్కచేయక శ్రీరామునకు సేవ చేయుచుండెడివాడు. ఎల్లప్పుడు అన్నగారితో నుండెడివాడు.

**శ్లో॥ యదా హి హయమారూఢో మృగయాం యాతి రాఘవః ।**
**తదైనం పృష్ఠతోఽభ్యేతి సధనుః పరిపాలయన్ ॥** (బాల. 18-30)

శ్రీరాముడు గుఱ్ఱముపై వేటకై బయలుదేరునపుడు లక్ష్మణుడు కూడ ధనుస్సుతో ఆయన వెనుక వెళ్ళుచుండెడివాడు. అట్లే శ్రీరాముడు కూడ లక్ష్మణుడు లేకుండ నిద్రించెడివాడు కాడు. లక్ష్మణునకు పెట్టకుండా మిఠాయికూడా తినెడివాడు కాడు. ఇదేవిధముగ శత్రుఘ్నుడు భరతునకు,

భరతుడు శత్రుఘ్నునకు తమ ప్రాణములకంటె ప్రియులు.

విశ్వామిత్రుని రాక :

ఒకనాడు దశరథ మహారాజు మంత్రులతో కొలువు తీర్చి రాచ కార్యములను చర్చించుచుండగా ద్వారపాలకులు వచ్చి మహర్షి విశ్వామిత్రుని రాకగూర్చి తెలిపిరి. వెంటనే వశిష్ఠునితో కలిసి ఎదురేగి ఆయనకు స్వాగతము చెప్పి తేజస్సుతో వెలుగొందుచున్న మునిని చూచి రాజాయనకు అర్ఘ్యము నిచ్చెను. విశ్వామిత్రులవారు శాస్త్రవిధి ననుసరించి రాజొసంగిన అర్ఘ్యమును స్వీకరించి అతని క్షేమమును గూర్చి అడిగిరి. తదుపరి ఆయన నగరవాసుల, ధనాగారము, రాజ్యము, కుటుంబములోని పరివారముల యొక్క కుశలమును గూర్చియు వశిష్ఠాది ఋషుల క్షేమమును గూర్చియు అడిగి తెలుసుకొనిరి. ఆపైన అందరు సభలో ప్రవేశించి తమతమ స్థానముల నలంకరించిరి. అప్పుడు దశరథుడు

శ్లో॥ **కం చ తే పరమం కామం కరోమి కిము హర్షితః ।**

**అద్య మే సఫలం జన్మ జీవితం చ సుజీవితమ్ ॥** (బాల 18-52)

ఓ మునివర్య ! మీ దర్శన భాగ్యమునకు ఆనందించుచున్నాను. మీకు నేనేమి సేవలొనర్పగలను? మీ కృపాకటాక్షములచే ఈరోజు నా జన్మ ధన్యమై జీవనసాఫల్యము నొందినది అనెను. రాజు మాటలు విన్న విశ్వామిత్ర ఋషి వెంటనే తాను వచ్చిన విషయమును గూర్చి తెలుపుచు - రాజా! కొంతకాలముగ మా యజ్ఞకార్యమునకు విఘ్నములు కలుగుచున్నవి. మేము యజ్ఞము నారంభించు నపుడు మారీచుడు, సుబాహులను అస్త్రశస్త్ర విద్యలలో నిపుణులు, బలవంతులైన యిరువురు రాక్షసులు మా యజ్ఞమును ధ్వంసము చేయుచుందురు. అందువలన మహారాజా! మీరు మీ సత్యపరాక్రముడైన జ్యేష్ఠపుత్రుడు రాముని నాకిచ్చివేయుడు. నేనాబాలుని రక్షింతును. తన దివ్యతేజోబలముచే రాముడు ఆ రాక్షసులను అంతమొందించుటలో సమర్థుడు. రాముడు తప్ప మరే యితర మానవుడు ఆ రాక్షసుల నంతమొందించుటకు సాహసింపలేరనెను.

మహర్షి విశ్వామిత్రుని మాటలను విన్న దశరథుడు కొంతతడవు వరకు మూర్ఛితుడయ్యెను. ఆయనకు స్పృహరాగానే యిట్లు చెప్పసాగెను. మహర్షి! నా రాముని కిప్పుడు 16 సంవత్సరములైనా నిండలేదు. అతడు రాక్షసులతో యుద్ధము నెట్లు చేయగలడు? రాక్షసులతో యుద్ధమొనర్పవలయుననిన నేనే స్వయముగా ధనుర్బాణములను ధరించి మీ యాగమును రక్షింతును. శరీరములో ప్రాణములున్నంత వరకు రాక్షసులతో యుద్ధము చేయుదును. నా సైన్యముతో నేనచ్చటకు వత్తును. 'న రామం నే తు మర్హసి' మీరు రాముని తీసుకొని పోవలదనెను.

దశరథుని మాటలకు విశ్వామిత్ర ఋషి కోపోద్రిక్తుడై - ఓ రాజా! నీవు రఘువంశమున జన్మించి అన్నమాటను తప్పుదువా? ఇది నీ వంశ మర్యాదకు అగౌరవకరమైనది. నీ వట్లే తలంచినచో సరే! నేను పోవుచున్నాననెను.

శ్లో॥ మిథ్యా ప్రతిజ్ఞః కాకుస్థ సుఖీభవ సబాన్ధవః । (బాల 21-3)

మిథ్యా ప్రతిజ్ఞల నొనర్చు ఓ రాజా! నీవు బంధుబాంధవులతో సుఖముగ నుండుము అనెను. ఈ విషమ స్థితిని చూచిన వశిష్ఠమహర్షి - మహారాజా! ఇక్ష్వాకు కులమున నుద్భవించిన నీవు సాక్షాత్తుగ ధర్మమూర్తివి. ముల్లోకములలో నీవు ధర్మాత్ముడుగ ప్రసిద్ధి చెందితివి. అట్టి నీవు ధర్మమును త్యజింపవలదు. శ్రీరాముడు అస్త్రవిద్యలో ప్రవీణుడైననూ కాకున్ననూ రాక్షసులతని నేమియు చేయజాలరు. అగ్ని చక్రము లేనివాడు అమృతమును పొందలేనట్లే అనేక అస్త్ర శస్త్రముల నెరిగినట్టి విశ్వామిత్రుని రక్షణలోనున్న రామునకు ఎవరూ హాని చేయలేరు. విశ్వామిత్రుడే స్వయముగ ఆ రాక్షసులను చంపగలడు. కాని మీ పుత్రుని మేలుకోరే ఆయన మిమ్ములను కోరుచున్నాడనెను. ఈవిధముగ వశిష్ఠులవారు నచ్చజెప్పిన మీదట దశరథుడు విశ్వామిత్రుల వారితో శ్రీరాముని పంపుటకు రాజీపడెను. రామలక్ష్మణులను పిలిపించి స్వస్తివచనాదులతో వారిని విశ్వామిత్రుల వారి కప్పగించెను. వారు వెళ్ళిన తదుపరి రాజభటులు శంఖనాదము చేసి నగారా వాద్యములు మ్రోగించిరి.

వారు అయోధ్యా నగరమును దాటి 6 క్రోసులు పయనించి సరయూనది దక్షిణ తీరమును చేరినపుడు విశ్వామిత్రులవారు శ్రీరామునితో - శీఘ్రముగ

స్నానమొనర్చి రమ్ము. తదుపరి ఆచమనము చేయుము. నేను నీకు 'బల', 'అతిబల' లనెడు విద్యలను నేర్పుదును. వాని ప్రభావము వలన నీకెన్నడు అలసట యుండదు. ఆకలిదప్పులు నిన్ను బాధింపవు. రాక్షసులు కూడ నిన్నేమీ చేయజాలరు. అనెను. ముని ఆదేశము ప్రకారము శ్రీరాముడు ఆచమనముచేసి ప్రసన్నచిత్తుడై ఆ విద్యలను గ్రహించెను. తదుపరి గురుసేవ చేయుచు అన్నదమ్ములిరువురు సరయూనదీ తీరమున ఆ రాత్రి గడపిరి. ప్రాతః కాలమున విశ్వామిత్రులవారు రాజకుమారులను నిద్రలేపుటకై

శ్లో॥ కౌసల్యా సుప్రజారామ పూర్వా సంధ్యా ప్రవర్తతే ।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥ (బాల 13-3)

ఓ కౌసల్యానందన రామ! సూర్యోదయ మగుచున్నది. వెంటనే లేచి కాలకృత్యములు తీర్చుకొని అనుష్ఠానాదు లొనర్చుము.

శ్లో॥ తస్యర్షేః పరమోదారం వచః శ్రుత్వా నృపాత్మజౌ ।
స్నాత్వా కృతోదకౌ వీరౌజేపతుః పరమం జపమ్ ॥ (బాల 23-3)

మహర్షి మాటలతో యిరువురు లేచి స్నానాదు లొనర్చి గాయత్రీ మహామంత్రమును జపించిరి.

**తాటకను వధించుట :**

తమ దినచర్యను ముగించుకొని ముప్వురు ముందుకు సాగిరి. గంగా సరయూనదుల సంగమమును దర్శించుచు వారు 'కామ అశ్రమమును' చేరి ఆ రాత్రి అచ్చటనే గడపిరి. మరునాడు నావలో నదిని దాటి ఆవలి ఒడ్డుకు చేరి ముందుకుపోగా కొంత తడవునకు ఒక భయంకర నిర్జనవనమును చేరిరి. విశ్వామిత్రులవారి నా వనమును గూర్చి యడుగగా సుందుని భార్య తాటకి యనురాక్షసి ఈ వనమును పెంచి ఇందు నివసించుచున్నది. నీ విప్పుడా కామచారిణియైన స్త్రీని చంపి ఈ వనమును సుగమ మొనర్చుమని శ్రీరామునితో అనిరి.

శ్లో॥ ఏనాం రాఘవ దుర్వృత్తాం యక్షీం పరమదారుణామ్ ।
గోబ్రాహ్మణ హితార్థాయ జహి దుష్ట పరాక్రమామ్ ॥ (బాల 25-14)

ఓ రామ! నీవీ దుష్టురాలు, పరమ దారుణమైన దుష్ట పరాక్రమంతురాలైన తాటకను వధించి గోబ్రాహ్మణులకు హితము చేయుము. అటువంటి స్త్రీని చంపుటకై నీ మనస్సులో సందేహముగాని, అసహ్యముగాని కలుగరాదు. అన్ని విధములా ప్రజలను రక్షించుటే రాజుల ధర్మము. పూర్వము ఇంద్రుడు మన్థరను, విష్ణువు భృగుపత్నిని చంపెను. కనుక నా ఆదేశముపై నీవిప్పుడు నిస్సంకోచముగ ఈ కార్యమును పూర్తి చేయుము అనెను.

మహర్షి విశ్వామిత్రుని ఈ ఉత్సాహపూరిత మాటలను విన్న శ్రీరాముడు చేతులుజోడించి యిట్లనెను -

**శ్లో॥ గోబ్రాహ్మణ హితార్థాత్ దేశస్యాస్య సుఖాయచ ।**
**తవచైవా ప్రమేయస్య వచనం కర్తు ముద్యతః ॥ (బాల 26-5)**

ఓ మహర్షి! మీ ఆజ్ఞానుసారము తాటకను వధించి గోవులకు బ్రాహ్మణులకు హితమొనర్చుదును. అని శ్రీరాముడు ధనస్సు నారిని బిగించివదలి పెద్ద శబ్దము చేసెను. ఆ శబ్దమును విన్న తాటక పరుగుపరుగున శ్రీరామ లక్ష్మణులవైపు వచ్చెను. శ్రీరాముడది చూచి లక్ష్మణునితో స్త్రీహత్య చేయరాదు కనుక నేను చేతులు కాళ్ళు విరుగగొట్టి ముక్కు చెవులు కోసి పంపుదుననెను. ఆ మాటలను విన్న తాటక వారిరువురిపైకి దుమికి వారికి తాను కనబడనంత దుమ్ములేపినది. చాటున దాగుకొని రామలక్ష్మణులపై రాళ్ళవర్షమును కురిపించినది. దానితో శ్రీరాము డాగ్రహముచెంది ఆమె చేతులు రెండింటిని బాణములతో ఖండించెను. లక్ష్మణుడామె ముక్కుచెవులు కోసెను. ఇంతచేసిననూ ఆ కామరూపిణియైన తాటక రాళ్ళవర్షమును కురిపించుచునే యున్నది.

అంతట విశ్వామిత్ర ఋషి రామునితో ఓ రామ! నీవిక ఈ దుష్టురాలిపై దయచూపవద్దు వెంటనే వధింపుమనెను. ఆయన ఆదేశానుసారము శ్రీరాముడు శబ్దవేది బాణములతో నలువైపులా దాడిచేసి ఒక బాణముతో ఆమె ఛాతిపై కొట్టగా ఆరాక్షసి నేలపైకొరిగి మరణించినది. ఆ వనమునకు సమీపమున నున్న ఋషి మును లాదృశ్యమును చూచి మహదానందము నొందిరి. విశ్వామిత్రుడు కూడ శ్రీరాముని లలాటమును చుంబించి (నుదిటిపై ముద్దు

పెట్టుకొని) శుభాశీస్సుల నొసంగెను. వారా రాత్రి ఆ వనమునందే గడపిరి. మరునాడు విశ్వామిత్రుడు శ్రీరాముని అత్యంత యోగ్యునిగ నెంచి అయనకు విష్ణుచక్రము, బ్రహ్మాస్త్రము, శుష్క, ఆర్ధ్ర విద్యుదస్త్రములను, మోహనాస్త్రమును, తామసాస్త్రము మున్నగు 72 అస్త్రశస్త్రములను ప్రసన్నతతో యిచ్చెను. తదుపరి వారు ముందుకుసాగిరి. దారిలో వారికొక మనోహరమైన ఆశ్రమము కనుపించెను. రాముడా ఆశ్రమ మెవరిదని యడుగగా విశ్వామిత్రుడు - 'ఇచ్చటనే మహారాజు విష్ణువు అనేక సంవత్సరములు తపమొనర్చెను. అతని తపస్సిచ్చట ఫలించినందున ఈ ఆశ్రమమునకు సిద్ధాశ్రమమని పేరు. నేనీ అశ్రమముననే యుందును. ఇచ్చటనే రాక్షసులు (దుష్టజనులు) అత్యాచారము లొనర్చుచున్నారు. ఆ దుష్టులను వధింపవలయు' ననెను.

**మరీచ సుబాహులను పరాభవ మొనర్చుట :**

ఆశ్రమమును చేరిన రాజకుమారులు కొంతతడవు విశ్రమించి తదుపరి విశ్వామిత్రునితో ఓ మునివర్య! ఈ రోజే యజ్ఞము నారంభింపుడు. మీకు శుభమగు గాక! ఇది సిద్ధాశ్రమము గనుక మీ సత్కార్యము సిద్ధించును. అనినంత విశ్వామిత్రులవారు నియమ పూర్వకముగ జితేంద్రియతతో యజ్ఞము చేయ నారంభించెను. రాజకుమారు లిరువురు అత్యంత జాగరూకతతో యాగరక్షణలో నిమగ్నులైరి.

**శ్లో॥ అనిద్రౌ షడహోరాత్రం తపోవన మరాక్షతామ్ ॥ (బాల 30-5)**

6 రాత్రుళ్ళు, పగలు నిద్రింపకుండ ఆ తపోవనమును వారు రక్షించు చుండిరి. 5 రోజులు నిరాటంకముగనే గడచినవి. ఆరవ దినమున మారీచ, సుబాహులు అనేకమంది యితర రాక్షసులతో సహా యాగమునకు విఘ్నములు కల్పింపసాగిరి. శ్రీరాము డప్పుడు మానవాస్త్రమును ధనుస్సున సంధించి మారీచుని ఛాతిపై కొట్టగా అతడు గాయములతో దూరముగా పడెను. ఆగ్నేయాస్త్రముతో సుబాహును వధించి మిగిలియున్న యితర రాక్షసులను వాయవ్యాస్త్రముతో చంపెను. ఇట్లు యాగము నిర్విఘ్నముగ పరిసమాప్తి చెందిన తదుపరి మహర్షి విశ్వామిత్రుడు శ్రీరామునితో -

శ్లో ॥ కృతార్థోఽస్మి మహాబాహో కృతం గురువచస్త్వయా ।
సిద్ధాశ్రమ మిదం సత్యం కృతం రామ మహా యశః ॥ (బాల 30-25)

ఓ మహాబాహో ! నేనీ దినము కృతార్థుడనైతిని. నీవు గురువాజ్ఞను చక్కగా పాలించితివి. ఈ ఆశ్రమమునకు 'సిద్ధాశ్రమమను' నామమును చరితార్థ మొనర్చితివి - అనిరి.

**జనకపురమువైపు ప్రయాణము :**

ఆ రాత్రి ఆశ్రమమున గడపి మరునాడు సోదరులిరువురు విశ్వామిత్రుని చరణములపై వ్రాలి, మీ సేవకులిరువురు మీకేమి సేవ చేయవలయునో ఆజ్ఞాపింపుడనిరి. మహర్షి వారితో - మిథిలాధీశుడైన జనక మహారాజు యాగ మొనర్చుచున్నాడు. మేమచ్చటకు వెళ్ళుచున్నాము నీవుకూడ మాతో రమ్ము. అచ్చట నీకొక అద్భుతమైన శ్రేష్ఠ ధనుస్సును చూపెదను అని విశ్వామిత్రుడు బయలుదేరెను. మార్గమధ్యమున రాత్రి సమయములందు విశ్వామిత్రుడు ఆ సోదరులిరువురకు వారి పూర్వ రాజుల గాథలను వినుపించుచు వారు కూడా గొప్పవారై శ్రేష్ఠ కర్మ లొనర్చుటకు ప్రేరణ నిచ్చుచుండెను. ఈ విధముగ పాదయాత్ర చేసి మిథిలా నగరమును చేరుకొన్నపుడు వారు ఆనందాతిశయముతో ఉప్పొంగిరి.

**అహల్య నుద్ధరించుట :**

మిథిలానగరము నందలి ఉద్యానవనములో ఒక పురాతన నిర్జన రమణీయ ఆశ్రమమును చూచి శ్రీరాముడు ఓ మునివర్య! ఈ ఆశ్రమ మత్యంత శోభాయమానముగ నున్నది. కాని యిచ్చట ఋషులెవరును కనబడుటలేదు. కారణమేమని యడుగగా మహర్షి విశ్వామిత్రుడు ఆ ఆశ్రమ వృత్తాంతమును తెలుపుచు - ఓ రామ ! ఇది గౌతమ ఋషి ఆశ్రమము. ఈ ఆశ్రమమున ఆయన తన భార్య అహల్యతో చాలా సంవత్సరములు తపమాచరించుచుండిరి. ఒకనాడు గౌతమఋషి ఎచ్చటకో దూరముగ వెళ్ళెను. ఆయన లేనిసమయమున ఇంద్రుడు అహల్యతో కలసి వెళ్ళుచున్న సమయమున గౌతముడు కూడ అచ్చటికి వచ్చెను. తన రూపములో నున్న ఇంద్రుని చూచి పరిస్థితి నర్థము చేసుకొని వెంటనే ఇంద్రునితో గౌతమ ఋషి

యిట్లనెను -

శ్లో ॥ మమరూపం సమాస్థాయ కృతవానసి దుర్మతే ।
**అకర్తవ్య మిదం తస్మా ద్విఫలస్త్వం భవిష్యసి ॥ (బాల 48-28)**

ఓరి దుష్టుడా! నా రూపమును ధరించి నీవు చేయరాని నిందిత కర్మ నొనర్చితివి. అందువలన నీవు నపుంసకు డగుదువుగాక! (దురాచారి నపుంసకుడే యగును) అని తదుపరి అహల్యతో యిట్లనిరి -

శ్లో॥ వస వర్ష సహస్రాణి తప్యంతీ భస్మశాయినీ ॥ (బాల 48-31)

నీవు భూమిపై శయనించుచు కఠోర తపమొనర్చుచు అనేక సంవత్సరము లిచ్చటనే నివసింపుము. అని గౌతముడు తపమాచరించుటకై హిమాలయ శిఖరములపైకి వెళ్ళిపోయెను. నీ విప్పుడీ ఆశ్రమమునకు వెళ్ళి -

శ్లో॥ తారయైనాం మహాభాగా మహల్యాం దేవరూపిణీమ్ ॥ (బాల 49-12)

దేవరూపిణియైన అహల్యాదేవి నుద్ధరింపుమనెను. తదుపరి రామలక్ష్మణులు మహర్షితో ఆశ్రమమున ప్రవేశించిరి.

శ్లో॥ దదర్శంచ మహాభాగాం తపసా ద్యోతిత ప్రభామ్ ।
లోకైరపి సమాగమ్య దుర్నిరీక్ష్యాం సురాసురైః ॥ (బాల 49-13చ 14)

అచ్చట వారికి తపఃప్రభావముచే వెలుగొందుచున్న అహల్య కనుపించెను. సురులు, అసురులు, మానవమాత్రులెవరును ఆమెను దర్శింపజాలరు.

శ్లో॥ రాఘవౌ తు తత స్తస్యాః పాదౌ జగృహతుర్ముదా ॥ (బాల 49-18)

శ్రీరాముడు లక్ష్మణుడు ప్రసన్నతతో అహల్య చరణములను తాకిరి. (శ్రీరాముని పాదస్పర్శతో శిలారూపములోనున్న అహల్య శాపవిముక్తి పొందిన దనుమాట సరికాదు. ఏలయన వాల్మీకి రామాయణము ననుసరించి శ్రీరాముడు శిలను తన పాదములతో తాకలేదు. ఆయన లక్ష్మణుడు అహల్య చరణములను స్పృశించి నమస్కరించిరి) అహల్య కూడ సోదరులిరువురకు ఆదరసత్కారములు చేసెను. అదే సమయమున గౌతముడుకూడ ఆశ్రమమునకు వచ్చి అహల్యను చూచి అత్యంత ఆనందము నొందెను. అనంతరము శ్రీరాముడు మిథిలానగరము వైపుకు వెళ్ళెను.

**మిథిలా నగరములో :**

అహల్యను ఉద్ధరించిన పిదప రామలక్ష్మణులతో విశ్వామిత్ర ఋషి మిథిలానగరమున ప్రవేశించెను. జనకమహారాజు వారికి ఆదర సత్కారములతో ఆతిథ్యము నిచ్చి విశ్వామిత్రుల వారితో -

శ్లో ॥ ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్య పరాక్రమౌ ॥ (17)
గజసింహగతీ వీరౌ శార్దూల వృషభోపమౌ ॥ (18)
అశ్వినావివ రూపేణ సముపస్థిత యౌవనౌ ॥ (19)
కథం పద్భ్యామిహప్రాప్తౌ కిమర్థం కస్య వా మునే ॥ (20)
(బాల 50-17 నుండి 20)

(✦ ఇచ్చట శ్రీరామ లక్ష్మణులను 'సముపస్థిత యౌవనే' అనగా యౌవనావస్థలో నున్నట్లు చెప్పబడినది. సుశ్రుత - సంహిత సూత్రస్థానములో (35-25) 'ఆ త్రింశతో యౌవనమ్')

ఓ మునివర్య! దేవతలతో సమాన బల పరాక్రమములు గలిగి ; ఏనుగు, సింహము, పులి మరియు వృషభము వంటి నడక గలిగి; సౌందర్యములో అశ్వినీకుమారులను బోలినట్టి యౌవనావస్థలో నున్న వీరిరువురు కాలినడక యిచ్చట కెందులకు వచ్చిరి? వీరెవరి పుత్రులు? అని అడుగగా విశ్వామిత్రుల వారు - వీరిరువురు దశరథ మహారాజు పుత్రులని చెప్పచూ వారి రాకకు కారణమును, యాగరక్షణ మొదలు అహల్యా ఉద్ధరణ వరకు తెలిపి వీరు నీ వద్దనున్న సుప్రసిద్ధ ధనుస్సును చూడగోరుచున్నా రనెను.

**ధనుస్సును విరచి సీతను పరిణయమాడుట :**

జనక మహారాజు ఆ ధనస్సును తెప్పించుట కాజ్ఞ నిచ్చెను. అతిబలశాలురు ఎనిమిది చక్రములుగల పెట్టెలో ధనస్సును పెట్టి లాగుకొని వచ్చిరి. అప్పుడు జనకుడు - 'గొప్పగొప్ప పరాక్రమశాలురు కూడ ఎత్తజాలనట్టి శ్రేష్ఠ ధనుస్సు ఇది. మహర్షి ! రాజకుమారులు దీనిని చూచుటకు అనుజ్ఞనిండు' అనెను. మహర్షి ఆజ్ఞనుపొంది శ్రీరాముడు ధనుస్సున్న పెట్టెను తెరచి చూచి యిట్లనెను. ఓ ఋషివర్య! నేనీ ధనుస్సును ఎత్తి ఎక్కుపెట్టుదుననగా ఆయన అంగీకరించెను. జనక మహారాజు విశ్వామిత్రుల, యిరువురి

అంగీకారమును పొందిన శ్రీరాముడు వేలాది ప్రజలముందు ఆ ధనుస్సునెత్తి నారిని బిగించుచుండగా అది విరిగి రెండు ముక్కలైనది. సభలోనివారంతా ఆశ్చర్యచకితులై ధన్యుడవు - ధన్యుడవని అరచిరి. జనకరాజు కూడ ఆనందముతో -

శ్లో ॥ మమ సత్యా ప్రతిజ్ఞాచ వీర్య శుల్కేతి కౌశిక ।
సీతాప్రాణై ర్బహు మతా దేయా రామాయ మే సుతా ॥ (బాల 67-23)

ఓ కౌశిక ! నేను సీత వివాహము చేయుటకు ఏ వీర్య వంతుని కొఱకై ప్రతిజ్ఞ నొనర్చితినో అది నేడు పూర్తియైనది. నేను నా ప్రాణములకంటె ప్రియమైన నా పుత్రిక సీతను శ్రీరామున కిచ్చి వివాహము చేయుదుననెను. తదుపరి విశ్వామిత్రుని ఆజ్ఞను తీసుకొని దశరథ మహారాజున కీ శుభవార్తను పంపెను. వార్తాహరులు వేగవంతమైన రథములలో పయనించి 4 రోజుల తరువాత అయోధ్యానగరమును చేరి దశరథ మహారాజు సభలో ప్రవేశించి మహారాజా! జనక మహారాజు మీయొక్క మీ నగరవాసుల క్షేమ సమాచారములను విచారించిరి. తదుపరి విశ్వామిత్రులవారి అనుమతితో వారి సందేశమునుపంపిరి.

శ్లో ॥ పూర్వం ప్రతిజ్ఞా విదితా వీర్యశుల్కా మమాత్మజా॥ (8)
రాజానశ్చ కృతామర్షా నిర్వీర్యా విముఖీకృతాః ।
సేయం మమ సుతా॰ రాజన్విశ్వామిత్ర పురః సరైః ॥ (9)
యదృచ్ఛ్యా ఆగతై ర్వీరైర్నిర్జితా తవ పుత్రకైః ॥ (10)

(బాల. 68-8 నుండి 10)

(॰సీతాదేవిని గూర్చి లోకములో ఆమె భూమినుండి పుట్టినదని ప్రసిద్ధి. కానిరామాయణములో ఆమెను - 'మమాత్మజా, మమ సుతా, జనకసుతా, జనకస్యైవ కులే జాతా (బాలకాండ 1-26) మున్నగు వర్ణనలు కలవు)

'నా పుత్రిక వీర్యశుల్కా యని మీకు తెలిసినదే. అనేకమంది రాజు లామెకొఱకు ప్రయత్నించి విముఖులైరి. నా అదృష్టము వలన విశ్వామిత్ర ఋషితో వచ్చి మీ పుత్రుడు నా పుత్రికను జయించెను. కనుక నా పుత్రిక వివాహమును మీ పుత్రునితో చేయగోరుచున్నాను' అని దూత సందేశమును

విన్న మహారాజు దశరథుడు అత్యంత ప్రసన్నుడయ్యెను. తన మంత్రులతో 'యది వో రోచతే వృత్తమ్' మీ కంగీకారమైనచో వెంటనే జనకపురికి ప్రయాణ సన్నాహము లొనర్చుడనెను. ప్రయాణ సన్నాహములు అట్టహాసముగ జరుపబడి మరునాడు వశిష్ఠాది ఋషులతో దశరథ మహారాజు బయలుదేరి 5వ రోజున మిథిలానగరము చేరుకొనెను.

జనక మహారాజు ప్రేమాదరములతో అందరికి అతిథి సత్కారము లొనర్చెను. మరునాడు యిరువురు రాజులు తమ పురోహితులతో ఒక స్థానమున కలుసుకొనిరి. వశిష్ఠుడు దశరథ మహారాజు వంశచరిత్రను వినిపించి జనకునితో తనపుత్రిక సీతను రామునకు, ఊర్మిళను లక్ష్మణునకు యిచ్చి వివాహ మొనర్పవలసినదిగ ప్రార్థించెను. జనక రాజు తన వంశచరిత్రను శ్రీముఖుని ద్వారా వినిపించెను. అప్పుడు విశ్వామిత్రుడు జనకునితో రాజా! మీ సోదరుడు కుశధ్వజుని యిరువురి కన్యలను భరత శత్రుఘ్నుల కివ్వగోరుచున్నా ననగా జనకుడు సంతోషముతో అంగీకరించి తదుపరి వివాహ ముహూర్తములను నిర్ణయించిరి.

శ్లో॥ సువర్ణ శృగాః సంపన్నాః సవత్సాః కాంస్య దోహనా ః ।
**గవాం శత సహస్రాణి బ్రాహ్మణేభ్యో నరాధిపః ॥ (బాల. 72-23)**

దశరథ మహారాజు బ్రాహ్మణులకు లక్షల గోవులను దానమిచ్చెను. ఆ ఆవు కొమ్ములకు బంగారు రేకులు తొడగబడినవి. అవి చక్కగా పాలిచ్చు గోవులు. వానితో వాని పిల్లలుకూడ ఉన్నవి. ప్రతిగోవుతోపాటు పాలు పిండుకొనుట కొక లోహపాత్ర యుండెను. నిశ్చయించిన తిథిలో వేద మంత్రములతో అగ్నిహోత్రములో ఆహుతులిచ్చుచు సీతారాముల పాణిగ్రహణ సంస్కారము జరిగినది. తన పుత్రిక సీతను శ్రీరామున కప్పగించుచు జనకుడు-

**శ్లో॥ ఇయం సీతా మమ సుతా సహధర్మచారీ తవ ।**
**ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా ॥ (బాల. 73-26)**

"ఓ రామ! నా పుత్రిక సీత నేటినుండి నీ సహధర్మచారిణియైనది. ఈమె పాణిని గ్రహించి ఈమెను స్వీకరింపుము" అనెను. లక్ష్మణాదుల వివాహ

సంస్కారములు కూడా అత్యంత వైభవముగ జరిగినవి. వివాహము నందలి యితర కార్యములు ముగిసిన తదుపరి మరునాడు మహర్షి విశ్వామిత్రుడు దశరథ, జనక మహారాజు లిరువురివద్ద సెలవు తీసుకొని హిమాలయముల వైపుగ వెళ్ళెను. మహారాజు దశరథుడు కూడా బయలుదేరుటకు సిద్ధము కాగా జనకమహారాజు ధన ధాన్యములు, ఖరీదైన వస్త్రములు, ఏనుగులు, గుఱ్ఱములు, రథాదులను బహుకరించి వారికి వీడ్కోలు చెప్పెను.

**పరశురాముని పరాభవము :**

దశరథ మహారాజు తన చతురంగబలముతో అయోధ్యకు బయలు దేరెను. కొద్దిదూరము వెళ్ళిన తరువాత వారికి జటాజూటధారియై భయంకర రూపమును ధరించి అనేకమంది రాజుల నవమాన మొనర్చిన జమదగ్ని కుమారుడు పరశురాముడు వారి కెదురయ్యెను. ఋషి మునులందరూ భయభీతులై మరల ఈయన క్షత్రియ సంహారమునకు బయలుదేరెనా? యని తలంచుచు పరశురామునకు పాద్యమును అర్ఘ్యమును సమర్పించిరి. వానిని స్వీకరించిన తదుపరి ఆయన శ్రీరామునితో 'నేను నీ బలపరాక్రమములను గూర్చి వింటిని. నేను మరొక విల్లును తీసుకొని వచ్చితి' ననెను.

**శ్లో॥ పూరయస్వ శరేణేవ స్వబలం దర్శయస్వ చ ।**
**తదహం తే బలం దృష్ట్వా ద్వన్ద్వ యుద్ధం ప్రదాస్యామి ॥ (బాల. 75-4)**

"నీవీ వింటి నారిని బిగించి నీ బలమును ప్రదర్శింపుము. నీ బలమును చూచి నీతో మల్లయుద్ధము చేయుదును." అనగా విని దశరథ మహారాజు దుఃఖించుచూ తన పుత్రుని రక్షింపుమని పరశురాముని ప్రార్థించెను. దశరథుని మాటలను వినకుండా రామునితో ధనుస్సును ఎక్కుపెట్టుమని బలవంతము చేయుచున్న పరశురామునితో శ్రీరాముడు - మీ పరాక్రమమును గూర్చి నేను వింటిని. కాని -

**శ్లో॥ వీర్యహీన మివాశక్తం క్షత్ర ధర్మేణ భార్గవ ।**
**అవజానాసి మేతేజః పశ్యమేzద్య పరాక్రమమ్ ॥ (బాల. 76-3)**

మీరు మమ్ములను వీర్యహీనులుగ క్షాత్రధర్మ రహితులుగ తలంచి మా తేజస్సును అనాదరము చేయుట మేము సహింపజాలము. మా

పరాక్రమమును చూడుడు. అని క్రోధముతో పరశురాముని చేతిలో నుండి ధనుర్బాణములను లాగుకొని ధనస్సును ఎక్కుపెట్టి యిట్లనెను.

**శ్లో॥ బ్రాహ్మణోఽసీతి మే పూజ్యో విశ్వామిత్ర కృతేన చ ।**

**తస్మాచ్ఛక్తోనతే రామ మోక్తుం ప్రాణహరం శరమ్ ॥ (బాల. 76-6)**

"ఓ పరశురామ! మీరు బ్రాహ్మణులైనందున నాకు పూజ్యులు పైగా మీరు విశ్వామిత్రులవారికి బంధువులైనందున మీ ప్రాణములు తీయకుండ విడిచిపెట్టుచున్నాను. కాని ఈ బాణముతో మీకు తిరుగాడు శక్తిని నాశన మొనర్తును. లేదా మీరు అర్జించిన కీర్తిని నాశనము చేయుదును. మీకేది యిష్టమో చెప్పండి" అన్న శ్రీరాముని ముందు పరశురాముడు జడునివలె నిర్వీర్యునివలెనై నెమ్మదిగ రామునితో నిట్లనెను. మీరు నా తిరుగాడు శక్తిని నష్టము చేయవద్దు. నేను క్షత్రియసంహార మొనర్చి ఆర్జించిన కీర్తిని నష్టమొనర్చుడు. అనగా రాముడందుల కంగీకరించెను. పరశురాముడు శ్రీరాముని చుట్టూ ప్రదక్షిణ చేసి మహేంద్ర పర్వతమునకు వెళ్ళిపోయెను. పరశురాముడు వెళ్ళిపోగానే శ్రీరాముడుదశరథ మహారాజు సేనలను అయోధ్యా నగరమునకు పోవుట కాజ్ఞ నొసంగెను. అందరూ ఆనందముతో నగరము చేరిరి. నగరవాసులు ఆనందోత్సాహములతో వారికి స్వాగతము పలికిరి. కుమారులతో సహా మహరాజు రాజమహలు కెళ్ళెను. కౌసల్య సుమిత్ర కైకేయిలు కూడా తమ కోడళ్ళకు స్వాగతము పలికిరి.

**శ్లో॥ అభివాద్యాభి వాద్యాంశ్చ సర్వారాజసుతాస్తదా । రేమిరే ముదితా :**

**సర్వా భర్తృభిః సంహితా రహః ॥ (బాల. 77-14)**

కోడళ్ళంతా తమ అత్తలకు యితరస్త్రీలకు నమస్కరించిరి. తదుపరి వారు తమ పతులతో కలిసి ఏకాంత గృహములకుచేరి ఆనందముతో నివసింప సాగిరి.✦

**✦(శ్లో॥ మమభర్తా మహాతేజా వయసా పంచవింశక : ।**

**అష్టాదశహి వర్షాణి మమ జన్మని గణ్యతే ॥ (అరణ్య. 47-10)**

కొందరు సీతారాముల వివాహసమయమున సీతాదేవి వయస్సు 6 సం॥లని శ్రీరాముని వయస్సు 13 సం॥లని చెప్పుదురు. కాని పై శ్లోకమున

సీతాదేవి తన పర్ణశాలకు సంన్యాసి రూపముతో వచ్చిన రావణునితో తన వయస్సు 18సం॥లని చెప్పినది. ఇట్లే అయోధ్యకాండ 118-34 శ్లోకమున సీతాదేవి ఋషి పత్ని అనసూయతో చెప్పెను. )

కొంతకాలము తరువాత భరత శత్రుఘ్నులు తన మామగారైన యుధాజిత్‌తో కేకయ (కాశ్మీర్) దేశమున కెళ్ళిరి. తండ్రి ఆజ్ఞప్రకారము శ్రీరామచంద్రుడు నగరవాసుల కుపయోగించు పనులు చేయుచుండెను.

**రాజ్యాభిషేకము :**

రాజునకు తన నలుగురు పుత్రులపై ప్రేమయున్నను, శ్రీరామునిలో గల అనేక గుణములు కారణముగ ఆయనపై విశేషానురాగములు కలవు. ఆయన అత్యంత బలశాలి, సత్యవాది, దయాళువు, ప్రియభాషి అంతేగాక -

శ్లో ॥ **సమ్యగ్విద్యా వ్రతస్నాతో యథావత్సాంగవేదవిత్ ।**
**ఇష్వస్త్రేచ పితుః శ్రేష్ఠో బభూవ భరతాగ్రజః ॥**
**ధర్మకామార్థ తత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్ ।**
**లౌకికే సమయాచారే కృతకల్పో విశారదః ॥ (అయోధ్యా. 1-20;22)**

ఆయన సాంగోపాంగముగ వేదముల నధ్యయనమొనర్చి యథావిధిగ బ్రహ్మచర్య వ్రతదీక్షను పాటించి స్నాతకుడయ్యెను. అందువలన ఆయన సాంగముగ వేదముల నెరిగిన తత్త్వజ్ఞుడు. విలువిద్యలో తండ్రిని మించినవాడు. ధర్మ, అర్థ, కామముల తత్త్వము నెరిగినవాడు, విలక్షణమైన స్మృతి, ప్రతిభలు కలిగి లోకాచారము, లోకానుభవము గలవారు. ఇట్టి శ్రేష్ఠగుణములు గలిగియున్న కుమారుని తనకు వార్ధక్యము సమీపించినందున దశరథ మహారాజు యువరాజును చేయుటకు నిశ్చయించెను. ఈ కార్య నిర్వహణానుమతికై వారు రాజసభ సమావేశము నేర్పరచి అనేక నగర, సామంత దేశములందు నివసించు ముఖ్యవ్యక్తులను రాజులను ఆహ్వానించెను. ఆహూతులందరి ఎదుట గంభీరధ్వనితో రాజు - మా పూర్వవంశ రాజులు ఈ విశాల సామ్రాజ్యము నెట్లు పాలించిరో మీ కందరకూ తెలిసినదే. నేను కూడ వారి అడుగుజాడలలోనే నాశక్త్యానుసారముగ ప్రజాపాలన గావించితిని. నేనిప్పుడు వృద్ధుడనైతిని. గనుక ఇక్ష్వాకు రాజులు పాలించిన ఈ రాజ్యమును

ఈ మహాసభ నలంకరించిన ద్విజుల సమ్మతితో నేను నా జ్యేష్ఠ పుత్రుడు రామునకు అప్పగించి విశ్రాంతి తీసుకొనగోరుచున్నాను.

శ్లో॥ యదీదం మే ऽనురూపార్థం మయాసాధు సుమన్త్రితమ్ ।
భవన్తో మేऽనుమయన్తాం కథం వా కరవాణ్యహమ్ (అయోధ్యా. 2-15)

నా యీ ఆలోచన ఉచితము, యోగ్యమైనదైనచో మీరు మీ అంగీకారమును తెలుపుడు. లేనిచో ఏది ఉచితమో దానిని తెలుపుడు. అనిన మహారాజు మాటలకందరూ దట్టమైన మేఘములను చూచి నెమలి నాట్యమాడు చందమున అత్యంతానందము నొందిరి. బాగు - బాగు - చాలా బాగున్నదనుచు సభికుల కరతాళధ్వనులతో సభాభవనము ప్రతిధ్వనించినది. మహారాజు వారి సమ్మతికి సంతోషమును ప్రకటించుచు వశిష్ఠులవారితో నిట్లనెను. -

శ్లో॥ చైత్రః శ్రీమానయం మాసః పుణ్యః పుష్పిత కాననః ।
యౌవ రాజ్యాయ రామస్య సర్వమేవోప కల్ప్యతామ్ ॥ (అయోధ్యా. 30-4)

నవజాత పుష్ప లతలతో సుశోభితమైన ఈ పవిత్ర చైత్రమాసములో రాముని రాజ్యాభిషేకమునకై ఏర్పాట్లు చేయించండి. మహారాజు అనిన మాటలను విన్న సభికులు మరొకసారి ఆనందోత్సాహాలను ప్రకటించిన అనంతరము సభ ముగిసినది. అందరూ అటునిటు తిరుగసాగిరి. వశిష్ఠులవారు రాజ్యాభిషేకము నకు సన్నాహములను చేయుటలో నిమగ్నులైరి. మహారాజు శ్రీరాముని కొరకు సుమంత్రునితో కబురంపెను. వెంటనే శ్రీరాముడు రథము దిగివచ్చి-

శ్లో॥ స ప్రాంజలి రభిప్రేత్య ప్రణతః పితురంతికే ।
నామ స్వం శ్రావయన్ రామో వవన్దే చరణౌపితు ః ॥ (అయోధ్యా. 3-33)

మహారాజును సమీపించి చేతులు జోడించి తన నామము నుచ్చరించి తండ్రికి ప్రణమిల్లెను. మహారాజతనిని కౌగలించుకొని తనతో సమానముగ ఉన్నత స్వర్ణాసనముపై కూర్చుండబెట్టి రాజనీతికి సంబంధించిన సుందరోపదేశమును మరియు అతనికి జరుగబోవు పట్టాభిషేకమును గూర్చి సూచన నిచ్చి పంపివేసెను. శ్రీరాముని హితమును గోరు మిత్రులు ఈ శుభవార్తను మహారాణి కౌసల్యాదేవికి తెలియజేసిరి.

మరునాడు పుష్యమీ నక్షత్రము - ప్రాతఃకాలముననే రామునకు పట్టాభిషేకమును నిశ్చయించి దశరథుడు, అంతఃపురమునకు వెళ్ళి శ్రీరాముని తనవద్దకు తీసుకొని రమ్మని సుమంత్రుని ఆదేశించెను. రాముడు రాగా దశరథుడాయనతో - కొద్దిరోజులుగ నాకు ఘోర విపత్తును సూచించు భయంకర అశుభ స్వప్నములు వచ్చుచున్నవి. కనుక నామతి స్థిరముగ నుండగనే నీ రాజ్యాభిషేకము జరుగవలయును.

**శ్లో॥ విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదిత : ।**
**తావ దేవభిషేకస్తే ప్రాప్తకాలో మతో మమ ॥ (అయోధ్యా. 4-25)**

"భరతు డిప్పుడు తన మామగారివద్ద నున్నాడు. వాడు వచ్చుటకు ముందుగనే నీ పట్టాభిషేకము పూర్తికావలయునని నా కోరిక" అనెను. శ్రీరాముడు తండ్రి మాటలను విని ఆయన ఆజ్ఞను తీసుకొని తల్లి కౌసల్యవద్దకు రాగా సుమిత్ర, లక్ష్మణుడు, సీత అచ్చటనే యుండిరి. రాముని రాజ్యాభిషేక వార్తను విని వారందరూ ఆశ్చర్యచకితులైరి. శ్రీరాముడు తల్లులిరువురకు ప్రణమిల్లి సీతతో తన నివాసమునకు వచ్చెను. ఇంతలో వశిష్ఠులవారచ్చటికి వచ్చి రాజ్యాభిషేక యజ్ఞమునకు సీతారాము లిరువురు వ్రతమాచరింప వలయునని ఆదేశించి వెళ్ళిపోయెను. గురువు ఆదేశానుసారము సీతారాములు స్నానమాచరించి యిరువురు అగ్నిహోత్రమును చేసి - 'ధ్యాయన్నారాయణం దేవం స్వాస్తీర్ణే కుశసంస్తరే' । (అయోధ్యా. 6-3) కుశ ఆసనంపై కూర్చుండి తమకు శుభము కలుగుటకై పరమపిత పరమేశ్వరుని ప్రార్థింపసాగిరి. ఆరాత్రంతా సీతారాములు ప్రార్థన ఉపాసనలు చేయుచునే గడపిరి. రాముని పట్టాభిషేక వార్త నగరమంతా వ్యాపించినది. ఈ ఆనంద వార్తను విన్న నగరవాసులు నగరమును సుందరముగ నలంకరింపసాగిరి. ప్రతిచోట పచ్చని మామిడాకు తోరణములతో అరటిచెట్లు పాతి రాజమార్గములలో ఝుండాల నెగురవేసిరి. అయోధ్యా నగరమును పెండ్లికుమార్తెవలె నలంకరించిరి. ప్రజలంతటా రాముని రాజ్యాభిషేకమును గూర్చియే చర్చించుచుండిరి.

**ఆశాభంగము :**

రాణి కైకేయీ దాసి మన్థర ఆరోజున ఆకస్మికముగ తన మహలుపైకి

ఎక్కి చూడగా ఆనందోత్సాహములతో ఓలలాడుతున్న అయోధ్యావాసులు, అత్యంత సుందరముగ అలంకరింపబడి యున్న అయోధ్య కనుపించెను. అందుకామె ఆశ్చర్యము నొంది తన పరిచారికలను అడుగగా - రేపు శ్రీరాముని పట్టాభిషేకము జరుగునని, అందుకే ఈ అలంకరణ లన్నియు జరుపబడుచున్న వనియు వారు చెప్పిరి. ఆ మాటలను విన్న మన్థర కోపోద్రేకముతో మండిపడుచు కైకేయీ అంతఃపురమునకేగి ఆమెను లేపి మూఢురాలా! లే, నిద్రించుచున్నావా? పెద్ద ఆపద వచ్చిపడినది. రేపు రాముని రాజ్యాభిషేకము. కనుక నీపుత్రుని, నిన్ను, నన్ను రక్షించుకో అనెను. మంథరద్వారా శ్రీరాముని పట్టాభిషేక వార్త వినినకైకేయీ ఆనందభరితురాలైనది.

**శ్లో॥ దివ్యమాభరణం తస్యై కుబ్జాయై ప్రదదౌ శుభమ్ ।**

**(వా.రా. అయోధ్యా. 7-32)**

ఓ మన్థర ! నీవొక అత్యంత ఆనందప్రదమైన వార్తను తెలిపితివి. అని ఒక ఖరీదైన హారమును కుబ్జాకిచ్చి, ఇంకా ఏమికావాలో కోరుకో అనెను.

**శ్లో ॥ రామే వా భరతే వా z హం విశేషం నోపలక్షయే ।**
**తస్మాత్తు ష్టా z స్మి యద్రాజా రామం రాజ్యే z భిషేక్ష్యతి ॥**

**(వా.రా. అయోధ్యా. 7-35)**

నాకు రాముడు, భరతుడు ఒక్కటే. మహారాజు రామునకు రాజ్యము నిచ్చిన నాకు సంతోషమే. ఓ సఖీ! ఈ అమృత తుల్య వార్తను వినిపించినందులకు ఈ హారముతోపాటు యింకా ఏదైనా బహుమానము కావలసినచో నీకు నేనిత్తును అనెను. మంథర ఆ హారమును విసిరివైచి కైకేయీకు లేనిపోని మాటలు చెప్పచుండగా కైకేయీ రాముని గుణములను వర్ణించుచు రాముడు ధర్మజ్ఞుడు, సుగుణ సంపన్నుడు, జితేంద్రియుడు, సత్యవాది, పవిత్రుడు మరియు జ్యేష్ఠుడైనందున ఆయన రాజ్యపాలన కధికారి యగును. రాముడు తన సోదరులను, సేవకులను తన పుత్రులవలె పాలించును. అటువంటి రాముని పట్టాభిషేక వార్త విని నీ వెందులకు దుఃఖించుచున్నావు? అనెను.

**శ్లో॥ యథా మే భరతో మాన్య స్తథా భూయోఽపి రాఘవః ।**
**కౌసల్యాతోzతిరిక్తం చ సోzనుశుశ్రూషతే హి మామ్ ॥** (వా.రా. అయోధ్యా. 8-18)

భరతుడు నాకెట్లు ప్రియమో రాముడంతకంటె ప్రియము. రాముడు కౌసల్యకంటె నాకే అధికముగ సేవచేయును. అనిన కైకేయీ మాటలు విన్న మంథర ఎంతో దుఃఖముతో తిరిగి నచ్చజెప్పసాగినది. చివరకు మన్థర ఇంద్రజాలము కైకేయీపై పనిచేసినది. కైకేయీ మన్థరను భరతునకు రాజ్యము లభించు ఉపాయమునడుగగా ఆమె - నీవు మాసిన వస్త్రములను ధరించి కోపగృహములో నేలపై పరుండుము. మహారాజు రాజ్యాభిషేక సమాచారమును గూర్చి తెలుపుటకు నీవద్దకు వచ్చినపుడు నీవు దేవాసుర యుద్ధసమయములో మహారాజు నీకిచ్చిన రెండు వరముల మాటను గుర్తుచేసి భరతునకు పట్టాభిషేక మొనర్చుట మొదటి వరముగ, రాముని 14 సంవత్సములు వనవాసమున కంపుట రెండవ వరముగ కోరుమని చెప్పెను. రాముని పట్టాభిషేకమునకు అన్ని ఏర్పాట్లు చేయవలసినదిగ మంత్రుల కాజ్ఞాపించి ఈ సంతోషవార్తను రాణులకు తెలియజేయుటకై రాజు మున్ముందుగ కైకేయీ అంతఃపురమునకు వెళ్ళెను. అచ్చట ఆమె కనబడనందున కాపలావాని నడిగి ఆమె కోపగృహమున నున్నట్లు తెలుసుకొని అచ్చటకు వెళ్ళి ఆమె నేలమీద పరుండియుండుట చూచి - నీవు కోపించుటకు కారణమేమి? నిన్నెవరైనా అవమాన మొనర్చిరా లేక అనారోగ్యముగ నున్నావా? నీకేమి కావలయునో చెప్పుమని కైకేయీ నడిగెను.

**శ్లో॥ కరిష్యామి తవప్రీతిం సుకృతే నాపి తే శపే ॥ (వా.రా. అయోధ్యా. 10-36)**

నా పుణ్యకర్మలపై శపథముచేసి చెప్పుచున్నాను. నీవు చెప్పినట్లు చేయుదును. అనిన దశరథునితో కైకేయీ - 'మీరు నాకొక కార్యము చేయవలయును. చేయుదునని ప్రతిజ్ఞ చేసినచో నేనా విషయమును చెప్పుదు ననగా దశరథుడట్లే శపథము చేసెను. 'దేవాసుర యుద్ధము మీకు గుర్తుండియే యుండును. శత్రువుల బాణములతో మీరు మూర్ఛనొందగా మిమ్ములను రక్షించితిని. అప్పుడు మీరు నాకు రెండు వరముల నిచ్చిరి. ఆ వరములను నేను మీవద్ద 'ధరోహర' రూపమున దాచుకుంటిని. ఆ రెండువరముల నిప్పుడు కోరుచున్నాను. మొదటివరముగ రాముని స్థానమున భరతునకు రాజ్యాభిషేకమును చేయుట, రెండవ వరముగ నారబట్టలను మృగచర్మములను ధరించి శ్రీరాముడు 14 సంవత్సరములు అరణ్యవాసము చేయవలయును.

నాకు ఈ రెండు వరముల నిచ్చి మీ ప్రతిజ్ఞను నెరవేర్చుకొనిన సరే, లేనిచో నేను విషమును మ్రింగి ప్రాణములను త్యజింతుననెను'. కైకేయీ యొక్క ఈ కఠోర వచనములను విన్న దశరథుడు ఎంతో దుఃఖించుచు సంతాప హృదయముతో కోపముగ నిట్లనెను -

శ్లో॥ **కిం కృతం తవ రామేణ పాపే పాపం మయాఽపి వా ।**
**సదా తే జననీతుల్యాం వృత్తిం వహతి రాఘవః ॥**

**(వా.రా. అయోధ్యా. 12-8)**

శ్రీరాముడు గాని, నేనుగాని, నీకేమి హాని చేసితిమి ? శ్రీరాముడు నిన్ను తల్లితో సమానముగ గౌరవించెను. శ్రీరామునందరూ ప్రశంసించుచున్నారు. అటువంటి శ్రేష్ఠపుత్రుని ఏ ఆరోపణతో త్యాగమొనర్తును? రాముడు లేకుండా నేను జీవింపలేను. కనుక నీ మొండి పట్టుదలను విడిచిపెట్టుము.

శ్లో॥ **అపి తే చరణౌ మూర్ధ్నా స్పృశామ్యేష ప్రసీ దమే ।**

**(వా.రా. అయోధ్యా. 12-15)**

నీ కాళ్ళు పట్టుకుంటాను. అనుచిత వరములను అడుగకుము. ప్రసన్నముగ నుండుము. నీకు భరతునివలెనే శ్రీరాముడు కూడ ప్రియమైన వాడని నీవే నాతో అనుచుండెడిదానవు కదా! ఆ రాముని వనముల కంపుట నీకు బాగుగా నుండునా?

శ్లో॥ **సత్యం దానం తపస్త్యాగో మిత్రతా శౌచ మార్జవమ్ ।**
**విద్యాచ గురుశుశ్రూషా ధృవాణ్యేతాని రాఘవే ॥ (వా.రా. అయోధ్యా. 12-30)**

సత్యభాషణము, దానగుణము, తపము, త్యాగము, మిత్రత, పవిత్రత, సరళత, విద్య, గురుజనులసేవ మున్నగు సద్గుణములన్నియు నిశ్చయముగ రామునిలో గలవు. అటువంటి వానిని నీవు వనములకెందుకు పంపగోరుదువు?

శ్లో॥ **అంజలిం కుర్మి కైకేయీ పాదౌ చాపి స్పృశామితే ।**
**శరణం భవ రామస్య మా ధర్మో మామిహ స్పృశేత్ ॥**

**(వా.రా. అయోధ్యా. 12-36)**

ఓ కైకేయి! చేతులు జోడించి నీ పాదములపై మోకరిల్లుదును. నీవు రామచంద్రుని రక్షింపుము. నన్ను ప్రతిజ్ఞాభంగమునుండి రక్షింపుము. అని

ఈవిధముగా మహారాజు దశరథు డెంత బ్రతిమాలినను కైకేయి తన దురాగ్రహమును విడువక మహారాజా! మీరు మాటిచ్చి తప్పుదురా? ఇది అధర్మము. మీరు మీ ప్రతిజ్ఞను పాలింపకున్నచో -

**శ్లో॥ అహం హి విషమద్యైవ పీత్వా బహు తవాగ్రతః ।**
**పశ్యతస్తే మరిష్యామి రామో యద్యభిషిచ్యతే ॥**

**(వా.రా. అయోధ్యా .12-47)**

మీరు మాటతప్పి రామునకు రాజ్యాభిషేక మొనర్చినచో నేను విషమును మ్రింగి మీ కళ్ళముందే ప్రాణములు విడుతును. అనిన కైకేయి మాటలను విన్న మహారాజు అత్యంత దుఃఖముతో మాటిమాటికి మూర్ఛనొందసాగెను. మధ్యలో తెలివి వచ్చినపుడు కైకేయిని నిరసించుచుండెను. కాని కైకేయిపై దాని ప్రభావ మేమియును పడలేదు. అయన అనేక వందలసార్లు రాముని వనములకు పంపవద్దని ప్రార్థించుచు, రాముని వనములకు పంపినందుకు తననందరూ నిందింతురని చెప్పుచూ -

**శ్లో॥ అనార్య ఇతి మమార్యాః పుత్ర విక్రాయికం ధ్రువమ్ ।**
**ధిక్కరిష్యంతి రథ్యాసు సురాపం బ్రాహ్మణం యథా ॥**

**(వా.రా. అయోధ్యా. 12-69)**

సజ్జనులు మనలను అనార్యులు, పుత్రునమ్ముకొను వారిగ చెప్పుకొనుచు, సారాయి త్రాగిన బ్రాహ్మణుని నిందించినట్లు వాడవాడలా నన్ను నిందించు చుందురు. అని నెమ్మదిగ ప్రేమతో చెప్పగా ఆమె విననప్పుడు ధశరథుడు కోపముతో -

**శ్లో॥ ప్రతామ్య వా ప్రజ్వల వా ప్రణశ్య వా, సహస్రశో వా స్ఫుటితాం**
**మహీం వ్రజ । నతే కరిష్యామి వచః సుదారుణం, మమాహితం**
**కేకయ రాజపాంసని ॥** **(వా.రా. అయోధ్యా. 12-111)**

కేకయ రాజవంశమునకు కళంకము తెచ్చు ఓసీ ! నీవు విషమును మ్రింగి చావు. లేక రాతితో తల బ్రద్ధలుకొట్టుకో లేక భూమిపై పడి దొర్లు. కాని నాకు చెడుచేయు నీ కఠోర వచనముల నెన్నడు అంగీకరింపను. అని పలికి దశరథుడు మూర్ఛిల్లెను. రాత్రంతా అదేవిధముగ గడచినది.

ఇంతలో సూర్యోదయ మైనది. వేలాది స్త్రీ పురుషులు, బాల వృద్ధులు, యువతీయువకులు ఆనందోత్సాహములతో రాజ్యాభిషేకమును చూచుటకై రాజద్వారమువైపుగ పోవుచుండిరి. మహర్షి వశిష్ఠుడు తన శిష్యబృందముతో వచ్చి మంత్రి సుమంత్రునితో 'యజ్ఞారంభమునకు సమయమైనది. కనుక మేము వచ్చినట్లుగ మహారాజుకు తెలుపు'మని చెప్పెను. సుమంత్రుడు రాజభవనమునకు వచ్చి మహారాజును స్తుతింపసాగెను. ఆ స్తుతివాక్యములను విన్న దశరథుడు దుఃఖము నాపుకొనజాలక పోవుచుండగ కైకేయీ యిట్లనెను. ఓ సుమంత్ర! మహారాజు రాత్రంతా అభిషేక ఆనందముతో నిద్రింపనందున ఆలసటతో యిప్పుడు నిద్రించుచున్నారు. నీవు వెంటనే వెళ్ళి శ్రీరాముని పిలుచుకొనిరా అనెను. సుమంత్రుడు రథమునెక్కి ప్రజలతో క్రిక్కిరిసి యున్న రాజమార్గము గుండా శ్రీరాముని నివాస భవనమునకు వెళ్ళి - కైకేయీతో సహా మహారాజు మిమ్ములను చూడగోరుచున్నారు. కనుక వెంటనే మీరచ్చటకు వెళ్ళుడు అనెను. సీతాదేవి అంగీకారమును తీసుకొని లక్ష్మణునితో ఉత్తమ స్వర్ణఖచిత రథముపై పితృ దర్శనమునకై బయలుదేరెను. మార్గమధ్యలో ప్రసన్నచిత్తముతో కూడిన తన శ్రేయోభిలాషులను చూచుచు, వారి ఆశీర్వాదములను పొందుచు, ప్రజల శుభాశీస్సులతో సంతోషించుచు శ్రీరాముడు మహారాజు అంతఃపురమునకు చేరెను. కాని అచ్చట దశరథ మహారాజు దీనవదనముతో కైకేయీతో కూర్చుండెను. ఆయన ముఖము పాలిపోయినది. ముందుగ శ్రీరాముడు దశరథునకు పాదాభివందన మొనర్చి తదుపరి కైకేయీకు ప్రణామ మొనర్చెను. శ్రీరాముని చూచి దుఃఖముతో మహారాజు కేవలము 'రామ' అని మాత్రము అనగలిగి తరువాత మాటలాడ లేకపోయెను. తండ్రిగారి దశను చూచి తల్లి కైకేయీతో నాన్నగారికి అనారోగ్యముగ నున్నదా? లేక నావల్ల ఏమైన అపరాధము జరిగినదా? అని అడుగగా కైకేయీ యిట్లనెను : మహారాజునకు విచారమేమియును లేదు. నీ విషయములో తన మనస్సులోని మాటను నీతో చెప్పుటకు సంకోచించుచున్నారు. ఉచితమైనా అనుచితమైనా మహారాజు ఆజ్ఞను పాలింతునని నాకు మాటిచ్చినచో అంతా చెప్పెదను అనిన తల్లి మాటలకు శ్రీరాముడిట్లనెను.

శ్లో॥ **అహోధిజ్ నార్హసే దేవీ వక్తుం మామీదృశం వచః ।**
**అహం హి వచనాద్రాజ్ఞః పతేయమపి పావకే ॥**
**భక్షయే యం విషం తీక్ష్ణం మజ్జేయమపి చార్ణవే ।**
**తద్బ్రూహి వచనం దేవి రాజ్ఞో యదభి కాంక్షితమ్ ॥**

**(వా.రా. అయోధ్యా. 18-29,30)**

దేవీ! అట్లనవలదు. మీరట్లనుట మంచిదికాదు. మహారాజు ఆజ్ఞాపించినచో నేను అగ్నిలో దూకుటకైనను సిద్ధముగ నున్నాను. విషమును త్రాగుటకైనను సిద్ధముగ నున్నాను. సముద్రములో దూకుటకైనను తయారుగ నున్నాను. కనుక మహారాజు కోరికను నాకు తెలియజేయుము అని తిరస్కారముతో అనిన శ్రీరామునితో కైకేయీ యిట్లనెను. పూర్వము దేవాసుర సంగ్రామములో నేను మీ తండ్రి ప్రాణములను రక్షించితిని. అప్పుడాయన సంతోషించి నాకు రెండు వరము లిచ్చుటకు ప్రతిజ్ఞ చేసిరి. ఇప్పుడు నే నావరములలో మొదటిదానితో భరతునకు రాజ్యాభిషేకమును కోరితిని. రెండవదానితో నీవు 14 సం॥లు అరణ్యవాసమును చేయవలయునని కోరితిని. నీవు సత్యవాక్పరిపాలకుడవైనచో పట్టాభిషేకము వదలి జటలు మృగచర్మము లను ధరించి 14 సంవత్సరములు దండకారణ్యములో నివసింపుమనెను. ఇంతటి కఠిన వచనములను వినియు 'న వివ్యథే రామః' శ్రీరాముడు కొంచెమైనను దుఃఖితుడు కాలేదు. అయనిట్లు చెప్పెను. మంచిది నేను మహారాజు ఆజ్ఞను పాలించుటకై అట్లే చేయుదును. కాని తండ్రి గారు నాతో మాట్లాడరేమి? అని -

శ్లో॥ **అహం హి సీతాం రాజ్యంచ ప్రాణానిష్టాన్ ధనాని చ ।**
**హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతాయ ప్రచోదితః ॥**

**(వా.రా. అయోధ్యా . 19-7)**

మీ ఆదేశానుసారము నేను సోదరుడు భరతుని కొరకు రాజ్యమే కాదు, సీతను, నాప్రాణములను, కోరికలను, ధనమును, అన్నింటినీ సంతోషముగ త్యజింతును. మహారాజు ఆజ్ఞ నేదైనా నేను పాటించెదను. అనిన శ్రీరాముని వచనములను విన్న కైకేయీ ఎంతో సంతోషముతో రామ! నీవు వెంటనే

వనములకు బయలుదేరుటకు సిద్ధమగుము. నీవు వెళ్ళనంతవరకు మహారాజు స్నానముగాని, భోజనముగాని చేయరు అనెను. కైకేయీ మాటలను విన్న మహారాజు అయ్యో! అని తిరిగి మూర్ఛిల్లి మంచముపైకి ఒరిగిపోయెను. కైకేయీ రాముని త్వరగా అరణ్యములకు వెళ్ళుమని తొందర చేయసాగినది. నేను మాత కౌసల్యతో చెప్పి సీతను సమాధానపరచి అలస్యము కాకుండా అరణ్యములకు వెళ్ళుదునని చెప్పి మూర్ఛిల్లిన తండ్రికి కైకేయీకి ఆయన పాదాభివందనముచేసి వెళ్ళిపోయెను. ఇంతటి విషాదఘటనతోకూడ శ్రీరాముని ముఖారవిందములో ఏవిధమైన వికారమును కలుగలేదు !

శ్లో॥ న వనం గన్తు కామస్య త్యజతశ్చ వసుంధరామ్ ।
సర్వ లోకాతిగస్యేవ లక్ష్యతే చిత్త విక్రియా ॥

**(వా.రా. అయోధ్యా. 19-33)**

భూమండల రాజ్యమును విడిచి వనములకెళ్ళుచున్న శ్రీరాముడు యోగీశ్వరునివలె నుండెను. ఆయన మనస్సులో ఎట్టి వికారములు కనబడకుండెను.

**( శ్రీరామునకు గౌరవము గొప్పతనములను చేకూర్చు విషయమేది? తన తండ్రిమాట నంగీకరించి వనములకు పోవుటవలన గొప్పవానిగ తలంతుమా? ఆదర్శ రాజగుటవలననా? ఆదర్శ పుత్రుడగుట వలననా? ఆదర్శ సోదరుడగుటవలననా? ఆదర్శపతి యగుటవలననా? ఆదర్శ మిత్రుడగుట వలననా? ఇవేమియు కారణము కావని నా అభిప్రాయము. ఆయన కీర్తికి కారణము మరొకటి. రఘువంశ పరంపర యిట్లుండెడిది -**

**శ్లో॥ శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణామ్ ।**
**వార్ధకే మునివృత్తీనాం యోగేనాన్తే తనుత్యజామ్ ॥ (రఘువంశము 1-8)**

రఘువంశీయులు బాల్యములో సమస్త విద్యలను అభ్యసించు చుండిరి. యువావస్థలో గృహస్థాశ్రమమున ప్రవేశించి సాంసారిక భోగము లనుభవించు చుండిరి. వృద్ధాప్యములో వానప్రస్థమును స్వీకరించి చివరకు యోగాభ్యాసముతో తమ శరీరములను విడుచుచుండిరి.

మర్యాదా పురుషోత్తముడైన రాముడిందులకు వ్యతిరేకము -

శ్లో॥ పుత్ర సంక్రాంత లక్ష్మీకైర్యద్ వృద్ధేక్ష్వాకుభిర్ధృతమ్ ।
ధృతం బాల్యే తదార్యేణ పుణ్యమారణ్యక వ్రతమ్ ॥
(ఉత్తర రామ చరిత 1-12)

పుత్రునకు రాజ్యలక్ష్మి నప్పగించి ఇక్ష్వాకురాజులు వృద్ధావస్థలో వానప్రస్థ వ్రతమును స్వీకరించుచుండిరి. శ్రీరాము డా పవిత్ర వ్రతమును యౌవనావస్థలోనే స్వీకరించెను. సుఖముల కొరకు ఉరకలు వేయుచుండు యౌవన జీవనములోనే ప్రసన్నముగ వనములకు వెళ్ళుట వలన శ్రీరామునకు అత్యంత గౌరవమును కలిగించినది. శ్రీరాముడు వనములకు వెళ్ళినను ఆయన ముఖమండలముపై విషాదచ్ఛాయ లేమాత్రము లేకుండెను. అప్పటి స్థితినిగూర్చి మహానాటకము 3-22లో దశరథ మహారాజు చక్కగా యిట్లు చెప్పెను.

శ్లో॥ ఆహూతస్యాభిషేకాయ విసృష్టస్య వనాయచ ।
న మయా లక్షితస్తస్య స్వల్పోఽప్యాకార విభ్రమః ॥

రాజ్యాభిషేకమున కని కబురంపి వనములకు పంపితిని. ఐనా శ్రీరాముని ముఖముపై కొంతైనా తేడాను చూడలేదు.

దీనినే శ్రీ తులసీదాసు కూడా యిట్లు వ్రాసెను -

ప్రసన్నతాం యా న గతాభిషేకస్తథా న మమ్లే వనవాస దుఃఖతః ।
(మానస. అయోధ్యా.)

రాజ్యాభిషేక వార్తను విన్న సమయమున ఆయన ముఖమండలముపై ఎటువంటి సంతోషముగాని లేకుండెను. అట్లే వనవాస దుఃఖముతో ఆయన ముఖముపై విషాదరేఖలూ లేకుండెను.

హర్షశోకములలో, సుఖ దుఃఖములలో, మానాపమానములలో సమానముగ (ఒకే రకము) నుండుట యనునది మహాపురుషుల లక్షణము. ఒకానొక కవి దీనినెంతో సుందరముగ చెప్పెను. చూడుడు -

శ్లో॥ ఉదయే సవితా రక్తో రక్తశ్చాస్తమయే తథా ।
సంపత్తౌ చ విపత్తౌ చ మహతామేక రూపతా ॥

ఉదయించు సూర్యుడు అస్తమించు సూర్యుడును ఎఱ్ఱగానే యుండును. అదేవిధముగ సంపదలలోను ఆపదలలోను మహాపురుషులు

ఒకే రకముగ నుందురు. (సంపదలు కలుగునపుడు సంతోషింపరు. అట్లే ఆపదలు వచ్చినను దుఃఖింపరు అని భావము. )

కౌసల్యను ఓదార్చుట :

రాజగృహమునుండి తిన్నగా శ్రీరాముడు మాత కౌసల్య గృహమున కెళ్ళెను.

శ్లో॥ సాక్షౌమవసనా హృష్టా నిత్యం వ్రతపరాయణా ।
**అగ్నింజుహోతిస్మ తదా మంత్ర వత్కృత మంగలా ॥**

**(వా.రా. అయో. 20-15)**

ఆ సమయమున కౌసల్యాదేవి పట్టువస్త్రమును ధరించి మంగళా చరణముతో పాటు మంత్రముల నుచ్చరించుచు (హవనమును) అగ్ని హోత్రమును చేయుచుండెను. యజ్ఞమును సమాప్త మొనర్చి కౌసల్యాదేవి శ్రీరాముని వద్దకు వచ్చినది. తనను కౌగిలించిన పుత్రుని ఆలింగన మొనర్చి శిరస్సును ముద్దాడెను. తల్లి కూర్చొనుటకు ఆసనము నిచ్చి తినుటకు మిఠాయి నివ్వగా శ్రీరాము డత్యంత నమ్రతతో - అమ్మా! తండ్రి గారు నన్ను వనమునకు రాజుగ చేసిరి. నేను దండకారణ్యమున కెళ్ళుచున్నాను. నీ ఆజ్ఞకొరకు వచ్చితి ననగా విన్న కౌసల్య మూర్ఛిల్లి పడిపోయినది. శ్రీరాము డామెకు ధైర్యము చెప్పుట కెంత ప్రయత్నించినను ఆమె శోకమును మానలేదు. తనబిడ్డ తనకు దూరమగుట ఆమెకిష్టము లేదు. రాముడు వనములకేగిన తరువాత కైకేయీ ఆజ్ఞానుసారము తాను నడుచుకొనవలసి వచ్చునను భయముకూడా ఆమెకు కలిగినది. రాముని వియోగము ననుభవించుటకంటె గొడ్రాలుగ నుండుటే మంచిదిగ ఆమెకు తోచినది.

తల్లి కౌసల్యయొక్క దీనస్థితిని చూచిన లక్ష్మణుడామెతో యిట్లనెను. 'అమ్మా! స్త్రీకి లోబడి మహారాజు ఆజ్ఞాపించినంత మాత్రమున అన్నగారు అరణ్యముల కెళ్ళుట నాకు బాగుగా కనబడుటలేదు. వృద్ధుడైనందున ఆయన బుద్ధి భ్రమించినది. అందువలన ఆయన ఆజ్ఞను పాలింపనవసరము లేదు. తన శత్రువులకు కూడ ప్రియమైన అన్నగారీ విధముగ వనముల కెందులకెళ్ళవలయును. ? బాల (అల్ప) బుద్ధిగల రాజు మాటలను లెక్క

చేయవలసిన అవసరమేలేదు. అని, తరువాత శ్రీరాముని వైపు తిరిగి మీరంగీకరిస్తే మహారాజును, అయోధ్యావాసులను, భరతుని, అందరిని చంపుదును. మీ పట్టాభిషేకమున కడ్డుతగులు రాజుల నందరినీ చంపుదును. నా భుజములు శరీరమున కలంకారముగ గాని, నా ధనస్సు శృంగారమున కాభరణముగ గాని కాదు. నాయీ వస్తువులు, ఆయుధములన్నియు శత్రువుల మదమణచుటకు, తండ్రి ధర్మాధర్మముల వివేక శూన్యుడైనచో ఆయననుకూడ వధింపవలయును' అని తిరిగి కౌసల్యాదేవితో నిట్లనెను.

శ్లో॥ దీప్తమగ్ని మరణ్యం వా యది రామః ప్రవేక్ష్యతి ।
ప్రవిష్టం తత్ర మాం దేవిత్వం పూర్వమవధారయ ॥

(వా.రా. అయోధ్యా. 21-17)

ఓ దేవి! శ్రీరామునిపై నాకెంత ప్రేమనిన : ఆయన మండుచున్న అగ్నిలో దూకినా, వనముల కెళ్ళినా ఎచ్చటున్నను అచ్చట ఆయనకంటె ముందుగ నన్నే చూచెదవు. అని వీరత్వముతో పలికిన లక్ష్మణుని మాటలను విన్న కౌసల్యాదేవి రాముని అరణ్యములకు పోవలదని అర్థగింపసాగినది. ఆమె రామునితో ఓ ధర్మజ్ఞుడ! నీవు ధర్మము నాచరింపదలచినచో యిచ్చటనే యుండి నాకు సేవలొనర్చుచుండుము. తల్లిసేవకు మించిన ఉత్తమ ధర్మమేమున్నది? మరియు -

శ్లో॥ యథైవ రాజా పూజ్యస్తే గౌరవేణ తథాహ్యహమ్ ।
త్వాం నాహమనుజానామి న గంతవ్య మితో వనమ్ ॥ (25)

మహారాజు నీకెట్లు పూజింపదగినవాడో అట్లే నేనును నీకు పూజ్యురాలను. నేను నిన్ను వనమున కెళ్ళుట కనుమతింపను. అని ఆదేశించిన తల్లితో శ్రీరాము డిట్లనెను.

శ్లో॥ నాస్తి శక్తిః పితుర్వాక్యం సమతిక్రమితుం మమ ।
ప్రసాదయే త్వాం శిరసా గన్తు మిచ్ఛామ్యహం వనమ్ ॥ (30)

ఓ దేవి! తండ్రిగారి ఆజ్ఞను ఉల్లంఘించునంతటి శక్తి నాలో లేదు. కనుక నేను మీకు ప్రణామమొనర్చి మిమ్ములను సంతోషపరచి మీ యనుమతితోనే వనముల కెళ్ళగోరుచున్నాను. అని లక్ష్మణునితో నిట్లనెను.

లక్ష్మణా! నీకు నాపైగల ప్రేమానురాగముల నెరుగుదును. నీ బల పరాక్రమములు కూడ నాకు తెలియును. కానీ నీవన్న మాటలు ధర్మానుకూలమైనవి కావు.

శ్లో॥ ధర్మోహి పరమో లోకే ధర్మే సత్యంప్రతిష్ఠితమ్ ।
ధర్మ సంశ్రితమేతచ్చ పితుర్వచన ముత్తమమ్ ॥ (41)

లోకమున సర్వశ్రేష్ఠమైనది ధర్మము. ధర్మములోనే సత్యము స్థాపింప బడి యున్నది. ధర్మానుకూల మైనందున తల్లిఆజ్ఞకంటె తండ్రి ఆజ్ఞ శ్రేష్ఠ మైనది. నేను తండ్రిగారి యాజ్ఞనుల్లంఘింపలేను. సోదర! నీవు కూడ శాస్త్రోక్తధర్మము ననుసరించు బుద్ధిని; త్యాగధర్మములను ఆశ్రయింపుము. అని మరల తల్లితో నిట్లనెను. అమ్మా! కైకేయీ మహారాజును మోసగించి అత్యంత దుఃఖితుని చేసినది. నేనుకూడ ఆయనను వదలి వనముల కెళ్ళుచున్నాను. నీవు కూడ నాతో వనములకు వచ్చిన మహారాజు జీవింపరు. వనముల కెళ్ళవద్దని నీవిచ్చు ఆదేశము -

శ్లో॥ మయా చైవ భవత్యా చకర్తవ్యం వచనం పితుః ।
రాజా భర్తా గురుః శ్రేష్ఠః సర్వేషామీశ్వరః ప్రభుః ॥
(వా.రా. అయోధ్యా . 24-16)

ఓ దేవీ! నేను, నీవు తండ్రిగారి ఆజ్ఞను తప్పక వినవలయును. ఏలయన మహారాజు మీకు పతి. నాకు గురువు, తండ్రి. అందరినీ పాలించి పోషించు యజమాని రాజు. అని చివరకు పాతివ్రత్య మహత్త్వమును గూర్చి శ్రీరాము డిట్లు చెప్పెను -

శ్లో॥ జీవన్త్యా హి స్త్రియా భర్తా దైవతం ప్రభురేవ చ ।
భవత్యా మమ చైవాద్య రాజా ప్రభవతి ప్రభుః ॥
వ్రతోపవాస నిరతా యా నారీ ప్రరమోత్తమా ।
భర్తారం నానువర్తేత సా తు పాపగతి ర్భవేత్ ॥
భర్తుః శుశ్రూషయా నారీలభతే స్వర్గ ముత్తమమ్ ।
అపి యా నిర్నమస్కారా నివృత్తా దేవపూజనాత్ ।
శుశ్రూషామేవ కుర్వీత భర్తుః ప్రియహితే రతా ।

ఏషః ధర్మః పురా దృష్టో లోకే వేదే శ్రుతః స్మృతః ॥

**(వా.రా. అయోధ్యా. 24-21, 26, 27, 28)**

1. స్త్రీ జీవించియున్నంత కాలము తన పతినే దైవముగ ప్రభువుగ తలంపవలయును. అందువలన యిప్పుడు మీకు నాకు స్వామి - పాలకుడు - మహారాజే.

2. వ్రతముల నాచరించి పతిసేవ చేయని స్త్రీ పాపి యగును.

3. స్త్రీ దేవీ - దేవతలను పూజింపనప్పటికిని తనపతిని సేవించిన స్వర్గము (విశేష సుఖము) లభించును.

4. స్త్రీ లెల్లప్పుడు పతిసేవ లొనర్చుచుండవలయును. ఆయన సుఖము కొరకే యత్నించు చుండవలయును. ఇదే స్త్రీలకు ప్రాచీన లోకాచారము. వేదములు స్మృతులు మున్నగువాని కనుకూలము.

శ్రీరాము డీవిధముగ నచ్చజెప్పిన తరువాత తల్లి శోకమును వీడి ఆచమన మొనర్చి - సన్మార్గములో పయనించు నిన్ను నేనాపలేను. నీవు సజ్జనుల మార్గము ననుసరింపుము. ధైర్యముతో నియమబద్ధముగ పాటించుచున్న ధర్మమే నిన్ను రక్షించును. పరమాత్మ నిన్ను రక్షించుగాక! విశ్వామిత్రులవారొసగిన శస్త్రాస్త్రములు నిన్ను రక్షించుగాక! పుత్ర! నీ యిష్టము వచ్చినచోటికి వెళ్ళు. కాని తగిన సమయములో నిన్ను చూచునట్లు చేయుమనెను.

**సీతా లక్ష్మణులు కూడ వెంట వెళ్ళుట :**

శుభాశీస్సులను గైకొని తల్లికి ప్రణమిల్లి శ్రీరాముడు సీతాదేవి భవనము వైపుగ బయలుదేరెను. రాముని వనవాసమునుగూర్చి యింకా సీతాదేవికి తెలియదు. ఆమె పట్టాభిషేకమును గూర్చి ఆలోచించుచున్నది. సంధ్యావందనము ముగించి ఆమె శ్రీరాముని రాకకై ఎదురుచూచుచున్నది. ఇంతలో ముడుచుకున్న ముఖముతో ప్రవేశించిన పతి ముఖమును చూచి సీతాదేవి ఏమైనదని యడుగసాగెను. మీపై తెల్ల ఛత్రమెందుకు లేదు. వింజామరలు విసురుటలేదెందులకు? వంధిమాగధులెందుకు స్తోత్రము చేయుటలేదు? మీ వెనుక రాజభటులెందులకు లేరు? రథము గుఱ్ఱములు కూడ కనబడుటలేదు కారణమేమి? అని ఈవిధముగ ప్రశ్నించుచున్న సీతాదేవికి

తన వనవాస వృత్తాంతమంతా తెలియజేసి ,నేనిప్పుడు 14 సంవత్సరములు వనవాసమునకై దండకారణ్యమున కెళ్ళుచున్నాను. నీ అనుమతికై వచ్చితినని చెప్పి సీతకుపదేశము చేయుచు - ధర్మమునెరిగిన ఓ జానకీ! నీవు భరతునితో మర్యాదగా వ్యవహరింపవలయును. మహారాజు దశరథునకు మాత కౌసల్యకు నిత్యము పరిచర్యలు చేయుచుండవలయును. నా యితర తల్లులకు కూడ నిత్యము వందనము చేయుచుండవలయునని చెప్పుచు -

శ్లో॥ భ్రాతృపుత్ర సమౌచాపి ద్రష్టవ్యౌచ విశేషతః ।
త్వయా భరత శత్రుఘ్నౌ ప్రాణైః ప్రియతరో మమ ॥

(వా.రా. అయోధ్యా. 26-33)

నా ప్రాణప్రియులైన భరత శత్రుఘ్నులను నీ సహోదరులు, బిడ్డలవలె నెంచవలయును. ఓ దేవీ! నిన్నెవరు చెడుగా భావింపనట్లు ప్రవర్తింప వలయునని నా ఉపదేశము. నేనింక వనముల కెళ్ళుచున్నాను అనెను. శ్రీరాముని మాటలను విన్న సీతాదేవి యిట్లనెను. 'ఓ రామ! నీ మాటలతో నాకు నవ్వు వచ్చుచున్నది. పత్ని అర్ధాంగి యగును. నిన్ను వనముల కెళ్ళుమని యాజ్ఞయైనచో నన్నుకూడా వనముల కెళ్ళుమని ఆజ్ఞయైనట్లే.

శ్లో॥ న పితా నాత్మజో న ఆత్మా న మాతా న సఖీ జనః ।
ఇహప్రేత్య చ నారీణాం పతిరేకో గతిః సదా ॥
యది త్వం ప్రస్థితో దుర్గం వనమద్యైవ రాఘవ ।
అగ్రతస్తే గమిష్యామి మృద్నన్తీ కుశకంటకాన్ ॥
శుశ్రూషమాణా తేనిత్యం నియతా బ్రహ్మచారిణీ ।
సహ రంస్యే త్వయావీర ! వనేషు మధుగన్ధిషు ॥
ఫలమూలాశనా నిత్యం భవిష్యామి న సంశయః ।
నతే దుఃఖం కరిష్యామి నివసంతీ సహత్వయా ॥
స్వర్గేఽపిచ వినా వాసో భవితా యది రాఘవ !
త్వయా మమ నరవ్యాఘ్ర నాహం తమపి రోచయే ॥

(వా.రా. అయోధ్యా. సర్గ - 27-5,6,12,15,20)

స్త్రీలకు ఈ లోకమున, పరలోకములో (రాబోవు జన్మలో) భర్తయే

సర్వస్వము. తండ్రి, సంతానము, సోదరుడు, బంధువు, తల్లి, మిత్రురాళ్ళలో ఎవ్వరూ ఆమెకు ఉపయోగపడరు. ఈ రోజే మీరు వనముల కెళ్ళుచున్నచో నేను మీకంటె ముందుండి మీ మార్గములోని ముళ్ళను తొలగించి శుభ్రమొనర్చు చుందును. ఓ వీరుడా! నేను ప్రతినిత్యము నియమపూర్వకముగ చరించుచు కోరికలను వీడి బ్రహ్మచర్య పాలనతో అతిమధురమైన గంధపు సువాసనలను వెదజల్లు వనములలో తిరుగాడుదును. నేను వనములలో దొరుకు ఫలములను కందమూలాదులను భుజించి మీతో వనములలో నుందును. నావలన మీకెట్టి కష్టములను కలుగనీయను. ఓ రాఘవ! నీవులేకుండా నేను స్వర్గమున నుండుటకు కూడ యిష్టపడను. అనెను.

సీతాదేవి మాటలను విన్న శ్రీరాముడు వనములలో నుండు క్రూర జంతువులు, కాళ్ళకు గ్రుచ్చుకొను ముళ్ళనుగూర్చి వర్ణించుచు, అచ్చట నేలమీదనే నిద్రింపవలయునని, పండ్లు, దుంపలు తిని యుండవలయునని, నార వస్త్రములు ధరించి యుండవలయునని, వేగముగ దుమ్ము ధూళి చెలరేగుచుండునని, పెద్దపెద్ద కొండచిలువలు తిరుగుచుండునని, ఎలుగుబంట్లు, పురుగులు, ఈగలు, దోమలు నిత్యము బాధించుచుండును కనుక నీవిచ్చటనే యుండుము. వనములకు రావలదనెను. వనమునందలి ఈ దుఃఖములను కష్టములను విన్న తరువాతకూడ సీతాదేవి తన నిశ్చయమును కొంచెమైనను సడలింపక యిట్లనెను.

**శ్లో॥ యే త్వయా కీర్తితా దోషా వనే వస్తవ్యతాం ప్రతి ।**
**గుణానిత్యేవ తాన్వీక్షే తవస్నేహ పురస్కృతాన్ ॥**

**(వా.రా. అయోధ్యా. 29-2)**

ఓ రామ! మీరు వనవాసములో చూపిన దోషములన్నింటిని మీ స్నేహశీలము హరించివేయును. ఓ నాథ! పతియే స్త్రీకి దైవము. నన్ను మీతో తీసుకొని వెళ్ళుడు.

**శ్లో॥ యది మాం దుఃఖితామేవం వనం నేతుం న చేచ్ఛసి ।**
**విష మగ్నిం జలం వాహమాస్థాస్యే మృత్యుకారణాత్ ॥**

**(వా.రా. అయోధ్యా. 29-21)**

మీరు గనుక నన్ను మీతో తీసుకొనిపోనిచో నేను విషమును మ్రింగి గాని, అగ్నిలో దూకిగాని, నీటిలో మునిగిగాని, ప్రాణములను విడుతును. అని సీతాదేవి రోదింపసాగినది. ఆమె దుఃఖము, దృఢ నిశ్చయము రాముని హృదయమును కదలించినవి. సీతాదేవిని తనతో వనములకు తీసుకొని వెళ్ళుటకు అంగీకరించి వనముల కెళ్ళుటకు ఏర్పాట్లు చేయమని ఆజ్ఞాపించెను. లక్ష్మణు డొకచోటనుండి సీతారాముల సంభాషణను వినుచుండెను. సీతాదేవిని వనములకు తీసుకువెళ్ళుటకు అంగీకరించినపుడు లక్ష్మణుడు శ్రీరాముని చరణములపై వ్రాలి ప్రణామమొనర్చి సీతారాములిరువురితో నిట్లనెను.

శ్లో॥ యది గన్తుం కృతా బుద్ధిర్వనం మృగగజాయుతమ్ ।
అహం త్వాఽను గమిష్యామి వనమగ్రే ధనుర్ధరః ॥

(వా.రా. అయోధ్యా. 31-3)

మీరు క్రూర మృగములతోను ఏనుగులతోను నిండిన వనముల కెళ్ళుటకు నిశ్చయించినచో నేను ధనస్సునకు బాణమును సంధించి మీకు ముందు నడిచెదను. అని లక్ష్మణుడు వనములకు వచ్చుటకు సిద్ధమగుట చూచిన శ్రీరాముడతనితో - ఓ లక్ష్మణ! నీవు నాకు స్నేహితుడవు, ధర్మ పరిపాలకుడవు, శూరుడవు, ఎల్లప్పుడు సన్మార్గమున నడచువాడవు, నా ప్రాణములతో సమానమైన ప్రియుడవు, చిన్న తమ్ముడవు. నీతో వనములకు పోవుటవలన నా కన్నివిధముల సుఖమే కలుగును. కాని నీవును నాతో వచ్చిన మాత కౌసల్య, సుమిత్రల నెవరుచూచెదరు? కనుక నీ విక్కడేయుండి తల్లిదండ్రులకు సేవచేయుము. ఈవిధముగ చేయుటవలన కేవలము నీకు నాపైగల భక్తి ప్రకటమగుటేగాక నీకు పుణ్యముకూడ లభించును. అనగా లక్ష్మణుడు సోదరుడు భరతుడు మాత కౌసల్య, సుమిత్రలను చూచుచుండును. అతడు అందుకు అంగీకరింపనిచో నేనతనిని చంపివేయుదును. దానిలో సందేహము లేదు. 'కురుష్వ మామనుచరమ్' (అయో. 31-24) మీ అనుచరునిగ వచ్చుట కాజ్ఞాపించుడు. మీ కృపవలన నేను కృతార్థుడనై మీకుపయోగింతును.

శ్లో॥ ఆహరిష్యామి తే నిత్యం మూలానిచ ఫలానిచ ।
వన్యాని యాని చాన్యాని స్వాహార్హాణి తపస్వినామ్ ॥ (వా.రా. అయోధ్యా. 31-26)

నేను మీకొరకు కందమూలాదులు ఫలములు; తపస్వులు భుజించు - వనములలో లభించు ఆకుకూరలు శాకాదులు యితర వస్తువులు నిత్యము తెచ్చుచుందును. అని ప్రేమతో పలికిన తమ్ముని మాటలను విన్న రాముడు లక్ష్మణునికూడ తనతో తీసుకొని పోవుట కంగీకరించి తన తల్లి, బంధు మిత్రుల నుండి ఆజ్ఞను తీసుకొని అస్త్రశస్త్రములను తీసుకొని రమ్మని లక్ష్మణుని పంపగా అతడన్నియు తీసుకొని శ్రీరాముని సమీపించెను.

**తండ్రి అంతిమ దర్శనము :**

శ్రీరాముడు సీతాదేవి తమ దివ్య ఆభరణములను, రత్నములను, గోవులను, ఏనుగులను, గుఱ్ఱములు, రథములను బ్రాహ్మణులకు దానమిచ్చెను. పరిచారకులకు ధనము నిచ్చెను. అస్త్రశస్త్రములను ధరించి వనముల కెళ్ళుటకు ముందుగ శ్రీరాముడు సీత, లక్ష్మణులతో సహా తన తండ్రికి తల్లులకు నమస్కరించుట కొరకు వెళ్ళెను. శ్రీరాముడు కనబడిన చోటెల్ల ప్రజలు హా, హా కారములు చేయుచుండిరి. కొందరు దశరథుని నిందించుచుండ మరికొందరు కైకేయిని తూలనాడుచుండిరి. లోకుల పలురకముల మాటలు వినుచు రాముడు రాజమహలు చేరుకొనగా అచ్చట సుమంత్రుడు కనబడెను. రాముడతనితో తాను తండ్రిగారి దర్శనమునకై వేచియున్నట్లు తెలుపగా ఆయన మహారాజు వద్దకు పోయి చూడగా మహారాజు కలతచెంది భయభీతుడై యుండెను. సుమంత్రుడు రాజున కభివాదముచేసి తదుపరి చేతులు జోడించి భయముతో - మహారాజా ! పురుషసింహుడైన శ్రీరాముడు తన సర్వధనమును బ్రాహ్మణులకు, పేదలకు పంచియిచ్చి బంధుమిత్రుల వద్ద సెలవు తీసుకొని మీ దర్శనమునకై యిచ్చటకు వచ్చియున్నారు. మిమ్ములను దర్శించి వనముల కెళ్ళుదురు. కనుక వారికి దర్శనమిండు. అనిన సుమంత్రునితో మహారాజు తన రాణులందరిని పిలువుమనెను. వారందరూ వచ్చిన తరువాత శ్రీరాముని తనవద్దకు పిలిపించెను. సీతాదేవి, లక్ష్మణులతో కలిసి తనవద్దకు వచ్చుచున్న శ్రీరామునిచూచి తన గుండెలకు హత్తుకొనుటకై వేగముగ ముందుకు పోబోయి నేలపై కొరిగి స్మృతితప్పి పడిపోయెను. అదిచూచి రాణులు గొల్లున రోదింపసాగిరి. శ్రీరామ లక్ష్మణు లిరువురు పరుగున వెళ్ళి తండ్రిని భుజములపై

కెత్తుకొని మంచముపై కూర్చుండబెట్టిరి. మహారాజు తెలివిలోనికి రాగా శ్రీరాముడు చేతులుజోడించి - మహారాజా! మీరు మాకు యజమానులు. నేను దండకారణ్యమునకు వెళ్ళుచున్నాను. సీతాలక్ష్మణులు కూడ నాతో వచ్చుట కనుమతినిండు. విచారింపక మాకు శలవిండు - అనెను. ఈ మాటలను విన్న మహారాజు తన పుత్రునివైపు కృపాదృష్టితో చూచి యిట్లనెను-

శ్లో॥ అహం రాఘవ కైకేయ్యా వరదానేన మోహితః ।
అయోధ్యాయాం త్వమేవాద్య భవ రాజా నిగృహ్య మామ్ ॥
(వా.రా. అయోధ్య. 34-26)

ఓ రామ! వరదానముద్వారా నన్ను కైకేయి మోసగించినది. నన్ను కారాగారమున నుంచి బలవంతముగ నీవు అయోధ్యకు రాజువుకమ్ము. అనిన తండ్రి మాటలకు శ్రీరాముడు చేతులు జోడించి - మహారాజా! మీరు చిరకాలమువరకు అయోధ్యను పరిపాలింపుడు. నాకు రాజ్యమును పాలించు కోరిక లేదు. అట్లే మిమ్ములను అసత్యవాదిగ చేయజాలను. నేను సంతోషముతో 14 సంవత్సరములు వనవాసము గడిపి తదుపరి తిరిగివచ్చి మీ పాదములను స్పృశింతును. అనగా సత్యపాశమునకు బంధీయైన మహారాజు శ్రీరామునితో ఓ రామ ఈ లోకమునందలి ఏశక్తి నిన్ను తొలగింపజాలనంతగ నీ మనస్సు సత్యధర్మముతో ముడిపడియున్నది వెళ్ళు. నీకు శుభమగు గాక! నా ప్రతిజ్ఞను సత్యమైనదిగ చేయుటకే నీవింత దారుణమైన దుఃఖమును సహించుచున్నావు. కాని నీయనా నిన్ను అరణ్యముల కంపుట నా కిష్టములేదు. అనిన తండ్రి మాటలకు శ్రీరాముడు మహారాజ! ఈ రాజ్యము ధనధాన్యములు, నాకివ్వదలచిన సంపద లన్నింటిని భరతున కిచ్చివేయుడు. నాకు రాజ్యము, మరే యితర సుఖములును వలదు. ప్రతిజ్ఞాభంగము చేసిరను అపవాదునుండి నేను మిమ్ములను రక్షించి సత్యవాదిగ సిద్ధము చేయగోరుచున్నాను. మీరు దేవతా స్వరూపులు, నేను మీముందు సత్యమును చెప్పుచున్నాను. ఇంక ఒక్కక్షణము కూడ యిచ్చట నేను ఆగజాలను. 14 సంవత్సరములు పూర్తికాగానే నేను తిరిగి వచ్చెదను. మీరు నా గురించి దుఃఖింపకు డనెను. దుఃఖముతో మహారాజు శ్రీరాముని హృదయమున కత్తుకొని మూర్ఛిల్లెను.

రాణులు శోకింపసాగిరి. సుమంత్రుడుకూడ మూర్ఛిల్లుటతో రాజప్రాసాద మంతటా హాహాకారములు చెలరేగినవి.

తెలివి వచ్చిన సుమంత్రుడు కైకేయితో ఓ దేవీ! పతినే వదలిన నీవీలోకమున చేయలేని దుష్కార్య మేముండును? నీవు నీ భర్తను, వంశమును కూడా నాశనమొనర్ప తలంచుచుంటివా? సరే, నీ పుత్రుడు భరతుడే రాజ్యమును పాలింపనిమ్ము. మేము శ్రీరాముని తోనే పోయెదము. నీ ఈ దుశ్చర్యకు భూమి ఎందులకు బ్రద్దలగుట లేదో నాకాశ్చర్యముగ నున్నది. ఇప్పుడైనా సమయమింకా మించిపోలేదు. నీవు శ్రీరామునకు రాజ్యాభిషేకమును జరిపింపుము. మహారాజు దశరథుడు ఇక్ష్వాకువంశ పరంపర మర్యాద ననుసరించి వనముల కెళ్ళును (వానప్రస్థాశ్రమమును స్వీకరించును) అని సుమంత్రుడెంత చెప్పినను కైకేయి మారకుండుట చూచిన దశరథుడు - రామునితో చతురంగబలమును పంపుమని సుమంత్రు నాజ్ఞాపించెను. అన్ని రకముల అస్త్రశస్త్రాదులు, ధనము, అన్న సామాగ్రి అన్నింటిని శ్రీరామునితో పంపుమనెను. ఈ మాటలు విన్న కైకేయి ముఖము క్రోధముతో ఎర్రబడినది. ఆమె మహారాజు మాటలను విరోధించుచు భరతునకు ధనము, ప్రజలు లేని రాజ్య మవసరము లేదనెను. మీ వంశములో రాజా సగరుడు తన పుత్రుడు అసమంజుని ఏవిధముగ రాజ్యమునుండి తొలగించెనో అదేవిధముగ రాముడుకూడా సేనాదులు లేకుండా వెళ్ళవలయుననెను.

ఈ మాటలు విన్న సిద్ధార్థుడను ప్రధానమంత్రి - ఓ దేవీ! అసమంజునకు శ్రీరామునకు పోలికెక్కడ? అసమంజుడు దుష్టుడు. వాడు రోడ్లపై ఆడుకొను బాలురను సరయూనదిలో పారవేయుచుండెను. కాని శ్రీరాముడటువంటి చెడుకార్యము నేమి చేసెను అనగా కైకేయి సమాధాన మివ్వజాలకపోయినది. అంతట శ్రీరాముడు - మహారాజా! నేను సకల సుఖములను విడిచిపెట్టినపుడు నాకు సిరిసంపదలు, సైన్యముల అవసరమేముండును. మాకు నారవస్త్రములు, కందమూలములను త్రవ్వుకొనుట కొక గునపము కావలయును. అనిన వెంటనే కైకేయి స్వయముగ నారవస్త్రములను తెచ్చి రామునకిచ్చి ధరింపుమనగా శ్రీరాముడా నార వస్త్రములను ధరించెను. లక్ష్మణుడును అట్లే చేసెను. కాని నారవస్త్రములను ధరించుట తెలియని సీత ఆ వస్త్రములను తీసుకొని సిగ్గుతో

నిలుచుండెను. అవి ధరించుటెట్లని శ్రీరాముని యడుగు చుండగా రాముడప్పుడు పట్టుచీరపై నారవస్త్రమును చుట్టెను. ఇది చూచి అంతఃపురములోని స్త్రీలందరూ రోదింపసాగిరి. మహర్షి వశిష్ఠులవారు ఓసీ కుల కళంకినీ! నీవు మహారాజును మోసగించితివి. సీత వనములకెళ్ళదు. రాముని స్థానములో సీత సింహాసనము నధిష్ఠించును. సీత వనములకు వెళ్ళినచో అయోధ్యవాసులమంతా వనములకు పోవుదుము. భరత శత్రుఘ్నులును మాతోనే వత్తురు. నీవప్పుడీ ప్రజలు లేని అయోధ్యను ఏలవలసి వచ్చును. నీవు సీతను వనవాసమునకు పొమ్మని కోరనపుడు అమెను ఉత్తమ వస్త్ర - ఆభూషణాదులతో వనములకు వెళ్ళనిమ్ము. అనెను.

సీత నారవస్త్రములను ధరించుట చూచి అక్కడి వారంత 'ధిక్త్వాం దశరథమ్'। దశరథునకు అవమానమనిరి. అంతట మహారాజు దుఃఖముతో కైకేయితో - రాజభోగ సుఖము లనుభవింపవలసిన సీత నారచీరలు ధరించి వనములకు పోదు అనెను. శ్రీరాముడు మరల తండ్రికి ధైర్యముచెప్పి తల్లి కౌసల్యను జాగ్రత్తగా చూచుకొనవలసినదని చెప్పగా ఆపరిస్థితికి దశరథమహారాజు ఎంతో దుఃఖించుచు మధ్యమధ్యలో మూర్ఛిల్లసాగెను. చివరకు అశ్రువులు నిండిన కళ్ళతో రథమును సీతకు మంచి వస్త్రములు, అభరణములు తీసుకొని రమ్మని ఆదేశించెను. సీతాదేవి ఉత్తమ వస్త్రములను ధరించినది. కౌసల్య ఆమెను హృదయమునకు హత్తుకొని పతివ్రత ధర్మమును గూర్చి బోధించెను. కౌసల్య మాటలు విన్న సీత అత్తగారి ఆదేశమును పాలింతునని (చంద్రునిలోని కాంతి చంద్రుని నుండి వేరుకానట్లే నేనును నా ధర్మమును విడువజాలననెను.)

వనములకు బయలుదేరుచు తనకొరకు దుఃఖించుట మాని తన తండ్రిగారిని సంరక్షించు కొనవలసినదిగ మరొకసారి శ్రీరాముడు తల్లిని ప్రార్థించెను. తెలిసిగాని తెలియకగాని తానుచేసిన తప్పులను క్షమింపవలయునని తన యిరువురు పినతల్లులను వేడుకొనెను. రామ లక్ష్మణ సీతలు మహారాజుకు ప్రదక్షిణ చేసిరి. లక్ష్మణుడు కౌసల్యకు ప్రణామ మొనర్చిన పిదప తనతల్లి సుమిత్రకు పాదాభివందనము చేయగా, ఆమె -

శ్లో॥ రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్ ।
అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్ ॥
(వా.రా. అయోధ్యా. 4-9)

కుమార ! నీవు యిల్లు విడుచుచున్నట్లెంచవలదు. శ్రీరాముని దశరథునితో సమానముగను, జానకిని నాతో సమానముగను, వనములను అయోధ్యతో సమానముగ నెంచుము. వెళ్ళు. సుఖముగ ప్రయాణము చేయుమనెను.

అరణ్యముల కెళ్ళుట :

సుమిత్ర ఆదేశించుచుండగా సుమంత్రుడు వచ్చి రథము సిద్ధముగా నున్నది ఎక్కుడనగా ముందుగ సీతాదేవి రథము నెక్కినది. తరువాత అత్తగారిచ్చిన వస్త్రాభరణములు, అస్త్రశస్త్రములను రథముపై నిడుకొని శ్రీరామ లక్ష్మణు లిరువురు ఎక్కగా సుమంత్రుడు రథమును నడుపసాగెను. రథము కదలగానే అయోధ్యలో హా హా కారములు చెలరేగినవి. ఆబాల వృద్ధులు, స్త్రీ పురుషులు, యువతీ యువకులు అత్యంత దుఃఖముతో గొల్లున ఏడ్చుచు రథమును వెంబడించుచుండిరి. ప్రజలు లక్ష్మణుని సౌభాగ్యమును కొనియాడుచు రథమును నెమ్మదిగ నడుపుమని విజ్ఞప్తి చేయుచుండిరి. దశరథ మహారాజు - నా ప్రియ పుత్రుని చూచెదనని రాజద్వారమును దాటి కాలినడకన బయలుదేరెను. రాణులందరూ విలపించుచు ఆయనతో బయలుదేరిరి. తమవైపు వచ్చుచున్న తల్లిదండ్రులను చూచి రాముడు రథమును వేగముగ నడుపుమని ఆజ్ఞాపించెను. సుమంత్రుడు రథపు వేగమును పెంచెను. శ్రీరాముడు శీఘ్రముగ తిరిగి రావలయుననిన ఆయనను సాగనంపుటకు ఎక్కువదూరము వెళ్ళరాదని మంత్రులు మహారాజునకు నివేదించిరి. దశరథు డచ్చటనే ఆగిపోయి వేగముగ వెళ్ళుచున్న రథమును కనుచూపుమేర వరకు చూచుచు నిలబడి ఏడ్చుచు నేలపై పడిపోయెను. కౌసల్య ఆయనను రాజభవనమునకు తీసుకెళ్ళినది. రామునితో అపారజన సముదాయము వెంబడించుచుండగ ఆయన వారిని అయోధ్యకు తిరిగి

వెళ్ళవలసినదిగ ఎంత చెప్పినను వారు విడువలేదు. వారట్లు వెళ్ళుచుండగ శ్రీరాముని ముందుకు పోనివ్వక అడ్డుతగులుతున్నట్లుగ 'తమసానది' కనబడినది. సుమంత్రుడు రథమునాపి గుఱ్ఱములను విడిచి నీరు త్రాగించి స్నానము చేయించి నదిఒడ్డున మేత మేయుటకై విడిచెను. సూర్యాస్తమయ మగుటచే అందరూ సంధ్యయొనర్చి తదుపరి లక్ష్మణ, సుమంత్రులు శ్రీరామునకు ప్రక్కనుతయారుచేసిరి, సీతారాము లిరువురు నిదురించిన తరువాత లక్ష్మణ సుమంత్రులిరువురు రాత్రంతా శ్రీరాముని గుణగణములను గూర్చి కొనియాడు చుండిరి. ప్రజలింకను నిద్రించుచుండగ ప్రాతఃకాలముననే శ్రీరామచంద్రుడు నిదురలేచి వారిని విడిచి ముందుకు సాగిపోయెను. నిద్రనుండి లేచిన ప్రజలు శ్రీరాముని వెదుకగా కనుపింపనందున వారు హే రామ! అని విలపించుచు అయోధ్యకు తిరిగిపోయిరి.

**గుహుని కలియుట :**

శ్రీరాముడు అనేక గ్రామములు, చిన్నచిన్న నదులు దాటుచు గంగా తటమునకు చేరి ఒక వృక్షము క్రింద గుడారమును వేసుకొనిరి. ఆ ప్రదేశము శృంగవేర పురమందున్నది.

**శ్లో॥ తత్ర రాజా గుహోనామ రామస్యాత్మ సమః సఖః ।**
**నిషాద జాత్యే బలవాన్ స్థపతిశ్చేతి విశ్రుతః ॥**

**(వా.రా. అయోధ్యా .5-33)**

శ్రీరాముని ప్రాణస్నేహితుడు కొండజాతికి చెందిన చతురంగ బలమునకు రాజైన గుహుడను పేరుగల రాజు అచ్చట పరిపాలించుచుండెను. శ్రీరాముని రాకను గూర్చి సమాచార మందగనే గుహుడు తన వృద్ధ మంత్రులతో ఎదురు వచ్చుచుండగా శ్రీరాముడు లక్ష్మణునితో గుహుని కలిసెను.

**శ్లో॥ తమార్తః సంపరిష్వజ్య గుహో రాఘవ మబ్రవీత్ ।**
**యథాzయోధ్యా తథేయం తే రామ కిం కరవాణి తే ॥**

**(వా.రా. అయోధ్యా .50-36)**

తాపసి వేషములో నున్న శ్రీరాముని చూచిన గుహు డాయనను ఆలింగన మొనర్చుకొని దుఃఖముతో నిటనెను. హే రామ! ఈ రాజ్యముకూడా

నీకు అయోధ్యవంటిదే. నేనేమి చేయవలయునో ఆజ్ఞాపింపుడనెను. హే మహాబాహో ! మీవంటి అతిథిఎంతో గొప్ప సౌభాగ్యము వలననే లభించును. అని తదుపరి అనేకరకముల భోజనపదార్థములను తీసుకొని వచ్చి శ్రీరామునకు స్వాగతమును పలుకుచు ఈ రాజ్యమంతా మీదే. మీరు మా పాలకులు. మేము మీ సేవకులము. మీరీరాజ్యమును పాలించుడు. ఈ భక్ష్య, చోష్య, పేయ, లేహ్యములైన నాలుగు రకముల అన్నపదార్థములు; మీరు నిదురించుటకు ఉత్తమ శయ్య, గుఱ్ఱములకై దానా, గడ్డి మున్నగున వన్నియు యిచ్చట సిద్ధముగా నున్నవి. స్వీకరింపుడనెను. గుహుని మాటలు విన్న శ్రీరాము డతనిని ఆలింగన మొనర్చి -

శ్లో॥ కుశచీరాజినధరం ఫలమూలాశినం చ మామ్ ।
విద్ధి ప్రాణిహితం ధర్మే తాపసం వనగోచరమ్ ॥

(వా.రా. అయోధ్యా. 50-45)

నేను నారచీర మృగచర్మములను ధరింతును. ఫలములు కందమూలములను తిందును. వీటిలో గుఱ్ఱమునకై గడ్డినుంచుము మిగిలిన వస్తువులు నాకక్కరలేదనగా గుహుడట్లే చేసెను. సాయంకాల సంధ్యోపాసన యొనర్చిన తరువాత శ్రీరాముడు విశ్రమించెను. సూర్యోదయము కాగానే గంగానదిని దాటుటకై పడవను సిద్ధము చేయుమని గుహుని ఆదేశించెను. శ్రీరాముడు నావ నెక్కుచుండగా సుమంత్రుడు నాకేమి ఆజ్ఞయని యడుగగా ఆదరముగా అతని భుజమును తట్టుచు నాకింతవరకే రథము అవసరమైనది. నీవిప్పుడు రథమును తీసుకొని అయోధ్యకు తిరిగివెళ్ళి మహారాజును కనిపెట్టి చూచుచుండుమనెను. కాని సుమంత్రు డందులకు అంగీకరింపకపోగా శ్రీరాముడతనికి నచ్చజెప్పుచు సుమంత్ర! నిన్నెందులకు అయోధ్యకు పంపుచుంటినో వినుమని -

శ్లో॥ నగరీం త్వాం గతం దృష్ట్వా జననీ మే యవీయసీ ।
కైకేయీ ప్రత్యయం గచ్ఛేదితి రామోవనం గతః ॥

(వా.రా. అయోధ్యా. 52-61)

నీవు అయోధ్యకు తిరిగి వెళ్ళిన తదుపరి నిన్ను చూచినపుడే మా చిన్నమ్మ కైకేయి రాముడు వనముల కెళ్ళెనని విశ్వసించుననగా యిష్టము లేకున్నను సుమంత్రుడు అయోధ్యకు బయలుదేరెను. శ్రీరాముడు గుహునితో వటవృక్షపు పాలను తెప్పించి తనకు లక్ష్మణునకు జటలను చేయించుకొని గంగానదిని దాటి వనములలో తిరుగసాగెను. మార్గమధ్యలో అనేక స్థలములను దాటుచు గంగా యమునల సంగమస్థానమునకు సమీపమున నున్న మహర్షి భరద్వాజుని ఆశ్రమమునకు చేరుకొనెను. అగ్నిహోత్రము నొనర్చుచున్న ఋషినిచూచి ముగ్గురును ప్రణామమొనర్చిరి. భరద్వాజముని వారికి పాద్యమును అర్ఘ్యమును యిచ్చి సత్కరించి వారికొరకు రకరకముల అన్న, రస, ఫల, కందమూలాదులను తెప్పించెను. అతిథ్యమును స్వీకరించిన పిదప శ్రీరాము డాసనముపై కూర్చుండగా భరద్వాజుడు రామునితో - చాలాదినముల తర్వాత నిన్ను మరల ఈ ఆశ్రమములో చూచుచున్నాను. అకారణముగ నీవు వనవాసమునకు బయలుదేరినట్లు వింటిని. గంగా యమునల సంగమస్థానమున నున్న ఈ స్థాన మతి పవిత్రమైనది. రమ్యముగ ఏకాంతముగనున్న యిచ్చటనే నీవిక సుఖముగ నివసింపుమనెను. శ్రీరాముడందులకు ఓ మునివర్య! ఈ స్థానము అయోధ్యా నగరమున కతి సమీపముగ నున్నది. కనుక పురవాసులు నన్ను సీతాదేవిని చూచుటకు వచ్చుచుందురు. అందువలన నాకిచ్చట నివసించుట మంచిది కాదనిపించు చున్నది. నాపై దయతో మరొక ఏకాంత స్థలమును సూచింపుడనగా ఋషి వారిని చిత్రకూట పర్వతముపై కెళ్ళవలసినదిగా సూచించిరి. మాటలతో రాత్రికాగా ప్రయాణబడలికతో నున్న శ్రీరాముడు సీతా లక్ష్మణులతో ఆరాత్రి కచటనే గడపెను.

**చిత్రకూటముపై నివాసము :**

ఋషి ఆజ్ఞతో ప్రాతఃకాలమునే శ్రీరాముడు చిత్రకూటము వైపుగ బయలుదేరెను. వారు యమునానదిని దాటి చిత్రకూటమును చేరి అచ్చట మహర్షి వాల్మీకిని దర్శించిరి. మహర్షికి తమ పరిచయమును, తమ రాకకు కారణమును తెల్పి శ్రీరాముడు లక్ష్మణుని ఒక పర్ణకుటీరమును నిర్మింపుమని ఆదేశించెను. కుటీరము తయారు కాగనే వాస్తు శాంతి నొనర్చి గృహప్రవేశమును

చేసెను. పశుపక్ష్యాదులతో నిండి ఫలపుష్పములతో శోభించుచున్న ఆ వనమున వారానందపూర్వకముగ నివసింపసాగిరి.

ఇప్పుడయోధ్యలో ఏమి జరుగుతున్నదో చూతము. శ్రీరాముడు కనుచూపుమేర దాటినతరువాత గుహుడు తన గృహమునకు సుమంత్రుడు అయోధ్యను చేరిరి. ఆయనకు అయోధ్య నగరమంతా శోకసముద్రములో మునిగియున్నట్లగుపడెను. సుమంత్రుడు నగర ద్వారమును ప్రవేశించుటతోడనే వేలాది ప్రజలాయనను చుట్టుముట్టి శ్రీరాము డెక్కడ యని ప్రశ్నింపసాగిరి. రామలక్ష్మణులు గంగానదిని దాటి అరణ్యములోనికి వెళ్ళిపోయిరని తనను అయోధ్యకు తిరిగివెళ్ళుమని ఆజ్ఞాపించిరని ఆయన తెలిపెను. ఈ మాటలు విన్న జనసందోహము శోక సముద్రములో మునిగి తమ దుర్భాగ్యమును నిందించుకొనసాగిరి. రథమును వేగముగ నడపించుచు రాజభవనమునకు చేరి మహారాజుకు ప్రణామమొనర్చి శ్రీరాముని సందేశమును వినిపించెను. రామ లక్ష్మణులు, సీతాదేవి అరణ్యముల కెళ్ళిన వార్త విని దశరథ మహారాజు హా! రామ ! హా! లక్ష్మణ! యనుచు ప్రాణములను విడిచెను.

మహారాజు స్వర్గస్థులైన తరువాత అయోధ్య సూర్యుడు లేని ఆకాశమువలె కాంతిరహితమై కనుపింపసాగినది. రాణులు ,ప్రజలంతా శోక సాగరములో మునిగిపోయిరి. మంత్రులు మహారాజు శరీరమును నూనెలో భద్రపరచి రాజ్యసభ నేర్పాటు చేసిరి. రాజ్యసభలో వశిష్ఠుని సమక్షములో మంత్రులు తమతమ భాషణల నొసంగుచు -

**శ్లో॥ ఇక్ష్వాకూణ మిహాద్యైవ రాజా కశ్చి ద్విధీయతామ్ ।**
**అరాజకం హి నో రాష్ట్రం న వినాశ మవాప్నుయాత్ ॥**

**(వా.రా. అయోధ్యా. 67-8)**

ఈ రోజే ఇక్ష్వాకు వంశమునకు చెందిన పురుషు నెవరినైనా రాజుగా చేయవలయును. రాజులేని కారణముగ మనరాజ్యము నాశనము కారాదు. అరాచకము వలన కలుగు దోషములను గూర్చి చెప్పుచు వారు - రాజు లేకుండ దేశము జీవించి యుండజాలదు. రాజులేని దేశములో శాంతిభద్రతల

వ్యవస్థ క్షీణించిపోవును. సంతానము తల్లిదండ్రుల ఆజ్ఞలను పాలింపరు. పతిపత్ని లొకరివశమున నొకరుండరు. అరాచకదేశములో అనావృష్టివలన వ్యవసాయదారులు పంటలను పండింపజాలరు. దొంగలు, బందిపోట్లు అంతటా రాజ్యము చేయుదురు. స్త్రీ పురుషులు వ్యభిచరింతురు. యువతులు (స్త్రీలు) అభరణములు దాల్చి బయటకు పోజాలరు. ప్రజలు ఇండ్లకు తాళములు లేకుండా నిదురింపలేరు. సభ్యత, సంస్కృతులు నష్టమగును. అరాచక దేశములోని ప్రజలు ఒకరితోనొకరి కెట్టి సంబంధముండక చేపలవలె ఒకరినొకరు భక్షించెదరు. సత్య ధర్మ శుభ గుణముల వ్యాప్తికి మరియు దుష్టులను శాసించి వారి దుష్టకర్మలను నిరోధించుటకై రాజు అత్యంత అవసరము.

శ్లో॥ రాజా సత్యం చ ధర్మశ్చ రాజా కులవతాం కులమ్ ।
రాజా మాతా పితాచైవ రాజా హితకరో నృణామ్ ॥

(వా.రా. అయోధ్యా. 67-35)

రాజే సత్యధర్మములను రక్షించువాడు. రాజే ఉత్తమ ఉచిత ఆచార వ్యవహారములను సంరక్షించువాడు. రాజే ప్రజలకు తల్లి తండ్రి. రాజే ప్రజలకు హితముచేయువాడు కనుక నేడే రాజును నియమింపుడనిరి. ఈ మాటలను విన్న మహర్షి వశిష్ఠుడు విశ్వాసపాత్రులు, శీఘ్రగాములైన దూతలను పిలిచి మీరు భరత శత్రుఘ్నులను వెంటనే తీసుకొని రండు అని పంపెను. కాని మహారాజు మరణవార్త శ్రీరాముని వనవాసములను గూర్చి వారికి ఏమీ చెప్పరాదు. జాగ్రత్త! అనెను. దూతలద్వారా మహర్షి వశిష్ఠుని సందేశమును తెలుసుకున్న భరతుడు వెంటనే అయోధ్యకు బయలుదేరెను. అయోధ్యను సమీపించునపుడతని కా నగరము కళాకాంతులు లేకుండా నిర్జీవముగా కనబడినది. ఉద్యానవనములు ఎండిపోయినవి. ఏనుగుల ఘీంకారములు గుఱ్ఱముల సకలింపులు వినిపించుటలేదు. ఈవిధమైన అరిష్టములతో కూడిన దృశ్యములను చూచుచు వికలమనస్సుతో భరతుడు తన తండ్రి గారి భవనమును ప్రవేశించి ఆయనచట కనబడనందున తన తల్లి నివాసమున కెళ్ళెను. కైకేయి ఎంతో సంతోషముతో కేకయదేశ సమాచారముల

నడుగసాగినది. అచ్చటి విషయము లన్నింటినీ, వినిపించిన భరతుడు తండ్రి ఎక్కడ యని అడిగెను. అప్పుడు కైకేయి దశరథ మహారాజు మృత్యువు శ్రీరామలక్ష్మణులు సీతాదేవీల వనవాసము భరతునకు రాజ్యాభిషేకము మున్నగు విషయము లన్నింటిని గూర్చి వినిపించెను. తల్లిమాటలు విన్నంతనే భరతుడు విలపించుచు నేలపైబడి బిగ్గరగా ఏడ్వసాగెను. పుత్ర వియోగముచే కలిగిన శోకముతో దుర్బలురాలై కాంతివిహీనవదనముతో నున్న కౌసల్య భరతుని ఏడ్పువిని అతనివద్దకు బయలుదేరినది. ఇంతలో భరతుడు శత్రుఘ్నునితో కౌసల్య నివాసమునకు బయలుదేరెను. దుఃఖముతో నున్న కౌసల్యను చూచి సోదరులిరువురు ఆమెను కౌగలించుకొని విలపింపసాగిరి. కౌసల్యకూడా దుఃఖముతో భరతునితో -

'ఇదంతే రాజ్యకామస్య రాజ్యం ప్రాప్త మకంటకమ్' ।

(వా.రా. అయోధ్యా. 75-11)

'భరత ! నీకు రాజ్యకాంక్ష యుండెను. నిష్కంటకమైన ఈ రాజ్యమిప్పుడు నీదే' యనెను. తల్లిమాటలను విన్న భరతుడు అమ్మా! నాకీవిషయము లేవీ తెలియవు. నేను దోషినెట్లగుదును? అని అనేక ప్రమాణములు చేయసాగెను. తల్లికి నమ్మకము కలిగించుటకై అట్లు శపథము చేయుచు దుఃఖముతో నేలపై పడెను. అది చూచిన కౌసల్య నాయన ! నీవు ధర్మమును తప్పలేదు. నాకు తెలుసు నీవు సత్య ప్రతిజ్ఞ నొనర్చినవాడవు. అని భరతుని తన ఒడిలోనికి తీసుకొని తిరిగి ఏడ్వసాగినది. భరతుడును ఏడ్చుచుండెను. ఈ విధముగా ఆ రాతంత్రా ఏడ్పులతో గడచినది.

ప్రాతఃకాలముననే మహర్షి వశిష్ఠుని ఆదేశానుసారము భరతుడు వేదమంత్ర సహితముగ సుంగంధ ద్రవ్యములు ఘృతాహుతులతో సరయూనది తీరమున మహారాజు పార్థివ శరీరమునకు అంత్యేష్టి (దహన) సంస్కారము జరిపెను. కొన్ని రోజుల తరువాత భరతశత్రుఘ్నులు శ్రీరాముని వనవాసమును గూర్చి మాట్లాడుకొనుచుండగా ఉత్తమవస్త్రాభరణములు ధరించి మన్థర అచ్చటకు వచ్చినది. ద్వారపాలకు లామెను పట్టుకొని శత్రుఘ్నుని వద్దకు తీసుకువచ్చి పాపములన్నింటికి మూలకారణ మిది. మీరీమెను తగినట్లు దండింపుడనెను.

అప్పుడు శత్రుఘ్నుడు మన్థరను పట్టుకొని భూమిపై పడవేసి కొట్టసాగెను. శత్రుఘ్నుని క్రోధమును చూచి భరతుడతనితో తమ్ముడా! స్త్రీలను వధించుట మహాపాపము. కనుక వదలిపెట్టు మనెను.

శ్లో॥ ఇమామపి హతాం కుబ్జాం యది జానాతి రాఘవః ।
త్వాం చ మాం చ హి ధర్మాత్మా నాభిభాషిష్యతే ధ్రువమ్ ॥
(వా.రా. అయోధ్యా. 78-23)

ఈ దాసీ (మన్థర) మరణవార్త శ్రీరామునకు తెలిసినచో అపుణ్యాత్ముడు మనతో మాటమాత్రమైన మాట్లాడడు. అన్న భరతుని మాట విని శత్రుఘ్నుడు మన్థరను వదలిపెట్టెను. ఇదీ స్త్రీల యెడల భగవాన్ రామునకుగల గౌరవము. అంత్యేష్టి జరిగిన 14వ రోజున రాజ్యసభ సమావేశము జరిగినది. సభ్యులందరూ భరతుని రాజ్యమును పాలింపుమని కోరిరి. 'మా వంశములో జ్యేష్ఠపుత్రుడే రాజ్య సింహాసనము నధిష్ఠించును. శ్రీరాముడు నాకంటె పెద్ద. అయనే రాజగును. చతుర్బల సైన్యముతో నేను వనములకుపోయి అన్నగారైన శ్రీరాముని తిరిగి తీసుకొనివత్తును' అనిన భరతుని సభలోని వారంతా కొనియాడసాగిరి.

**శ్రీరాముని తీసుకు వచ్చుటకై భరతుడు ప్రయత్నించుట :**

మరునాడు భరతుడు తన ముగ్వురు తల్లులను మంత్రులను అనేక మంది పుర ప్రముఖులను తీసుకొని శ్రీరాముని వెదకుటకై బయలు దేరెను. మార్గమధ్యలో గుహునితో కలసి అతనితోపాటు భరద్వాజుని ఆశ్రమము మీదుగా వారు చిత్రకూట పర్వతము చేరిరి. సేనను ఆశ్రమమునకు చాల దూరముగనే నిలిపి భరతుడు కాలినడకనే శ్రీరాముని కలియుటకు బయలు దేరెను. ఆశ్రమమునకు చేరిన భరతుడు జటాధారియై మృగచర్మమును ధరించిన శ్రీరాముని చూచి మిక్కిలి దుఃఖితుడయ్యెను. భరతుడు శ్రీరాముని పాదములపై పడవలయునని ముందుకు సాగెను. కాని యింతలోనే 'ఆర్య' అను శబ్దము నుచ్చరించి మూర్ఛితుడై పడిపోయెను. శ్రీరాముడు భరతుని లేపి హృదయమునకు హత్తుకొని తరువాత రాజనీతికి సంబంధించిన సుందరము మనోహరమైన ఉపదేశము నిచ్చెను. శ్రీరామునకు భరతుడు తండ్రి గారి

మరణవార్తను తెలుపగా ఆకస్మిక మరణవార్త విని శ్రీరామలక్ష్మణులు మిక్కిలి దుఃఖించిరి. కొంత సమయము తరువాత మహర్షి వశిష్ఠుడు మంత్రులు, ముగ్గురు రాణులు అచ్చటకు వచ్చిరి. భరతుడు వారందరితో శ్రీరామునివద్ద కూర్చొని చేతులు జోడించి ఇట్లనెను.

శ్లో॥ సాన్త్వితా మామికా మాతా దత్తం రాజ్యమిదం మమ ।
తద్దదామి తవైవాహం భుఙ్క్ష్వ రాజ్యమకంటకమ్ ॥

**(వా. రా. అయోధ్యా. 105 - 4)**

అన్నా! మహారాజు వరదానముగ నా తల్లికిచ్చిన రాజ్యమును ఆమె నాకిచ్చినది. ఆ రాజ్యమును నేనిపుడు నీకిచ్చుచున్నాను. మీరీ రాజ్యమును సుఖముగ అనుభవింపుడు అనిన భరతుని మాటలను విన్న వారంతా బాగుగా నున్నదనిరి. కాని శ్రీరాముడు - ఓ భరత! మానవుడు తన యిష్టానుసారమేదియు చేయజాలడు. ఏలయన జీవుడు ఈశ్వరుడు కాడు. కర్మఫలమే జీవాత్మను నానారకములుగ ఆడించుచుండును. ప్రపంచమందలి పదార్థములన్నియు నశించును. ఎంత ఉన్నత స్థితిలోనున్న జీవుడైనను వాని పుణ్యము క్షీణించిన పిదప అధోగతిపాలగును. అనగా ఉన్నతి - పతనము, సంయోగ - వియోగము, జన్మ-మరణములను వానికి విడదీయరాని సంబంధమున్నది. మన తండ్రి సత్కర్మలాచరించుచు స్వర్గవాసులైరి. వారికొరకు దుఃఖించుట వ్యర్థము. నీవు దుఃఖమును విడిచి అయోధ్యకు మరలవెళ్ళి రాచకార్యములను నిర్వర్తింపుము. నేనును తండ్రిగారి ఆజ్ఞానుసారము నడుచుకుందును. మన మిరువురము తండ్రిగారి ఆజ్ఞను పాలింపవలయును" అనెను. మరల భరతుడు సుదీర్ఘ భాషణతో శ్రీరాముని రాజ్యమును గ్రహింపుమని ప్రార్థింపగా ఆయన -

శ్లో॥ పురాభ్రాతః పితా నః స మాతరం తే సముద్వహన్ ।
మతామహే సమాశ్రౌషీ ద్రాజ్య శుల్క మనుత్తమమ్ ॥

**(వా.రా అయోధ్యా. 107-3)**

పూర్వము తండ్రిగారు మీతల్లి కైకేయిని వివాహమాడునపుడు మీ పుత్రికకు జన్మించు పుత్రుని రాజుగ చేయుదునని మీ తాతగారితో ప్రతిజ్ఞ చేసిరి.

ఇదిగాక దేవాసుర యుద్ధములో మీతల్లి చేసిన ఉపకారమునకు సంతృప్తి చెందిన తండ్రిగారు ఆమెకు రెండువరము లిచ్చుటకు ప్రతిజ్ఞచేసిరి. మొదటి వరముగ మీతల్లి నీకు రాజ్యమును రెండవ వరముగ నేను వనవాసము చేయుటకును కోరినది. మహారాజు రెండు వరములనిచ్చి తన ప్రతిజ్ఞను పూర్తిచేసిరి. తండ్రిగారిని సత్యవాదిగ చేయుటకై నేను 14 సంవత్సరములు అరణ్యములలో నివసించుట, నీవు రాజ్యాభిషిక్తుడవగుటయే ఉచిత మనెను. ఎంత ఆశ్చర్యము!! ఒక గొప్పరాజ్యమును సోదరులిరువురు మట్టిబెడ్డలవలె ఒకరివద్దకు మరొకరు విసురుచున్నారు. ఎంతటి ఉన్నత ఆదర్శము! ఎంతటి ఉన్నత ఉదాత్తభావన! ధర్మపాలన ముందు రాజ్యమును తృణముగ నెంచి తుచ్ఛమైనదిగ భావించు ఆవంశము జాతి, దేశము, ధన్యమైనవి.

ఏవిధముగను శ్రీరాముని తిరిగి తీసుకువెళ్ళుటకు భరతుడు సఫలుడు గానపుడు జాబాలి మరియు వశిష్ఠ మహర్షులు శ్రీరామునకు నచ్చజెప్పుటకు ప్రయత్నింపగా వారి యుక్తులను ఎంతో సమర్థవంతముగ ఖండించుచు తాను అయోధ్యకు తిరిగివచ్చుట ఏవిధముగను సమంజసము కాదనెను. ఎంత ప్రయత్నించినను శ్రీరాముడు అయోధ్యకు తిరిగివచ్చుట కంగీకరింపనపుడు భరతుడొక బంగారు పాదరక్షల జతను శ్రీరాముని ముందుంచి దానిపై ఆయన పాదముల నుంచవలసినదిగ శ్రీరాముని ప్రార్థింపగా ఆయన పాదరక్షలను ధరించి తిరిగి వానిని భరతున కిచ్చివేసెను. అప్పుడు భరతుడా పాదరక్షలను ఆదరపూర్వకముగ తీసుకొని హే! మహాబాహో, అయోధ్య రాజసింహాసనముపై ఈ పాదరక్షలే ఉంచబడును. నేటినుండి 14 సంవత్సరములు నేను కూడా జటా - నారచీరలు ధరించి కందమూలములను ఫలములను భుజించుచు నీరాకకై ఎదురుచూచుచు నగరమునకు వెలుపలనే నివసించుచు అచ్చటి నుండియే రాజ్యపాలనము చేయుచుందును. అంతేగాక, -

శ్లో॥ చతుర్దశే హి సంపూర్ణే వర్షేఽహని రఘూత్తమ ।
నద్రక్ష్యామి యది త్వాంతు ప్రవేక్ష్యామి హుతాశనమ్ ॥

(వా.రా. అయోధ్యా. 112-25)

14 సంవత్సరములు పూర్తికాగానే మీరు అయోధ్యకు రానిచో నేను

అగ్నిలో ప్రవేశించి భస్మమగుదును. అనగా శ్రీరాము డట్లేనని భరత శత్రుఘ్నులను ఆలింగన మొనర్చుకొని వచ్చిన మంత్రులు ప్రజలను తగినరీతిలో సత్కరించి వారిని పంపివేసెను. భరతుడు పాదుకులను శిరస్సున నిడుకొని అయోధ్యకు మరలెను. దారిలో భరద్వాజ మహర్షిని దర్శించి తదుపరి యమునా - గంగా నదులను దాటి శృంగవేరపురము గుండా మహారాజు దశరథుడు, శ్రీరాముడు లేక కాంతివిహీనముగ నున్న అయోధ్యానగరమును చేరెను. తమ తల్లులు అయోధ్యకు చేరగానే భరత శత్రుఘ్నులు నందిగ్రామమున నివసించుచు అచ్చటినుండి రాచకార్యములను నిర్వహింపసాగిరి.

అయోధ్యావాసులు తిరిగి వెళ్ళిన తదుపరి శ్రీరాముడచట నివసించుట ఉచితము కాదని తలంచెను. దానికి కారణములలో ఒకటి అచ్చట తన సోదరుడు భరతుడు, తల్లులు వచ్చి కలసినందున వారు మాటిమాటికి గుర్తు వచ్చుచుండుట. రెండవది భరతుని సైన్యము అచ్చట ఉండి వెళ్ళినందున అచ్చటి భూమి, జల, వాయువులు కలుషితములైనవి. అందువలన శ్రీరాముడచటినుండి అత్రిముని ఆశ్రమమునకు చేరుకొనెను. అచ్చటి ఋషి పత్ని వృద్ధురాలైన అనసూయ సీతాదేవికి పతివ్రతా ధర్మమునుగూర్చి అత్యంత సారగర్భితమైన మనోహర ఉపదేశమును చేసెను. ఒక రాత్రి అచ్చట గడపిన తరువాత వారివద్ద సెలవుతీసుకొని ముందుకు సాగిపోయి దండకారణ్యమున ప్రవేశించిరి. అచ్చట వారనేక తాపసుల సుందరభరిత ఆశ్రమములను చూచిరి. ఆశ్రమముల వాతావరణము యజ్ఞముయొక్క సుగంధముతోను, వేదాధ్యయన ఘోషతోను నిండియుండెను. లేడులచట నిర్భయముగ చరించుచుండెను. వృక్షములు ఫలభరితములై యున్నవి. దండకారణ్యమున ప్రవేశించిన రామునకు ఋషులు స్వాగతమొసంగిరి. శ్రీరాముడారాత్రి మునుల ఆతిథ్యమును స్వీకరించి మరునాడు ఘోరారణ్యమున ప్రవేశించెను. దారిలో వారు నరమాంసమును భక్షించు విరాధుడను రాక్షసుని చూచిరి. వాడు క్రోధముతో ప్రళయకాల రుద్రునివలె వారిపై లంఘింపగా రామలక్ష్మణులు వెంటనే వానిని అంత మొందించిరి. రామలక్ష్మణు లతనిని భూమిపై పడవేయగా తన పూర్వజన్మకు సంబంధించిన స్మరణవచ్చి అతడు వారిని మహర్షి శరభంగుని ఆశ్రమమునకు



వెళ్ళుడని చెప్పెను. విరాధుని భూమిలో ఖననమొనర్చి శ్రీరాముడు శరభంగుని ఆశ్రమమువైపుగ బయలుదేరెను.

**రాక్షస సంహారమునకై ప్రతిజ్ఞ చేయుట :**

ఒకరాత్రి శరభంగుని ఆశ్రమమున గడపి వారి అతిథ్యమును గ్రహించి మరునాడు వారు శరభంగుడు సూచించినట్లుగ సుతీక్ష్ణుని ఆశ్రమమునకు బయలుదేరుచుండగా దండకారణ్యము నందలి ఋషిమునులందరూ శ్రీరామునివద్దకు వచ్చి ఓ రామ! మీవంటి రాజులుండి కూడా మేము అనాథలవలె మృత్యువాత బడుచున్నాము. నీవు శరణాగత వత్సలుడవు, కనుక మమ్ము రక్షింపుము. మీరుతప్ప మమ్మీ రాక్షసుల బారినుండి రక్షింపగల వారెవరు? అనిన వారి మాటలకు శ్రీరాముడు

**శ్లో॥ నైవ మర్హథ మాం వక్తు మాజ్ఞప్తోఽహం తపస్వినామ్ ।**
**కేవలే నాత్మ కార్యేణ ప్రవేష్టవ్యం మయావనమ్ ॥**

**(వా.రా. అరణ్య. 6-22)**

మీరు నన్ను ప్రార్థించుట సమంజసముకాదు. నేను తపస్వులైన మీ ఆజ్ఞను పాలించువాడను. మీ కార్యమును నిర్వర్తించుటకే నేను వనమున ప్రవేశించితిని. రాక్షసులందరినీ నాశనము చేయుదుననెను. తులసీదాసు మాటలలో చెప్పవలయుననిన -

**నిశి చర హీన కరౌఁ మహీ, భుజ ఉఠాయ పణకీన్హ ।**

ఋషుల యెడల శ్రీరాముని హృదయములో ఎంతటి ఉదాత్త భావనగ గలదు! ఋషుల కభయహస్త మొసంగి శ్రీరాముడు సుతీక్ష్ణుని ఆశ్రమమునకు చేరెను. అచ్చటకూడ ఒక రాత్రి గడపి దండకారణ్యమునకు బయలుదేరిరి. మార్గమధ్యలో సీతాదేవి శ్రీరామునితో - కామము వలన మూడు వ్యసనములు (దురలవాట్లు) అబ్బును. 1. అసత్యములాడుట 2. (ఇతర స్త్రీలతో) వ్యభిచరించుట 3. విరోధము లేకుండా ప్రాణులను హింసించుట -

**శ్లో॥ మిథ్యావాక్యం నతే భూతం న భవిష్యతి రాఘవ ।**
**కుతోఽభిలషణం స్త్రీణాం పరేషాం ధర్మనాశనమ్ ॥**
**తృతీయం యదిదం రౌద్రం పరప్రాణాభి హింసనమ్ ।**

**నిర్వైరం క్రియతే మోహాత్తచ్చ తే సముపస్థితమ్ ॥**

(వా.రా. అరణ్య. 9-5, 9-9)

" ఓ రాఘవ! మీరెప్పుడును అసత్యమాడలేదు. ఇకపైకూడ ఆడరు. ధర్మభ్రష్టులను చేయు పరస్త్రీ గమనాభిలాషకూడ మీలో నెన్నడు కలుగలేదు. కాని మూడవదైన - అనగా విరోధము లేకుండా యితరులను వధించు - దోషము మీలో కలుగబోవుచున్నది. మీరు ఋషుల సమక్షమున రాక్షసులను చంపుదునని చేసిన ప్రతిజ్ఞవలన నా మనస్సు ఆందోళన చెందుచున్నది. శస్త్రములు దగ్గర ఉండుటవలన ఆపదలు వచ్చిపడుచుండును. ఓ రామ! నేను మీకుపదేశమిచ్చుట లేదు. కాని మీపైగల అత్యంత గౌరవము స్నేహమువలన మీకీ మాటలు గుర్తుచేయుచున్నాను." అనిన సీతాదేవి స్నేహపూరిత వాక్కులను విన్న శ్రీరాముడిట్లనెను.

ఓ జనకనందినీ! నీవు స్నేహపూర్వకముగ చెప్పిన మాటలు నీ(కొఱ)కే వర్తించును. కానీ నాకు వర్తింపవు. ఏలయన, నీకు తెలుసును -

'క్షత్రియై ర్ధార్యతే చాపో నార్త శబ్దో భవేదితి'। (వా.రా. అరణ్య 10-3)

ఎటువైపునుండియు దుఃఖితుల ఆర్తనాదము వినబడకుండుటకు గాను క్షత్రియులు ధనుస్సును ధరింతురనునది నీకు తెలిసినదే కదా. ఈ దండకారణ్యవాసులు - దుఃఖితులైన తాపసులు తమను రక్షింపగలనని నమ్మి నన్ను స్వయముగ శరణుకోరిరి. ఈ తాపసులు ఫల పుష్పములను భుజించుచు, ధర్మము ననుష్ఠించుచు వనములలో నివసించుచుందురు. ఐనా వీరిని రాక్షసులు బాధించుచుందురు. పీడింపబడి దుఃఖితులైన ఈ ఋషులు స్వయముగ తమను రక్షింపవలసినదిగ నన్ను కోరిరి. సత్యము నా జీవనమునకు సదా ప్రియమైన వస్తువు. అందువలన -

శ్లో॥ **అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్ ।**
**నతు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః ॥**

(వా.రా. అరణ్య 10-19)

ఇప్పుడీ కార్యములో నేను నా ప్రాణములను త్యజించవలసి వచ్చినను, నిన్ను, లక్ష్మణుని విడువవలసి వచ్చినను సరే, కాని నా ప్రతిజ్ఞను ముఖ్యముగ

బ్రాహ్మణుల సమక్షమున చేసిన నా ప్రతిజ్ఞను మాత్రము త్యజింపజాలను. నీవు స్నేహసౌహార్ద్ర హృదయములతో చెప్పిన మాటలకు నేనెంతో సంతసించుచున్నాను. అనెను.

సీతతో ఈ విధముగ పలుకుచు శ్రీరాముడా వనములోని రమణీయ పర్వత శిఖరములను, వనములను, సుందరనదులను చూచి ఆనందించుచు ముందుకు నడువసాగెను. దారిలో వారికొక ఆశ్రమ మండలి కనుపించెను. ఆ ఆశ్రమ మండలిలోని ఋషులతో కలసి 10సం॥లు సుఖముగ కాలము గడపెను. తరువాత సుతీక్ష్ణుని ఆశ్రమమునకు వెళ్ళి అచ్చటినుండి అగస్త్యాశ్రమమునకెళ్ళిరి. మహర్షి ఫలములు, కందమూలములు, పుష్పాదులతో వారిని ఆదరించి ఒక దివ్య ధనుస్సును, బాణములతో నిండియున్న తూణీరమును, ఒక ఖడ్గమును బహుకరించెను.

**గృధ్రరాజు జటాయువుతో కలియుట :**

అగస్త్య మహర్షి యిచ్చిన అస్త్రశస్త్రములతో బయలుదేరి ఆయన చెప్పినట్లుగా పంచవటికై బయలుదేరిరి. మార్గమధ్యలో శ్రీరామునకొక స్థూలకాయముతో - భయానకమైన గృధ్రరాజు కనబడెను. అతనిని రాక్షసునిగ తలచిన శ్రీరాముడు 'నీవెవరవని' ప్రశ్నించెను. అప్పుడు

**శ్లో॥ స తౌ మధురయా వాచా సౌమ్యయా ప్రీణయన్నివ ।**
**ఉవాచ వత్స మాం విద్ధి వయస్యం పితురాత్మన : ॥**

**(వా.రా. అరణ్య. 14-3)**

మిక్కిలి సుజనత్వముతో మధురశబ్దములతో శ్రీరాముని ప్రసన్నము చేయుచు ఆ గృధ్రరాజు - ఓ కుమార ! నేను నీ తండ్రి మిత్రుడను అనెను. శ్రీరాముడాయనను తన తండ్రికి స్నేహితునిగ విని ఆదర సత్కారములతో ఆయన పేరును గోత్రాదులను నడిగెను. అప్పుడు -

**శ్లో॥ ఆచచక్షే ద్విజస్తస్మై కులమాత్మాన మేవ చ ।**
**జటాయురితి మాం విద్ధి శ్యేనీ పుత్ర మరిన్దమ ॥**

**(అరణ్య. 14-5, 14-33)**

ఆ బ్రాహ్మణుడు తన నామమును గోత్రమును చెప్పెను. "హే

అరిందమ! నేను శ్యేనీపుత్రుడనగు జాటాయువును. మీకిష్టమున్నచో వనవాసములో మీకు సహాయము చేయుదును" అనెను. శ్రీరాముడు వాని మాటలను విని తన హృదయమునకు హత్తుకొనెను. తదుపరి ప్రణామముచేసి పంచవటికి చేరుకొనెను.

(ఇచ్చట గృధ్రరాజు దశరథ మహారాజు మిత్రునిగ చెప్పబడెను. కనుక గృధ్రమనగా పక్షికాదు. వాల్మీకి మహర్షికూడా జటాయువును 'ఆర్య' అను విశేషముతో సంబోధించెను.

సీతాదేవిని రావణుడు అపహరించుకొని పోవుచున్నపుడు ఆమె జటాయువుతో యిట్లనెను. -

'జటాయో పశ్య మామార్య హ్రియమాణా మనాథవత్ ।'

అంతేగాక పక్షులకు కులగోత్రము లుండవు కదా ।)

శూర్పణకను దండించుట :

పంచవటిలో లక్ష్మణుడొక పూర్ణకుటీరమును నిర్మించి దానిలో అంతా సుఖముగా నివసించుచుండిరి. ఒకనాడు రామలక్ష్మణులు కుటీరములో కూర్చొని మాటలాడుకొనుచుండగా శూర్పణఖ అచ్చటికి వచ్చినది. ఆమె పరమతేజోవంతుడు, కామదేవునితో సమానముగ సుందరముగ నున్న శ్రీరాముని చూచి ఆయనపై మోహముతో - మీరెవరు, ఈ వనములో ఎందుకున్నారని అడుగసాగెను. శ్రీరాముడు తన పరిచయమును తెలిపి శూర్పణఖతో - నీ పరిచయమును కూడ యిమ్ము. నీవెవరవు ? ఎవరి పుత్రికవనెను. నీవు రాక్షసివిగ నాకగుపించుచున్నావనెను. అందుకు శూర్పణఖ - నేను రావణుని చెల్లెలను, స్వతంత్రముగ వనములలో తిరుగుచుందును. మీరు నాకు పతి కావలయునని వేడుకొనుచున్నాను. నే నన్నివిధముల మీకు తగినదానను. కురూపీ కులటయైన సీతను, లక్ష్మణుని తినివేయుదును. మీరు నాతో సుఖముగ కాలము గడుపుడనెను. శూర్పణఖ మాటలకు శ్రీరాముడు మందహాసము చేయుచు నిట్లనెను. -

శ్లో॥ కృతదారోఽస్మి భవతి భార్యేయం దయితామమ ।
త్వ ద్విధానం తు నారీణాం సుదుఃఖా స సపత్న తా ॥

అనుజస్త్వేష మేభ్రాతా శీలవాన్ ప్రియదర్శనః ।
శ్రీమా నకృతదారశ్చ లక్ష్మణోనామ వీర్యవాన్ ॥

(వా.రా. అరణ్య. 18-2, 18-3)

ఓ దేవీ! నాకు వివాహమైనది. నాపత్ని నాకతి ప్రియురాలు. ఈమె నీకు సవతి యగుటకూడ నాకు దుఃఖమును కలిగించును. ఆ; నా చిన్నతమ్ముడు లక్ష్మణునకు వివాహము కాలేదు. గుణవంతుడు. అందమైనవాడు తేజస్వియైన అతడు నీకు పతియగుటకు యోగ్యుడనెను. అంతట శూర్పణఖ లక్ష్మణుని తనను భార్యగా చేసుకొనుమని ప్రార్థించెను. లక్ష్మణుడందులకు - నీవు దాసుని భార్యయై ఏమిచేయుదువు? శ్రీరాముడే నీకన్నివిధములా తగినవాడు. నీవాయనవద్దకే వెళ్ళుము. నీవు వివాహము చేసుకున్నచో ఆయన సీతను విడిచి నీప్రియుడగును. అనిన లక్ష్మణుని పరిహాస వాక్యముల నర్థము చేసుకొనని ఆమె తిరిగి రామునివద్దకు వెళ్ళి మీరు సీతకారణముగ నన్ను కొంచెమైనను లెక్కచేయుటలేదు. మీరు చూచుచుండగనే సీతను తినివేయుదు ననుచు సీతవైపు పోవుచుండగ శ్రీరాముడు లక్ష్మణునితో యిట్లనెను. -

శ్లో॥ క్రూరై రనార్యైః సౌమిత్రే పరిహాసః కథంచన ।
న కార్యః పశ్య వైదేహీం కథంచిత్ సౌమ్య జీవితామ్ ॥

(వా.రా. అరణ్య. 18-19)

ఓ లక్ష్మణ! ఇటువంటి అసభ్య క్రూరులతో పరిహాసము లాడరాదు. ఓ సౌమ్య. శూర్పణఖయొక్క ఈ క్రూరచేష్టలను చూచి సీత శాంతముగ ఎట్లుండగలదు? నీవీ కులటను వెంటనే కురూపిగ చేయుమన్న మాటలను విన్న లక్ష్మణుడు -

శ్లో॥ ఉద్ధృత్య ఖడ్గం చిచ్ఛేద కర్ణనాసే మహాబలః । (18-21)
కత్తితో ఆమె ముక్కు చెవులు కోసెను

(శ్లో॥ సజాతా వృత్తమో దండ అనులోమ్యే తు మధ్యమః ।
ప్రతిలోమ్యో వధః పుంసో నార్యాః కర్ణాదికర్తనమ్ ॥
(యాజ్ఞ వల్క్యస్మృతి 2-289)
శూర్పణఖ బ్రాహ్మణ వంశమునకు చెందిన విధవాస్త్రీ. బ్రాహ్మణితో

క్షత్రియుని వివాహము అనుచితము శాస్త్రవిరుద్ధము. శూర్పణఖ శాస్త్రవిరుద్ధముగ ప్రతిలోమ వివాహమును కోరినది.న్యాయానుసారము ప్రతిలోమ వివాహమును కోరు పురుషునకు మరణదండనను స్త్రీయైనచో ముక్కు, చెవులు కోయవలయునని యాజ్ఞవల్క్య స్మృతి స్పష్టముగ ఆదేశించుచున్నది. )

శూర్పణఖ ఏడ్చుచూ తన సోదరుడు ఖరునివద్దకు వెళ్ళినది. అతడు తనసోదరి దుస్థితిని చూచి విషయమంతా విని ముందుగ తన వద్దనున్న 14మంది యోధులను శ్రీరాముని వధించిరండని పంపెను. శ్రీరాముడు వారందరిని చంపగా దూషణ, త్రిశిరలతోపాటు 14 వేలమంది రాక్షసులతో శ్రీరామునిపై దండెత్తెను. ఒకవైపు శ్రీరాముడు ఒంటరిగను, మరొకవైపు ఖరదూషణులు 14వేలమంది రాక్షస సైన్యమునకు మధ్య ఘోరయుద్ధము జరిగినది. ముందుగ శ్రీరాముడు దూషణుని, త్రిశిరను పరలోకమున కంపి తదుపరి ఒక ఆగ్నేయాస్త్రముతో ఖరుని కూడ చంపెను. అకంపనుడను రాక్షసుడు లంకా నగరమునకు పోయి వీరందరి మరణవార్తను గూర్చి రావణునకు నివేదించెను. ఖరదూషణుల మరణవార్త విన్న రావణుడత్యంత కుపితుడై స్వయముగ వెళ్ళి రామలక్ష్మణుల నిరువురను వధించుటకు నిశ్చయించెను. అందులకు అకంపనుడు ఓ రాజ! విలువిద్యలో శ్రీరాము డత్యంత నిపుణుడు. అతడు మహాబలశాలి. పరాక్రమవంతుడు. సురలు, అసురలంతా కలిసినా ఆయనను ఓడింపజాలరు. ఆయనను చంపవలయుననిన ఒకే ఉపాయ మున్నది. లోకసుందరియైన ఆయన భార్య సీత రత్నఖచిత ఆభరణములను ధరించి ఆయనతో నున్నది. నీవా మహారణ్యమునకు వెళ్ళి ఛల కపటములతో గాని, బల పరాక్రమములతో గాని, ఆమెను ఎత్తుకొని రమ్ము. సీతా వియోగముతో స్వయముగనే శ్రీరాముడు ప్రాణములను త్యజించుననెను.

రావణునకీ ఉపాయము నచ్చినది. మరునాడు మరీచునివద్దకు వెళ్ళి అతని సహాయము నర్థించెను. రావణుని మాటలు విన్న మరీచుడు - రావణ! నీ కీ తప్పుడు సలహా నిచ్చినదెవరు? శ్రీరాముడు మదించిన ఏనుగు మరియు కలత చెందిన సింహములవంటివాడు. నిద్రించుచున్న ఆ పురుషసింహమును మేల్కొల్పకుము. లంకకు వెళ్ళి నీభార్యలతో సుఖింపుమని నచ్చచెప్పగా

రావణుడు లంకకు తిరిగిపోయెను. 14వేల రాక్షసులు యుద్ధములో చనిపోవుట చూచిన శూర్పణఖ కూడ లంకకు వచ్చినది. తన సోదరి కురూపముచూచిన తరువాత శూర్పణఖద్వారా సీతయొక్క సౌందర్యమును గూర్చి విన్న రావణుడు మరల మారీచునివద్దకు పోయి - శ్రీరాముడు నా సోదరి ముక్కుచెవులు కోసి కురూపిగ చేసెను. అందువలన నేను జనస్థానము నుండి అతని భార్యను దొంగిలించి తీసుకురాదలచితిని. నీవు సకల మాయలలో చతురుడవు. "సర్వ మాయా విశారదః" (అరణ్య. 36-15) కనుక నీవు వెండిచుక్కలు గల బంగారు లేడి వేషమును ధరించి రాముని అశ్రమమునకు పోయి సీతవద్ద తిరుగాడుచుండుము. నిన్ను చూచి సీత రామలక్ష్మణులతో ఆ లేడిని పట్టి తీసుకొనిరమ్మని యడుగును. రాముడు నిన్ను పట్టుకొన వచ్చినపుడు నీవాయనను దూరముగ తీసుకొనిపోయి సరిగా రాముని గొంతుకతో హా సీతా! హా లక్ష్మణ! యని అరువవలయును. నేను సీతను ఎత్తుకువచ్చెద ననెను. మారీచు డెన్నివిధముల నచ్చజెప్పినను వినక రావణుడు దురాగ్రహముతో అతనిని చంపుదునని బెదిరింపగా మారీచుడు -

**శ్లో॥ రామాదపి చ మర్తవ్యం మర్తవ్యం రావణాదపి ।**
**ఉభయోర్యది మర్తవ్యం వరం రామో న రావణః ॥**

**(హనుమన్నాటకం 3-25)**

శ్రీరాముని చేతనో రావణుని చేతిలోనో మరణింపవలయును. ఇరువురిలో ఒకరిచేతిలో మరణింపవలసి వచ్చినపుడు రావణునికంటె రాముని చేతిలో మరణించుట శ్రేష్ఠమని తలంచి రావణునితో దండకారణ్యమునకు పోయి మాయలేడి రూపమును ధరించి శ్రీరాముని అశ్రమమున తిరుగాడసాగెను. సీతాదేవి ఆ మృగమును చూచి రామలక్ష్మణులను పిలిచి ఆ లేడిని చూపగా లక్ష్మణుడు.

**శ్లో॥ తమేవైన మహం మన్యే మారీచం రాక్షసం మృగమ్ ॥**

**(వా.రా. అరణ్య. 43-4)**

మారీచుడను రాక్షసుడు ఈ లేడి రూపమును ధరించినట్లు కనబడు చున్నది. ఓ రాఘవ! ఇటువంటి లేడినెప్పుడు చూడలేదు. కనుక తప్పకుండ

యిది (మాయ) కల్పింపబడినదే. అనగా విని ఆలోచనలో పడిన శ్రీరామునితో సీత యిట్లనెను -

శ్లో॥ ఆర్యపుత్రాభిరామోఽసౌ మృగో హరతి మే మనః ।
అనయైనం మహాబాహో! క్రీడార్థం నో భవిష్యతి ॥

(వా.రా. అరణ్య. 43-9)

ఆర్యపుత్ర! అత్యంత సుందరముగ నున్న ఈ లేడి నా మనస్సు నెంతగానో అకర్షించుచున్నది. హే మహాబాహో! నీవాలేడిని పట్టుకొని రమ్ము. నేను దానితో అడుకుందును. అనిన సీతమాటలకు శ్రీరాముడు లక్ష్మణునితో - నిజముగ అటువంటి లేడి లభించుట అసంభవము. ఇది మారీచుడే యైనచో నేను తప్పక దీనిని వధింతును. నేను దానిని పట్టుకొనుటకు పోవుచున్నాను. నీవు సీతను కాపాడుచుండుమనెను. తనవైపు వచ్చుచున్న శ్రీరాముని చూచి మరీచుడు మాయామృగరూపములో కొంతతడవు కనబడకుండా దాగుకొనుచు మరికొంత తడవు దగ్గరగా వచ్చుచు గంతులు వేయుచు మరల దూరముగ పారిపోవుచుండెను. అట్లు కనబడనట్లుండి దాగుకొనుచు శ్రీరాముని చాలాదూరము వరకు తీసుకొని పోయెను. అప్పుడు అది లేడికాదని మారీచుడని శ్రీరాముడు నిశ్చయము చేసికొని దానినొక బాణముతో కొట్టగా బాణపుదెబ్బకు మారీచుడు భూమిపై పడి -

శ్లో॥ మ్రియమాణస్తు మారీచో జహౌ తాం కృత్రిమాం తనుమ్ ।

(వా.రా. అరణ్య. 44-17)

మారీచుడు మరణించునపుడు తాను ధరించిన కృత్రిమ లేడి శరీరమును విడిచి హా సీతా! హా లక్ష్మణ! అంటూ ప్రాణములు విడిచెను. తనపతి కంఠ స్వరము వంటి స్వరముతో నున్న ఆర్తనాదమును విన్న సీత శ్రీరామునకెదో అపద వాటిల్లినదని తలంచి వెంటనే సహాయమునకై లక్ష్మణుని వెళ్ళుమని కోరెను. అది శ్రీరాముని కంఠస్వరము కాదని, శ్రీరాముని యుద్ధములో నెవరు జయింపలేరని అనేక విధముల లక్ష్మణుడు సీతకు నచ్చజెప్పినను వినక ఆమె లక్ష్మణుని నిందింపసాగినది. వివశుడై లక్ష్మణుడపుడు సీతను విడిచి పోవలసి వచ్చినది. లక్ష్మణుడటు కొద్దిదూరము వెళ్ళగానే చూచి రావణుడు సంన్యాసిరూపమును దాల్చి సీతవద్దకు వచ్చెను. సీతాదేవి అతనిని అతిథిగ

తలంచి శ్రద్ధతో ఆతిథ్యమొసంగెను. తదుపరి సీతాదేవితో రావణుడు నేను లంకాధిపతియైన రావణుడను నిన్ను మోహించితిని. నాతో లంకకు వచ్చి నా పట్టపురాణివై ఆనందముగ లంకారాజ్యము నేలుమనిన రావణుని ఆమె చీదరింపుతో యిట్లనెను -

శ్లో॥ త్వం పునర్జంబూకః సింహీం మామిచ్ఛసి సుదుర్లభామ్ ।

(వా.రా. అరణ్య. 47-37)

నక్కతో సమానమైన నీవు దుర్లభమై సింహసదృశియైన నన్ను పొంద గోరుదువా? గుర్తుంచుకో. నన్ను పొందాలని ప్రయత్నించినచో నీవు ఆకాశమునకు గాని పాతాళమునకు గాని ఎచ్చటికి పోయినను నిన్నెవరూ రక్షింపజాలరు. ఇట్లు సీత రావణుని చీదరించుచు, నిరసించుచుండగనే అతడామెను పట్టుకొని తన ఆకాశగామియైన విమానములో ఉంచి లంకారాజ్యము వైపుగా బయలు దేరెను.

(రావణునకు గల దశగ్రీవ, దశానన మున్నగు పేర్లను చూచి కొందరు రావణునకు పదితలలున్నవందురు. ఇది సరికాదు. వేదములో బ్రాహ్మణునకు - 'దశ శీర్షో దశాస్యః' (అథర్వ 4-6-1) అని చెప్ప బడినది. రావణుడు పులస్త ఋషివంశమున జన్మించిన బ్రాహ్మణుడు కనుక మహర్షి వాల్మీకి వ్రాసినది సరియైనదే. అట్లే దశరథుడు, అనగా 10 రథములే కలవాడని గాని, లేక 10 రథముల నొకేసారి నడుపుచుండెడివాడని గాని అర్థము కాదు . సంస్కృతములో సింహమును పంచానన యనికూడ పిలుతురు. అంతమాత్రమున ఏ సింహమునకైనా 5 ముఖములుండునా? రావణునకు ఒకే తల రెండు భుజములే యున్నట్లు అనేక ప్రమాణములు కలవు. ఉదాహరణకు - హనుమంతుడు లంకలో సీతాదేవిని వెదకుచు రావణుని రాజప్రాసాదమును చూచినపుడు -

శ్లో॥ దదర్శ స కపిస్తస్య బాహూ శయనసంస్థితౌ ।
మన్దరస్యాన్తరే సుప్తౌ మహాహీ రుషితావివ ॥
తస్య రాక్షస సింహస్య నిశ్చక్రమా మహాముఖాత్ ।
శయానస్య వినిఃశ్వాసః పూరయన్నివ తద్గృహమ్ ॥ (సుం. 10-21, 10-24)

క్రోధముతో నున్నరెండు సర్పములు పర్వతములో నిద్రించు చున్నట్లుగ తన రెండు భుజములను చాపి శయ్యపై నిద్రించుచున్న రాక్షసరాజు రావణుని హనుమంతుడు చూచెను. నిద్రించుచున్న రాక్షసరాజు మహాముఖము నుండి వెలువడు శ్వాసతోఆరాజప్రాసాదము నిండుచున్నది. సంస్కృతములో 'బాహూ' అనగా రెండు భుజములని 'ముఖాత్' అనగా ఒక ముఖము=నోటినుండి యని యర్థము.

రావణుడు మాయలమారి కనుక తాను తలచుకున్నపుడెల్ల 10 తలలు 20 భుజములు కృత్రిమముగ ధరింపగలుగును. )

సీతాదేవి హా రామ! హా లక్ష్మణ! యని విలపించుచు బిగ్గరగా అరచుచు రోదించుచున్నది. కాని ఆమె కరుణపూరిత ఆక్రందన వారికి వినబడుట లేదు. మార్గమధ్యమున జటాయువు కనబడగా ఆయనతో తనను రక్షింపుమని ప్రార్థింపసాగెను. సీత దుఃఖమును విన్న జటాయువు రావణుని మార్గమున కడ్డుగనిలచి యుద్ధమునకు తలపడెను. ఇరువురిమధ్య భయంకరమైన యుద్ధము జరిగినది. రావణుడు బలశాలి, అతడు అస్త్రశస్త్రములతో కూడి రథముపై నున్నందునను, జటాయువు వృద్ధావస్థలో నుండి అస్త్రశస్త్రము లెవ్వియు లేనందునను రావణుడు జటాయువును వక్షస్థలముపై కొట్టి భూమిపైపడవైచి సీతను రథముపై నెక్కించుకొని తిరిగి బయలుదేరెను. సీతాదేవి రావణుని పరుషవచనములతో నిందించుచున్నది. ఆమెదృష్టి ఒక పర్వతశిఖరముపై నున్న వానరులపై పడినది. వెంటనే ఆమె తన అభరణములను కొన్నింటిని తీసి ఒక వస్త్రమునకట్టి ఆవనములో వానరులమధ్య జారవిడిచెను. విలపించుచున్న ఆమెను రావణుడు లంకానగరములోని అశోకవనమున బంధింపగా ఆమె శ్రీరాముని వియోగముతో దుఃఖమయ జీవితమును గడుప సాగెను.

**సీతాదేవి నన్వేషించుట :**

ఇచ్చట శ్రీరాముడు లేడిని చంపి ఆశ్రమమువైపుగ వచ్చుచుండగా ఆయనకు లక్ష్మణు డెదురయ్యెను. అతనిని చూచిన శ్రీరామునకు సీత విషయములో చాలాశోకము కలిగెను. సీతను చూడవలయునను కోరికతో

ఆశ్రమమునకు శీఘ్రముగ చేరిన ఆయనకు కుటీరము ఖాళీగా కనబడినది. సీతాదేవి పర్ణశాలలో కనబడనందున అటునిటు పరుగిడుచు సీతాదేవిని వెదుకసాగెను. ఎచ్చటా సీతాదేవి కనబడనందున బిగ్గరగా రోదించుచు వృక్షముల నడుగసాగెను -

శ్లో॥ అపి కచ్చిత్త్వయా దృష్టా సా కదంబప్రియా ప్రియా । (వా.రా. అరణ్య 60-12)

ఓ! కదంబవృక్షమా! నా ప్రియురాలు సీతాదేవిని చూచితివా? ఇట్లే బిల్వ వృక్షమును, అర్జునవృక్షమును, అశోకవృక్షమును, తాళ (తాటి) వృక్షమును ప్రశ్నింపసాగెను? వృక్షములనే గాక వనమునందలి పశువులను అడుగసాగెను.-

శ్లో॥ అథవా మృగశావాక్షీం మృగజానాసి మైథిలీమ్ । +

(వా.రా. అరణ్య 60-23)

**( + శ్రీరాముని భగవంతుని అవతారముగ తలంచువారు పైశ్లోకములను గూర్చి ఆలోచింపుడు. భగవంతునకు రావణుడు సీత నపహరించుకుపోయినట్లు తెలియదా? శ్రీరాముడు భగవంతుడు (సృష్టికర్త) కాదు. మహర్షి వాల్మీకి ఆయనకు మహామానవునిగనే వర్ణించెను. )**

ఓ హరిణమా! నీవు హరిణలోచనియైన (లేడి కన్నులవంటి కన్నులు గల) సీతను చూచితివా? అనుచు ఇట్లు అరణ్యములో వెదకి వెదకి ఆశ్రమమునకు తిరిగివచ్చిన శ్రీరాముడు సీతజాడ దొరకనందున విచార సముద్రములో మునిగియుండెను. లక్ష్మణుడు అన్నగారి నోదార్చుచు ఉత్సాహము కలుగజేయుచుండెను. లక్ష్మణుడు అన్నగారి నోదార్చుచు ఉత్సాహము కలుగజేయుచుండెను. వారిరువురు కొండల - గుహలలో, పర్వత-లోయలలో, నదీ-సరోవరములలో సీతాదేవిని వెదుకసాగిరి. ఇట్లు అన్వేషించుచున్న వారికి రక్తసిక్తమై విశాలకాయుడైన ఒకవ్యక్తి కనబడెను. సమీపమునకు వెళ్ళిచూడగా జటాయువని తెలిసినది. జటాయువు సీతనపహరించిన రావణునితో తానుచేసిన యుద్ధమునుగూర్చి సంపూర్ణ వృత్తాంతమును చెప్పి ప్రాణములు త్యజించెను. శోకతప్తులైన సోదరులిరువురు ఆ గృధ్రరాజునకు అంత్యేష్టి సంస్కారము జరిపి తదుపరి సీతను వెదకుచు దక్షిణదిశగా ముందుకు సాగిరి. కొంతదూరము ముందుకు వెళ్ళగా

విశాలకాయుడైన కబంధరాక్షసు డగుపడెను. అతడు వారిరువురను పట్టుకొనెను.

శ్రీరామ లక్ష్మణులు వాని భుజములను ఖండించి పరలోకమున కంపిరి. ఆ రాక్షసుడు చనిపోవుచు సుగ్రీవునితో స్నేహము చేయవలసినదిగ శ్రీరామునకు సలహా నొసంగి అతని నివాసమునకు దారి చూపెను. రాజకుమారు లిరువు కబంధుడు చెప్పిన మార్గమున ముందుకు సాగిపోయిరి. దారిలో వారు పంపాసరోవరమునకు పశ్చిమ ఒడ్డుననున్న సుందరమైన శబరి ఆశ్రమమునకు చేరుకొనిరి. తన ఆశ్రమమునకు వచ్చిన సోదరులను అర్ఘ్యపాద్య ఆచమనాదులతో సత్కరించి కందమూల ఫలాదులను వారిముందుంచెను.

శ్లో॥ మయా తు వివిధం వన్యం సంచితం పురుషర్షభ ।
తవార్థే పురుషవ్యాఘ్ర పంపాయాస్తీర సంభవమ్ ॥ ✦

(వా.రా. అరణ్య. 74-17)

(✦ఇచ్చట ఒక విషయమును గుర్తుంచుకొనవలయును. లోకమున చాలామంది శబరి శ్రీరామునకు ఎంగిలిచేసిన పండ్లు తినుట కిచ్చినట్లుగ చెప్పుచుందురు. కాని పై శ్లోకములో నెచ్చటను అట్లు లేదు. గోస్వామి తులసీదాసు కూడా ఎంగిలిపండ్లు శ్రీరాముడు తిన్నట్లుగ ఎచ్చటను వ్రాయలేదు. కనుక ఈ మాట మిథ్యయే.)

' ఓ పురుషోత్తమా! మీకొరకై నేను పంపా సరోవరమునకు సమీపమున నున్న వనమునుండి రకరకముల కందమూల ఫలాదులను సేకరించి యుంచితిని' అనిన శబరిమాత ఆతిథ్యమును గ్రహించిన పిదప శ్రీరామ లక్ష్మణులు సుగ్రీవుని కలియుటకై త్వరత్వరగా పంపానది దాటి ఋష్యమూక పర్వతముపైకి వెళ్ళిరి.

**సుగ్రీవునితో మైత్రి :**

ఏనుగు నడకను పోలిన మందగమనముతో ధనుర్బాణములు, ఖడ్గము, అస్త్రశస్త్రములను ధరించిన శ్రీరామ లక్ష్మణులను చూచి వానరరాజు భయభీతుడై తన మంత్రి హనుమంతుని రహస్యముగ సమాచారమును కనుగొని రమ్మని పంపెను. హనుమంతుడు సంన్యాసి రూపమును ధరించి వారివద్దకు వచ్చి -

మృధుమధురమైన వాక్కులతో - మీరెవరు? ఈ అరణ్యమున కెందుకు వచ్చిరి? జటానారచీర లెందుకు ధరించిరి? తాపస వేషమును ధరించిన మీరు ధనుర్బాణముల నెందుకు ధరించియున్నారని అడిగెను. తన పరిచమును తెలుపుచు నేను ధర్మాత్ముడైన సుగ్రీవుని మంత్రిని ఆయన నన్ను మీవద్దకు పంపెను. నేను ఋష్యమూక పర్వతము నుండి వచ్చితిని. మీతో వారు మైత్రిని కోరుచున్నారనెను -

హనుమంతుని మాటలను విన్న శ్రీరాముడు ప్రసన్నుడై లక్ష్మణునితో -

శ్లో॥ నానృగ్వేద వినీతస్య నా యజుర్వేద ధారిణః ।
నా సామవేద విదుషః శక్యమేవం ప్రభాషితుమ్ ॥
నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధాశ్రుతమ్ ।
బహు వ్యాహరతా తేన న కించిదప శబ్దితమ్ ॥

(వా.రా. కిష్కింద 3-28, 3-29)

ఋగ్ యజు స్సామవేదములలో విద్వాంసుడు కానివాడు ఈవిధముగ భాషణ చేయజాలడు. ఈయన వ్యాకరణమును గురుముఖముద్వారా చదివి యుండుట తథ్యము. ఏలయన యింతసేపు ప్రసంగములో ఈయన నోటినుండి ఒక్క శబ్దముకూడా అశుద్ధము వెలువడలేదు. ఇంతేగాక మాట్లాడుచున్నపుడు ఈయన ముఖము, నేత్రము, లలాటము (నుదురు) నాసలు యితర శరీరావయము లెవ్వియు వికృతము కాలేదు. ఓ లక్ష్మణ! యిటువంటి దూత గల రాజుతో కార్యము నిశ్చయముగ జరుగును. ఇందులో సందేహ మేమియు లేదనెను. (శ్రీరామునిచే యివ్వబడిన ఈ ప్రమాణముండగా వేదవేదాంగ విదుడైన హనుమంతుని కోతియని ఎవరనగలరు? వేద, వ్యాకరణములను చదువు కోతి నెవ్వరైనా యింతవరకూ చూచితిరా? హనుమాన్, సుగ్రీవాదులు తోకలున్న కోతులుకారు. వారు వానరజాతితో సంబంధమును కలిగియుండెడి వారు. అనేక చోట్ల సుగ్రీవాదులకు 'మనుష్య' మరియు 'ఆర్య' అను విశేషణముల ప్రయోగమువలనను వారు కోతులుకారని తెలియుచున్నది. రామాయణములోని కొందరు వ్యక్తులకు ప్రయోగింపబడిన మర్కటము, కపి, హరి మున్నగు శబ్దములను చూచి వారిని కోతులనుకొనుటకు అవకాశమున్నది.

కాని అంతమాత్రమున వారిని కోతులుగ ఎంచుటకు వీలుకాదు. చరకసంహితలో అగ్నివేశ్‌ను వహ్నివేశ్ అని, తులసీదాసు శత్రుఘ్నుని రిపుసూదన్ అని వ్రాసిరి. వాలి సుగ్రీవునితో యుద్ధమునకు వెళ్ళునపుడు తార వాలి కొరకు 'స్వస్త్యయనము' (శుభాశంసనము=శుభకామన) చేసెను. అందువలన హనుమంతుడు మున్నగు వారు కోతులు కారని స్పష్టమగుచున్నది. )

శ్రీరాముడట్లనగానే లక్ష్మణుడు హనుమంతునితో - మేము సుగ్రీవునితో మైత్రికొరకే ఈ పర్వతము నధిరోహించుచున్నాము అనెను అంతట హనుమంతుడు శ్రీరామ లక్ష్మణులను సుగ్రీవునివద్దకు తీసుకువెళ్ళి వారిని పరిచయమొనర్చుచు - ఈ రాజకుమారు లిరువురు మీతో మైత్రిచేయుటకై యిచ్చుటకు వచ్చిరనగా - విన్న సుగ్రీవుడు యిట్లనెను -

**శ్లో॥ రోచతే యది మే సఖ్యం బాహురేష ప్రసారితః ।**
**గృహ్యతాం పాణినా పాణిర్మర్యాదాబధ్యతాం ధ్రువా ॥ (వా.రా. కి. 5-12)**

నాతో స్నేహమొనర్చుట మీకిష్టమున్నచో నాయీ చేతిని మీ చేతితో గ్రహించి స్నేహబంధమును కలుపుడు.

**శ్లో॥ ఏతత్తు వచనం శ్రుత్వా సుగ్రీవేన సుభాషితమ్ ।**
**స ప్రహృష్టమనా హస్తం పీడయామాస పాణినా ॥ (వా.రా. కి. 5-13)**

సుగ్రీవుని ఈ సుందరవచనములను విని శ్రీరాముడు సంతోషముతో అతని హస్తమును గ్రహించెను. (హస్తాలింగనము (Shake hand) పాశ్చాత్య సభ్యత వలన ప్రచలితమైనది కాదు. ఇది భారతీయ సంస్కృతి సభ్యతలకు అంగమే. వేదములలో దీని వర్ణన కలదు -

**అన్యో అన్య మను గృభ్ణాతి (ఋ. 7-103-4)**

ఇరువురు వైదిక విద్వాంసులు పరస్పరము కలుసుకున్నపుడు ప్రసన్నతతో కరచాలనము చేయుచుండిరి.) తరువాత హనుమంతుడు అగ్నిని ప్రజ్వల మొనర్చి యిరువురి మధ్యనుంచగా వారిరువురు దాని చుట్టు ప్రదక్షిణ మొనర్చిరి. ఈవిధముగ రామ సుగ్రీవుల స్నేహము కుదిరిన తదుపరి మిత్రులిరువురు ఒకరికొకరు తమ దుఃఖములను గూర్చి చెప్పుకొనిరి. సీతాపహరణ వృత్తాంతమును విన్న సుగ్రీవుడు వస్త్రమునచుట్టి సీతాదేవి

జారవిడిచిన ఆభూషణములను శ్రీరాముని ముందుంచెను. ఆ ఆభూషణము లను తన గుండెకు హత్తుకొని శ్రీరాముడు రోదింపసాగెను. తదుపరి లక్ష్మణున కిచ్చి చూడుమనెను. వానిని చూచిన లక్ష్మణుడు -

శ్లో॥ నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే -
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్ ॥ ✦

(వా.రా. కి. 6-22)

(✦ ఇదీ, వైదిక సంస్కృతియొక్క గౌరవ ఆదర్శములతో కూడిన మహోన్నత చరిత్ర! 14 సంవత్సరముల వనవాసములో ఎప్పుడూ లక్ష్మణుడు కన్నెత్తి సీతను చూడలేదు.)

నేను సీతాదేవి దండకడియాలు కుండలాదుల నెరుగను. నిత్యము పాదాభివందనము చేయుటవలన కాళ్ళ అందెలు మాత్రము ఎరుగుదు ననెను.

వ్యాకుల మనస్సుతో దుఃఖించుచున్న శ్రీరాముని చూచి సుగ్రీవుడు ధైర్యము చెప్పుచు ఓదార్చుచు -

శ్లో॥ **యే శోకమనువర్తంతే న తేషాం విద్యతే సుఖమ్ ।**
**తేజశ్చ క్షీయతే తేషాం న త్వం శోచితు మర్హసి ॥** (వా.రా.కి. 7-12)

"శోకించుచుండు వారెప్పుడు సుఖముగ నుండజాలరు. వారి తేజస్సు క్షీణించుచుండును. కనుక మీరు శోకింపరాదు." అనిన సుగ్రీవుని మాటలతో శ్రీరాముడు శాంతించెను. మరల సుగ్రీవుని ఆలింగన మొనర్చుకొని, ఓ వానరోత్తమా! నేను నీకు చేయవలసిన పనేమిటో నిస్సంకోచముగ చెప్పమనెను.

శ్లో॥ **అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదాచన ।**
**ఏతత్తే ప్రతిజానామి సత్యేనైవ చ తే శపే ॥** (వా.రా. కి. 7-22)

నేనింతరకు అసత్యము పలుకలేదు. ఇకముందు భవిష్యత్తులో కూడ పలుకను. మీ పనిచేయుటకు నేను ప్రతిజ్ఞ చేయుచున్నాననెను.

**వాలి వధ :**

అంతట సుగ్రీవుడు తన అన్న వాలి తనభార్య 'రుమ'ను అపహరించుట, తన రాజ్యము నపహరించుట వంటి విషయములన్నింటిని అమూలాగ్రముగ

వినిపించెను. రాజధర్మము ననుసరించి వాలిని వధించుట ఉచితమని తలంచి శ్రీరాముడు సుగ్రీవాదులను తీసుకొని కిష్కింధ రాజ్యద్వారము వద్దకు వెళ్ళగా సుగ్రీవుడు యుద్ధము చేయుటకై వాలిని అహ్వానసూచకముగ భయంకర సింహనాదమొనర్చెను. ఆ గర్జనను విన్న వాలి బయటకువచ్చి సుగ్రీవునితో యుద్ధమునకు తలపడెను. సోదరు లిరువురిమధ్య భయంకర యుద్ధము జరిగినది. వాలిచే పరాజయము నొందిన సుగ్రీవుడు శ్రీరాముడు తనకు సహాయపడకుండుటను చూచి ఋష్యమూక పర్వతమునకు పారిపోగా వాలి రాజభవనములోని తన నివాసమునకు వెళ్ళిపోయెను. శ్రీరాముడు లక్ష్మణ హనుమంతులతో ఋష్యమూక పర్వతముపైకెళ్ళెను. వాలిని చంపకపోవుటకు కారణము తెలుపుచు సుగ్రీవునితో నిట్లనెను.

శ్లో॥ అలంకారేణ వేషేణ ప్రమాణేన గతేన చ ।
త్వం చ సుగ్రీవ వాలీ చ సదృశౌ స్థః పరస్పరమ్ ॥ (వా.రా.కి .12-30)

మీ యిరువురి వస్త్రాభరణములు, ఆకారము, నడక అన్ని ఒకేరకముగ నున్నవి. అందువలననే నేను బాణముతో కొట్టలేదు. (శ్రీరాముని భగవంతుని అవతారముగ చెప్పువారొకసారి ఈ మాటలపై ఆలోచింపుడు. భగవంతునికి సుగ్రీవుడెవరో తెలియదా?)

సుగ్రీవుని గుర్తించుటకై శ్రీరాముడు అతని మెడలో ఒక హారమును వేసి మరల యుద్ధమునకై కిష్కింధకు తీసుకువెళ్ళెను. సుగ్రీవుడు మరల వాలిని యుద్ధమునకు పిలిచెను. వాలి మరల యుద్ధమునకు సిద్ధమయ్యెను. ఇరువురు గర్జించుచు భయంకర యుద్ధమును చేయుచుండిరి. సుగ్రీవుడు అలసిపోయి అతనికి సహాయము అవసరమైనపుడు శ్రీరాముడొక ఆగ్నేయాస్త్రమును సంధించి వాలి ఛాతిపై కొట్టగా అతడు నేలకొరిగెను. వెంటనే రామలక్ష్మణు లిరువురు అతనిని సమీపించిరి. వాలి వారిని కఠోర వచనములతో తూలనాడి "నీవొక రాజకుమారుడవు. సంస్కారవంతుడవు. బలవంతుడవు. వ్రతధారివి. రాజున కుండవలసిన గుణములన్నియు నీలోనున్నవి. వేరొకరితో యుద్ధము చేయుచున్న నాపై బాణములను వదలవని నేను తలంచితిని. అందుకే తార వద్దని వారించుచున్నను నేను సుగ్రీవునితో

యుద్ధమునకు తలపడితిని. కాని నీవొక కాషాయ ధర్మధ్వజము నెగుర వేయుచున్న అధర్మాత్ముడవు, పాపివని యిప్పుడర్థమైనదనెను."

శ్లో॥ సతాం వేషధరం పాపం ప్రచ్ఛన్న మివ పావకమ్ ।
నాహం త్వామభి జానామి ధర్మచ్ఛద్మాభి సంవృతమ్ ॥ (వా.రా.కి. 17-22)

నీవేషము మాత్రము సజ్జనునివలె నున్నది. కాని నివురుగప్పిన నిప్పువలె కపట ధర్మానుష్ఠానివి. నేను నీదేశమున గాని, నగరమున గాని ఎటువంటి చెడుపని చేయలేదు. అట్టి నన్నెందుకు చంపితివో నాకర్థమగుట లేదు. ఇట్టి నీచకర్మ నొనర్చిన నీవు సత్పురుషుల ముందు ఏమి సమాధాన మివ్వగలవు? ఓ రాజకుమార! నీవు నాఎదుట నిలిచి నాతో యుద్ధము చేసినచో నిన్ను యమపురి కంపెడివాడను. నా తరువాత ఈ రాజ్యము సుగ్రీవునకు చెందుట సబబేగాని నీవొనర్చిన ఈ అనుచిత కార్యమునకు లోకమున కేమి జవాబు చెప్పెదవని ప్రశించిన వాలితో శ్రీరాముడు ఓ వానర! ధర్మార్థకామములు, లోకవ్యవహారముల నెరుగకయే బాలునివలె నన్ను నిందించుచున్నావు. విను -

శ్లో॥ ఇక్ష్వాకూణామియం భూమిః సశైలవనకాననా ।
తాం పాలయతి ధర్మాత్మా భరతః సత్యవాగృజు ః ॥ (వా.రా. కి. 18-6)

పర్వత వనములతో కూడిన ఈ సమస్త భూమండలము ఇక్ష్వాకు రాజులకు చెందును. సత్యవాది, కపటరహితుడు, సరళ స్వభావముతో ధర్మాత్ముడైన భరతుడు ఈ భూమండలమును పరిపాలించుచున్నాడు. అయన ఆజ్ఞను పాలించుచు మేమీ భూమండలముపై తిరుగుచు ఎవరూ అధర్మ కార్యములను చేయకుండునట్లు చూచుచుందుము.

శ్లో॥ భ్రాతుర్వర్తసి భార్యాయాం త్యక్త్వా ధర్మం సనాతనమ్ ॥
అస్య త్వం ధరమాణస్య సుగ్రీవస్య మహాత్మనః ।
రుమాయాం వర్తసే కామాత్స్నుషాయాం పాపకర్మకృత్ ॥
ఔరసీం భగినీం వాపి భార్యాం వాऽప్యనుజస్య యః ॥
ప్రచరేత నరః కామాత్తస్య దండోవధః స్మృతః ॥
(వా.రా.కి. 18-18, 18-19, 18-22, 18-23)

కామాంధుడవై నీవు ధర్మము నుల్లంఘించితివి. సుగ్రీవుడు జీవించి యుండగనే నీకు పుత్రవధువుతో సమానమైనట్టి ఇతని భార్య 'రుమ'తో నీవు కామాసక్తుడవైతివి. తన సోదరి, తన తమ్ముని పత్నితో కుకర్మనాచరించు వానిని వధించుటే సరియైన దండన యగును. నిన్ను చాటునుండి ఎందులకు చంపితినని యడుగుదువా? విను చెప్పెదను. "నిన్నట్లు చంపినందులకు నాకు దుఃఖము గాని, విచారముగాని లేదు. వేటాడువారు వలపన్నో, కపట వ్యవహారముతోనో, మోసగించో, చాటునుండి గాని, ఎదురగ గాని, పరుగిడుచున్న లేక భయములేకుండ నిలిచియున్న మృగములను పట్టుకొనే తీరుదురు." అనిన శ్రీరాముని మాటలకు వాలి ఎంతో పశ్చాత్తాప పడెను. నిరుత్తరుడై తాను కఠిన వచనములతో నిందించినందులకు శ్రీరాముని క్షమాపణ వేడుకొని శ్రీరాముని కార్యసిద్ధికి తోడ్పడమని సుగ్రీవుని ఆదేశించి తన పాంచ భౌతిక శరీరమును విడిచెను. (కొందరు విమర్శకులు శ్రీరాముడు చెట్టుచాటునుండి వాలిని చంపుట ఆయనకు కళంకముగ చెప్పుచుందురు. కాని రాజనీతి ననుసరించి శ్రీరాముడు చేసినది (సరియైనదే) ఉచితమే. వాలిని చంపుట శ్రీరామున కొక గొప్ప రాజనైతిక విజయము (Political achievement)

వాలి, రావణు లిరువురు మిత్రులు. వారగ్నిసాక్షిగ ఒకరి కొకరు రక్షణ కల్పించుకొని సంధిసూత్రమున బంధింపబడిరి. ఎవరైనా వ్యక్తులు కిష్కింధ మీదుగ రావణునిపై ఆక్రమణజరిపిన వాలి వారి నాపవలయును. అట్లే లంకనుండి వాలిపై ఎవరైనా ఆక్రమణ జరిపిన రావణుడు వాలికి సహాయ పడవలయునని ఇరువురు ప్రతిజ్ఞ చేసిరి. శ్రీరాముడు రావణునితో యుద్ధము చేసిన వాలి తప్పక శ్రీరామునితో యుద్ధము చేయును. అటువంటప్పుడు రావణునితో కక్ష తీర్చుకొనుటకు ముందుగ వాలితోనే యుద్ధ మారంభమగును. కనుక సుగ్రీవునితో స్నేహముచేసి ముందుగనే వాలిని వధించుట మంచిదిగ శ్రీరాముడు తలంచెను.

వాలిని చాటునుండి చంపుటలోకూడ శ్రీరాముని దూరదృష్టి అవగత మగుచున్నది. వాలిని యుద్ధమునకు పిలిచినచో రావణునితో యుద్ధమునకు కావలసిన సేనలో కొంతభాగము ముందుగ ఈ యుద్ధముననే సమాప్తమగును.

కనుక శ్రీరాముడు వాలిని బహిరంగ యుద్ధమునకు పిలువక అతని నొక్కనినే మట్టుపెట్టెను.

సీతాదేవిని వెంటనే వెదకుటవసరము. వాలితో యుద్ధము చేయుటకు ఎంతకాలము పట్టునో యుద్ధములో నెవరిని విజయలక్ష్మి వరించునో కూడ నిశ్చయముగ చెప్పజాలము. ఇన్ని కారణములవలన శ్రీరాముడు రక్తపాతము జరుగకుండ కేవలమొక్క వాలిని చంపి తన మార్గమును సుగమమొనర్చెను. ఇది శ్రీరాముని యుద్ధనీతికొక ఉదాహరణ.

మొదటిసారే శ్రీరాముడు వాలిని చంపలేదు. అతనికి ఆలోచించుకొని సుగ్రీవునితో కలిసియుండుట కవకాశము నొసంగెను. కాని దానిని వాలి అంగీకరింపలేదు. రెండవసారి తన గుర్తును తెలిపి సుగ్రీవుడు తన నాశ్రయించెనని హెచ్చరించిననూ వాలి లెక్కచేయక సుగ్రీవుని చంపుటకు దాడిచేసినపుడు శ్రీరాముడు తన మిత్రుని మరణమునుండి రక్షించుటకై అతనిని వధించెను. కనుక వాలిని చాటునుండి చంపుటలో శ్రీరామున కేదోష మంటదు.

ఆధునిక యుగములో (trenches) గుంతలలో దాగుకొని యుద్ధము చేయుదురు. గోతులలో దాగుకొని ఛల కపటములతో మోసగించి శత్రువులను చంపుట ఉచితమగుచో శ్రీరాముడు వాలిని చంపుట అనుచిత మెట్లగును?

మరొక విషయము - వాలి ఆతతాయి. వశిష్ఠ స్మృతి ననుసరించి ఈ క్రిందివారు ఆతతాయిలు.

**శ్లో॥ అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాప హః ।**
**క్షేత్రదార హరశ్చైవ షడేతే హ్యాతతాయినః ॥** **(వశిష్ఠ స్మృతి 3-19)**

అగ్నితో దహనకాండ నొనర్చువారు, విషమునిచ్చువారు, నిరపరాధులను శస్త్రముతో హత్యగావించువారు. ఇతరుల ధనమును, పొలమును, స్త్రీలను అపహరించువారు ఈ ఆరుగురు ఆతతాయి లనబడుదురు.

అటువంటి ఆతతాయిలను వధించుటకు మహర్షి మనువు ఆదేశము గలదు -

శ్లో॥ గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా బహుశ్రుతమ్ ।
**ఆతతాయినమాయాన్తం హన్యాదేవావిచారయన్॥ (మనుస్మృతి 8-350)**

ఆతతాయి గురువైనను, బాలకుడైనను, వృద్ధుడైనను, విద్వాంసుడైనను బ్రాహ్మణుడైనను, ముందువెనుక ఆలోచింపకయే చంపవలయును.

వాలి సుగ్రీవుని భార్యనపహరించెను. అందువలన అతడు ఆతతాయి. కనుక రామునిచే వధింపబడుట ఉచితమే.

వాలితో ఎదుట నిలబడి యుద్ధము చేయు వ్యక్తిలోని సగము శక్తి వారికి చేరునని కొందరు చెప్పుచుందురు. అందువలన వాలికి ఎదుటనిలిచి యుద్ధము చేయు వ్యక్తిని వాలి అవలీలగ ఓడించుచుండెనని చెప్పుచుందురు. శ్రీరాముని కీ విషయము తెలిసినందున వాలిని చాటునుండి చంపెననుమాట నితాంత మసత్యము. వాల్మీకి రామాయణములో దీనికే ప్రమాణము లేదు.)

వాలికి అంత్యక్రియలు జరిగిన తరువాత సుగ్రీవుడు కిష్కంధ రాజ్య సుఖముల ననుభవింపసాగెను. శ్రీరాముడు లక్ష్మణునితో ప్రస్రవణ పర్వతముపై సీతావిరహము ననుభవించుచుండెను. నాలుగు నెలలు గడచినను రాజభోగములలో మునిగియున్న సుగ్రీవుడు శ్రీరాముని కార్యమును మరచెను. అప్పుడు శ్రీరాముడు లక్ష్మణుని సుగ్రీవుని వద్దకు పంపెను. లక్ష్మణుని చూచిన సుగ్రీవునకు తన తప్పు గుర్తుకు వచ్చినది. అతడు వానర సైన్యమును నలుదిశల సీతాదేవి నన్వేషించుటకై పంపెను.

**హనుమంతుడు సీతాదేవిని కనుగొనుట :**

దక్షిణదిశగా వెళ్ళిన వారిలో హనుమంతుడు, జాంబవంతుడు, నీలుడు, అంగదుడు, మున్నగు ప్రముఖ వానరులు గలరు. ఏలయనగా సీతను రావణుడపహరించెను. కనుక సుగ్రీవుడు విశేషముగ హనుమంతుని ఆదిశగా పంపగా శ్రీరాముడు తన ఉంగరమును కూడ యిచ్చి పంపెను. వారు సముద్రతీరమును చేరిన తరువాత లంక కెవరు వెళ్ళవలయునని ఆలోచింప సాగిరి. చివరకు జాంబవంతుడు హనుమంతుని సాహసమును పొగడుచు ఉత్సాహము కలిగింపగా హనుమంతుడు లంకకు వెళ్ళుటకు సిద్ధపడెను. ఆయన మహేన్ద్రాచల పర్వతముపై నుండి ఎగురుచు లంకవైపు పయనించెను.

(విద్వాంసులు, విమర్శకులు, మేధావులంతా అనేకసార్లు రామాయణములో ప్రక్షిప్తములు చేయబడినట్లంగీకరించిరి. హనుమంతుడు లంకకు సముద్రములో ఈదుచు పోయివుండవచ్చును. లేదా గాలిలో ఎగురుచు పోయియుండ వచ్చును. రామాయణములో రెండు పక్షములకు సంబంధించిన సమాచార మున్నది. ఈదుచు పోయెననుటకు ఈ క్రింది శ్లోకమున్నది. -

శ్లో॥ ఏష పర్వతసంకాశో హనుమాన్మారుతాత్మజః ।
**తితీర్షతి మహావేగః సాగరం మకరాలయమ్ ॥ (వా. రా. సుం. కాం. 1-29)**

పర్వతాకారమును గలిగిన హనుమంతుడెంతో వేగముగ సముద్రమును ఈదసాగెను. శ్లోకములోని 'తితీర్షతి' శబ్దము ఈదెనని స్పష్టము చేయుచున్నది.

ఇదేవిధముగ యితర వర్ణనలు కూడ కలవు. కాని హనుమంతుడు తిరిగి వచ్చినపుడు మాత్రము ఎగిరి వచ్చినట్లుగనే వర్ణనగలదు. ఈదుచు వచ్చినట్లుగ లేదు. వెళ్ళునపుడు కూడా ఆకాశ మార్గములో వెళ్ళినట్లు వర్ణన గలదు. -

**శ్లో॥ ఋషయస్తుష్టువుశ్చైనం ప్లవమానం విహాయసా ॥**
**(వా.రా.సుం. కాం. 1-85)**

ఆకాశ మార్గమున పోవుచున్న హనుమంతుని ఋషులు ప్రశంసించిరి. ఇంకను చూడుడు -

**శ్లో॥ జగామ వాయుమార్గే చ గరుత్మానివ మారుతిః ।**
**హనుమాన్మేఘ జాలాని ప్రకర్షన్మారుతో యథా ॥ (వా.రా. సుం. కాం. 1-178)**

**వాయుపుత్రుడు హనుమంతుడు ఆకాశమార్గమున గరుడపక్షివలె ఎంతో వేగముగ మేఘములను ఛేదించుకొనుచు వెళ్ళుచుండును.**

తిరిగి వచ్చునప్పటి వర్ణనను చూడుము.

శ్లో॥ హనుమాన్మారుతగతిర్మహానౌరివ సాగరమ్ ।
**అపారమపరిశ్రాన్తః పుప్లువే గగనార్ణవమ్ ॥ (వా.రా. సుం. కాం. 57-4)**

సముద్రములోని నౌకవలె హనుమంతుడు వేగముగ పోసాగెను. అపార ఆకాశరూప సాగరములో ఆయన అలసిపోకుండ పోసాగెను. ఈవిధముగ ఎగురుచు తన మిత్రులను చేరినపుడు -

శ్లో॥ నిపపాత మహేంద్రస్య శిఖరే పాదపాకులే। (వా.రా. సుం. కాం. 57-30)

దట్టముగ వృక్షములతో నిండియున్న మహేంద్ర పర్వతము పైకి దూకెను.

హనుమంతుడు ఈదుకొనిపోయినచో ఈదుకొనుచు తిరిగి వచ్చి యుండెడివాడు. కాని ఆకాశమార్గమున తిరిగి వచ్చినట్లుగ వర్ణనకలదు. ఆయన ఈదుచు తిరిగి వచ్చియున్నచో మహేంద్ర పర్వతము పైకి ఎక్కుట దిగుట జరుగదు.

ఇచ్చట మరొక విషయమును స్పష్టపరుపవలయును. అదేమన ఎగిరివెళ్ళుట యనగా ఆయన చేతులు పైకి ఎత్తి పక్షివలె ఎగిరెనని కాదు. 'ప్లవమానం విహాయసా' లేక 'పుప్లవే గగనార్ణవమ్' - అనునవి రామాయణములోని (Idioms) శబ్దముల ప్రయోగశైలి. నేడు కూడా ఎవరైనా గొప్పవ్యక్తి ఆకాశయానము (విమానము)లో ఎక్కడికైనా ప్రయాణము చేసిన సమాచార పత్రికలలో - ' Dr. Radhakrishnan Flew to London' రాధాకృష్ణన్ విమానములో లండన్ వెళ్ళిరి అని ప్రచురింపబడును. కాని ఆంగ్లములో మాత్రము (రాధాకృష్ణన్ లండన్ కు ఎగిరెను) అను ప్రయోగముండును. ఇదేవిధముగ హనుమంతుడు యానముద్వారానే వెళ్ళెను. 'శ్రీ ఎ. ఎన్. మెహతా' కూడా హనుమంతుడు 'Monoplane' (ఒకరే ప్రయాణముచేయు) ఆకాశయానము ద్వారానే లంకకు వెళ్ళెనని వ్రాసిరి.) శ్రీ హనుమంతుడు ఆకాశమార్గమున లంకవైపు వెళ్ళుట చూచిన వానరసమూహము హర్షధ్వానము చేయుచు ఆయన రాకకై తిరిగి చూడసాగిరి. హనుమంతుడు సముద్రమును లంఘించి లంక సౌందర్యమును చూచి ఆనందింపసాగెను.

లంకకు నలువైపులా కందకములు త్రవ్వబడి కందకములు దాటగానే నగరమునకు చుట్టూ కోటగోడ కట్టబడియున్నది. లోపల ఎత్తైన భవనములుండి వానిపై ధ్వజములు - పతాకములు ఎగురుచున్నవి.

బయటి కోటపై మధ్యమధ్యలో శతఘ్నులు (ఫిరంగులు) గలవు. అంత సురక్షితముగ నున్న లంకనుచూచిన హనుమంతుడు ఇంత కఠినమైన దుర్గమును శ్రీరాముడాక్రమణచేసి ఏమి చేయగలుగునని ఆలోచింపసాగెను.

చీకటి పడుచుండగా ఆయన లంకనుచేరి సీతాదేవిని వెదుకసాగెను. రాజభవనములలో ఎక్కడా సీతాదేవి కనబడనందున ఆయన అశోకవనమునకు చేరుకొనెను. అచ్చట ఒక జలాశయము (చెరువు)ను చూచి ఆయన -

**శ్లో॥ సంధ్యాకాలమనాః శ్యామా ధృవమేష్యతి జానకీ ।**
**నదీంచేమాం శుభజలాం సంధ్యార్థే వరవర్ణినీ ॥** (వా.రా. సుం. కాం. 14-49)

ప్రాతః సాయంకాల సమయములలో సంధ్యనొనర్చు సీతాదేవి ఈ నదిలోని స్వచ్ఛజలములో స్నానముచేసి సంధ్యచేయుటకై తప్పక వచ్చునని నిశ్చయించుకొని ఒక వృక్షముపైకెక్కి కనబడకుండ ఆకులలో దాగుకొనెను. మరునాడు ఉదయమున రావణుడు అచ్చటికి వచ్చి సీతాదేవికి ఆశచూపుచు-

**శ్లో॥ భుంక్ష్వ భోగాన్యథాకామం పిబ భీరు రమస్వచ ॥ ✦**

(వా.రా. సుం. కాం. 20-23)

(✦ Eat, Drink and be merry అనునదీ శ్లోకమునకు అనువాదమే)

ఓ పిరికిదానా! సుఖముగ భోజనపదార్థము లన్నింటిని అనుభవింపుము. మద్యపానము చేసి నాతో రమింపుము. అనిన రావణునితో సీతాదేవి -

**శ్లో॥ తృణమన్తరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా ।**
**నివర్తయ మనో మత్తః స్వజనే క్రియతాం మనః ॥**

(వా.రా. సుం. కాం. 21-3)

తనకు రావణునకు మధ్యలో గడ్డిపోచనుంచి రావణునిచి ఓ రావణ! నీమనస్సు నాపైనుండి మరల్చి నీ భార్యపై నుంచుమనెను. రావణుడు సీతాదేవి నెన్నో విధములుగ బెదిరించి చివరకు తన రాజభవనమున కెళ్ళిపోయెను. రాక్షసులు సీతాదేవిని భయపెట్టుచు విసిగించుచుండిరి.

సీతాదేవి తనకన్నివైపులనుండి ఆపదకలిగినదని భావించి -

**శ్లో॥ ధిగస్తు ఖలు మానుష్యం ధిగస్తు పరవశ్యతామ్ ।**

(వా.రా.సుం.కాం 25-20)

మానవజన్మ హీనమైనది. పరాధీనత హీనము. అని చింతించుచున్న సీతాదేవికి ధైర్యము చెప్పుటకు నిశ్చయించుకొని హనుమంతుడు మానవునివలె స్పష్టశుద్ధవాణితో శ్రీరాముని గుణములను గానముచేయనారంభించెను.

సీతాదేవి ఆ గానమును విని ఆశ్చర్యముతో యిటునటు చూడసాగినది. తదుపరి హే రామ! హే లక్ష్మణ! అనుచు విలపింపసాగినది. హనుమంతుడు సీతాదేవి ఎదుట నిలచి ఓ దేవి! భయపడకు. నేను శ్రీరాముని బంటును. నాపేరు హనుమంతుడు. మీకు నమ్మకము కొరకు-

శ్లో॥ **సువర్ణస్య సువర్ణస్య సువర్ణస్య చ మైథిలి ।**
**ప్రేషితం రామచంద్రేణ సువర్ణస్యాంగులీయకమ్ ॥ ✦**

(హనుమన్నాటకము 6-15)

(✦సంస్కృతభాష సౌందర్య మీవిధముగ నుండును)

ఓ మైథిలి! సుందర వర్ణముగల శ్రీరాముడు, సుందరవర్ణము= రామనామంకిత సువర్ణ=పదిమాషల ఈ స్వర్ణ (అంగుళీకమును) ఉంగరము మీకొరకు పంపెను అనెను. ఉంగరమును చూచిన సీతాదేవికి విశ్వాసము కలిగినది. వెంటనే ఆమె రామలక్ష్మణులను గూర్చి అడిగినది. హనుమంతుడు సీతాపహరణము నుండి సుగ్రీవ మైత్రి వరకు జరిగిన వృత్తాంతమునంతను వినిపించి లంకపై వెంటనే ఆక్రమణ జరుపుటకు వాగ్దానము చేసి శ్రీరామునకు చూపుటకై ఆమె చూడామణిని గుర్తుగ తీసుకొని తిరుగుముఖమును పట్టెను.

హనుమంతున కప్పుడు బాగుగా ఆకలి వేయుచున్నందున లంకనుండి తిరిగి వెళ్ళుటకు ముందుగ రాక్షసులచే రక్షింపబడుచున్న ఒక తోటను సమీపించి దానిలోని ఫలములను తినుచు చెట్లను విరుచుచుండెను. రాక్షసులు కొందరు అడ్డురాగా వారిని యమపురికంపెను. రావణుడు తనపుత్రుడు అక్షయకుమారుని పంపగా అతనిని కూడ చంపెను. చివరకు మేఘనాథుడు హనుమంతుని బ్రహ్మాపాశముతో బంధించి రావణుని సభకు తీసుకొనిపోయెను. రావణుడు హనుమంతుని వధించుట కాజ్ఞాపించగా దూతను వధింపరాదని విభీషణుడు అడ్డుతగిలెను. అప్పుడు రావణుడు -

శ్లో॥ **కపీనాం కిల లాంగూలమిష్టం భవతి భూషణమ్ ।**

(వా.రా. సుం. కాం. 53-3)

వానరులకు తోక అత్యంత ప్రియమైన అభరణము. వీని తోకను కాల్చుడనెను. (హనుమంతుడు మున్నగువారు వానరులు కాదని మేము

ముందే చెప్పియుంటిమి. ఈ విషయము బాగుగా తెలసుకొనుటకై ఆచార్య క్షితిమోహన్‌సేన్, ఎం.ఏ. గారిచే రచింపబడిన 'భారతదేశములో జాతి భేదము' అను ప్రసిద్ధ పుస్తకమునుండి వ్రాయబడిన ఈ విషయము ఎంతో ఉపయోగ కరమైనది.

ప్రాచీన ఆర్యులు తమ పరిచయమును ఏదైనా అన్యప్రాణి లేక వృక్షలతాదుల పేర్లతో యిచ్చుచుండిరి. అతి ప్రాచీనకాలము నుండియు వివిధ దేశములలో ఒక విశేషచిహ్నము లేక లాంఛనముతో పరిచయమొనర్చు పద్ధతి (అనవాయితీ) కనబడుచున్నది. సాధారణముగ ఈ చిహ్నము ఏదైనా జంతువునకు చెందినదిగాని, వృక్షలతలకు లేక పుష్పమునకు చెందినది గానియై యుండును. గుర్తు రూపములో వాడబడు ఆ వస్తువు ఆజాతికి చెందినవారందరి శ్రద్ధ సన్మానములకు పాత్రమైనదిగ నుండెడిది. ఆంగ్లములో దీనిని (Totem) టోటమ్ అందురు. బాల్యమున వానరులు, ఎలుగుబంట్లు మనుష్యులుగ వ్యవహరించుట చూచి చాలా ఆశ్చర్యముగ నుండెడిది. పెరిగి పెద్దయిన తరువాత ఇప్పటికీ తమను వానరులు, ఎలుగుబంట్లు వంశములకు చెందినవారుగ చెప్పుకొను వారీ దేశములో నున్నట్లు తెలిసినది. ఈ వ్యవహారమంతా టోటెమ్‌కు చెందినదని తరువాత తెలిసినది.

(భారతదేశమున జాతి భేదము 105వ పేజి)

ఈ విషయముపై డా॥ శాంతికుమార్ నానూరాం వ్యాస్ మంచి విషయములను సేకరించిరి. విశేషించి తోకనుగూర్చి వర్ణన హనుమంతుని లంకాదహన సందర్భముగనే అధికముగ చేయబడినది. వాలి, సుగ్రీవుడు, అంగదుడు మరియు వానరస్త్రీలకు తోకలున్నట్లుగ విశేషమైన ప్రమాణమేదియు దొరుకదు. పరిశోధకులు చరిత్రలో తోకగల వ్యక్తులను జాతులను వెదకి తెలుసుకొనిరి. బెంగాలుకు చెందిన కవి మాతృగుప్తను హనుమంతుని అవతారముగ నెంచుచుండిరి. ఆయన తోక పెట్టుకొనుచుండిరి. (దినేష్ చంద్రసేన్ - బెంగాల్ రామాయణము, పేజీ 52) భారతదేశము నందలి ఒక రాజకుటుంబములో రాజ్యాభిషేక సమయమున తోకను ధరించు ఆనవాయితీ ఉండెడిది. శ్రీ వినాయక దామోదర్ సావర్కర్ అండమాన్ దీవులలోని

కారాగారములో నున్నపుడు రామాయణముపై రచించిన సంస్కరణములో - అద్వీపములో తోకపెట్టుకొను ఒక ఆదిమవాసుల జాతి ఉండెడిదని వ్రాసిరి. (మహారాష్ట్ర భాషలో రచించిన - రామాయణ సమాలోచన) విశాఖపట్నమునకు చెందిన శబరులు తోకను అభరణముగ ధరించుచుందురు. (జి. రామదాసు) (రామాయణ కాలమునాటి సమాజము పేజి. 72)

ఈ రచనలవలన వానర జాతులకు విశేషచిహ్నము కోతియని స్పష్టమగుచున్నది. వారి పేర్లమీదనే వారు తమ పేర్లను కూడా నుంచిరి. కోతులకు అన్నిటికంటె తమ తోక అత్యంత ప్రియమైనది. వానర జాతికి చెందిన మనుష్యులు, తయారుచేసిన తోకను ధరించుచుండిరని అది వారికి గెంతుటకు ఎగురుటకు సహాయ పడుచుండెడిదనుట కిదే ఆధారము. ఈతోకకు వారు చాలా గౌరవ మిచ్చుచుండిరి. దాని కవమానము జరిగిన జాతి కవమానము జరిగినట్లుగ భావించుచుండిరి. రావణుడు అతోకకు నిప్పంటింపుడని ఆజ్ఞ యిచ్చెను. )

రావణుని ఆజ్ఞానుసారము హనుమంతుని తోకకు దూదిని చుట్టి నిప్పుపెట్టిరి. కాని తోక వేరగుటవలన ఆయనకేమి కష్టము కలుగలేదు. దానితో నతడు లంకాపట్టణమున కంతకు నిప్పంటించెను. మరొకసారి సీతాదేవిని కలసి ఆమెకు అభయము నొసంగి ఆయన వాయుయానములో ఎగిరి మహేంద్ర పర్వతమున నున్న తన మిత్రులను కలుసుకొనెను. హనుమంతుని చూచి, సీతాదేవి వార్త విన్న వానరులు ఆనందోత్సాహములతో ఉప్పొంగిరి. సీతాదేవి జాడ తెలుసుకున్న సంతోషమున సుగ్రీవునకు యిష్టమైన మధువనములో మధువును త్రాగి రసభరిత ఫలములను భుజించి శ్రీరాముని కలియుటకై బయలుదేరిరి. హనుమంతుడు సంపూర్ణ సమాచారమును తెలిపి సీతాదేవిని కలిసినట్లు గుర్తుగ మహారాణి సీతాదేవి పంపిన చూడామణిని శ్రీరాముని చేతిలో నుంచెను. ఆ చూడామణిని గుర్తించి హృదయమునకు హత్తుకొని శ్రీరాముడు విలపింపసాగెను. కొంతసేపటికి ధైర్యమును తెచ్చుకొని హనుమంతునకు ధన్యవాదములు తెలిపి లంకపై ఆక్రమణకు సన్నద్ధమై జన-బలముతో లంకవైపుగ బయలుదేరెను.

నీలుడు, గజ, గవయ, గవాక్ష, మహావీర, ఋషభ మరియు గన్ధమాదనులు వానరులను వెంటనిడుకొని మార్గమును వెదకుచు ముందు నడుచుచుండిరి. శ్రీరామలక్ష్మణులు మహావీరులైన హనుమంతుని అంగదుల భుజములపై కూర్చొని సేనకు మధ్యలో వెళ్ళుచుండిరి. కొందరు వానరవీరులు కుడి - ఎడమ వెనుకనుండి సైన్యమును రక్షించుచు నడచుచుండిరి. కొందరు సేనలను ఉత్సాహపరచుచు పోవుచుండిరి. ఋక్ష వానర ఎలుగుబంట్లతో కూడిన సైన్యము సంతోషముతో వాయువేగముతో పోవుచు చివరకు సముద్ర తీరమును చేరిరి. సైన్యమునంతా తీరమున నిలిపి సముద్రమును దాటుటకు ఉపాయము నాలోచించుచుండిరి.

**విభీషణుడు శరణు వేడుట :**

లంకలో హనుమంతుడు చేసిన గందరగోళ స్థితిని చూచి రావణుడు విచారముతో లంకను రక్షించు ఉపాయమునుగూర్చి ఆలోచింపసాగెను. ఈసమస్యపై సభలో రెండుపక్షము లేర్పడినవి. ప్రహస్తుడు, నికుంభుడు, మహోదరుడు, ధూమ్రాక్షుడు, మేఘనాథుడు మున్నగు రాక్షసులు యుద్ధము చేయు పక్షమున నుండిరి. కాని విభీషణుడు యుద్ధమువలన జరుగు రక్తపాతమునకు విరోధించుచుండెను. సీతాదేవిని శ్రీరామున కప్పగించి ఆయనతో సంధి చేసుకొనుమని ఆయన రావణునకు సలహానిచ్చెను. కాని రావణున కది కటువుగ తోచినది. అతడు తమ్ముని దూషణ, చీత్కారములతో అవమానించెను. రావణునితో అవమానము నొందిన విభీషణుడు లక్ష్మణునితో కూడియున్న శ్రీరామునివద్దకు వచ్చెను. అచ్చట సుగ్రీవాది యితర వానర యుద్ధవీరులను చూచి విభీషణుడు ఉచ్చస్వరముతో (బిగ్గరగా) నేను రాక్షసరాజు రావణుని చిన తమ్ముడను. నాపేరు విభీషణుడు. నేననేక తర్కయుక్తులతో సీతాదేవిని సగౌరవముగా శ్రీరామున కప్పగింపమని మా అన్నకు సలహానిచ్చితిని. కాని నామాటల నతడు పెడచెవిని పెట్టెను. అతడు నన్నగౌరవపరచి కఠోరముగ దూషించెను. నేను నా భార్యాపిల్లల నచ్చటనే విడిచి శ్రీరాముని శరణువేడుకొనుటకై వచ్చితిని. శ్రీరామున కీవిషయమును తెలుపుడనెను.

విభీషణునకు ఆశ్రయము యివ్వవలయునా? యివ్వరాదా యను

విషయమున కూడా శ్రీరాముని దళములో రెండుపక్షము లేర్పడినవి. వనరాజు సుగ్రీవుడు అంగదుడు జాంబవంతుడు మరియు మయందాదులు విభీషణునకు ఆశ్రయమిచ్చుటకు వ్యతిరేకతను చూపిరి. కాని హనుమంతుడు విభీషణుని తమపక్షమున చేర్చుకొనుటకు మాటిచ్చెను. ఇరు పక్షముల అభిప్రాయములను విన్న శ్రీరాము డిట్లనెను -

శ్లో॥ **సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ ॥**
**(వా.రా. యు. 18-34)**

'ఎవరైనా ఒక్కసారైనా నా శరణువేడి నేను నీవాడను అనిన నేనతనికి సర్వ ప్రాణులనుండి భయములేకుండ చేయుదును. ఇది నా వ్రతము' అని ఓ కపి శ్రేష్ఠ! నీవు విభీషణుని తీసుకొని రమ్ము. నే నతని కభయము నొసంగితి ననెను. విభీషణుడు శ్రీరామునివద్దకు రాగా అతనిని హృదయమునకు హత్తుకొనెను.

శ్లో॥ **అబ్రవీల్లక్ష్మణం ప్రీతః సముద్రాజ్జలమానయ ।**
**తేన చేమం మహాప్రాజ్ఞ మభిషించ విభీషణం ॥ (వా.రా. యు. 19-25)**

సముద్రజలము తెచ్చి దానితో విభీషణుని రాక్షసరాజ్యమునకు రాజుగ అభిషేకము గావింపుమని లక్ష్మణుని ఆదేశింపగా వెంటనే లక్ష్మణుడు విభీషణునకు రాజ్యాభిషేకము చేసెను. విభీషణుడు లంకేశ్వరుడయ్యెను. సుగ్రీవుడు ఏకాంత సమయమున శ్రీరామునితో - ఇదేవిధముగ రావణుడును మిమ్ములను శరణుకోరిన ఏమగును? లంకారాజ్యమునాయన కివ్వరా?" అనెను. శ్రీరాముడు చిరునవ్వుతో లంక విభీషణునకే చెందును. రావణుడు వచ్చినచో అవధరాజ్యము సిద్ధముగ నున్నదనెను. శ్రీరాముని శరణాగాత వాత్సల్యము ఈవిధముగ నుండును.

**సేతువు (వారధిని) నిర్మించుట :**

సముద్రమును దాటుటకై ఆలోచన కొనసాగుచుండగా విభీషణుడు సముద్రముపై వారధిని నిర్మింపకుండా దాటుట అసంభవమనగా శ్రీరాముడు దాని కంగీకరించి యిట్లనెను -

శ్లో॥ విభీషణస్య మంత్రోఽయం మమ లక్ష్మణ రోచతే ।
అబద్ధ్వా సాగరే సేతుం లంకాం నాసాదితుం శక్యా ॥

(వా.రా. యు. 19-36)

'లక్ష్మణ! విభీషణుని ఈ ఆలోచన నాకూ యిష్టమే. సముద్రముపై వంతెనను నిర్మింపకుండా లంకను జయించుట అసంభవము'. [ ఈ విషయమున క్రింది వివరణ తెలుసుకొనదగినది :

It (CEYLON) is seperated from India on the North-West by the Gulf of Manar, but nearly connected with it by the Manar and Rameshwaram Islands and the coral reef called Adam's Bridge. There is no Channel across the reef deep enough for a large steamer to pass and surveys have been made for a projected railway to Connect India and Ceylon 35 miles of which would be on the Island, 22 miles on the reef and only one mile across the shallow Channels.

(The International Geography by Seventy Authors P. 504)

లంకనుండి భారతదేశము వాయవ్యముగ మన్నారు శాఖద్వారా వేరు చేయబడినది. మన్నారు మరియు రామేశ్వరదీవులు, పీఠభూములకు మధ్య ప్రాచీన వంతెనగా పిలువబడెడి వంతెన ఉన్నందున భారతదేశము లంకతో కలిసియుండెడిది. ఈ దీవులమధ్య పెద్ద ఓడలు వెళ్ళగలుగు నంతటి జలము ఎప్పుడును లేకుండెను. భారతదేశమును లంకతో రైలుమార్గము ద్వారా కలుపుటకు ఆంగ్లేయులు సర్వేజరిపి 35 మైళ్ళు రైలుమార్గము మన్నారు, రామేశ్వర దీవుల మీదగాను, 22 మైళ్ళురైలు మార్గము ముంగావలీ పీఠభూముల మీదుగాను, చాలా తక్కువ జలము గల మన్నారు శాఖ మీదుగా కేలము ఒక మైలు రైలుమార్గము అన్నీ కలిసి 58 మైళ్ళు పొడవు రైల్వేలైను వేయుటకు ప్రణాళికను సిద్ధము చేసిరి.

నేడీ భూభాగముపై రైల్వేలు మార్గమును వేయుటకు ప్రణాళికలు తయారుచేయుచున్నపుడు ఆనాడు శ్రీరాముడు వారధి నిర్మించెననుట

అసంభవమనుటకు వీలులేదు.

రెండవ ప్రపంచ యుద్ధములో కూడ జపానువారు మలేసియా నుండి సింగపూరు వరకు స్వల్పకాలములోనే ఒక వంతెనను నిర్మించి వెనుక నుండి ఆంగ్లేయులపై దాడిజరిపి వారి నాశ్చర్యచకితులను గావించిరి.

లంకను వందయోజనముల దూరమనుట కవియొక్క కావ్యమును వర్ణించు శైలి మాత్రమే. లంకాతీరమును ప్రవేశించిన శ్రీరాముడు సముద్ర (అలలు) కెరటాలు తీరమును తాకుటచూచి యిట్లనెను -

**శ్లో॥ అతః పరమతీరోऽయం సాగరః సరితాం పతిః ।**

(వా.రా. యు. 4-101)

' ఈ విశాల సాగరపు ఒడ్డు కనబడుటయే లేదు.' ఇంతటి విశాల సముద్రమును దృష్టిలో నిడుకొనియే మహర్షి వాల్మీకి వంద యోజనములని వ్రాసిరి. శతమనగా అపరిమిత మని కూడ అర్థము. 'మహేచన త్వా' (ఋ. 8-1-5) అను ఋగ్వేద మంత్ర వ్యాఖ్యానములో సాయణాచార్యుడు శతమనగా అపరిమితమని వ్రాసెను. అందువలన ఇచ్చట శతయోజనములనగా 500 మైళ్ళు గాక అపరిమితమైన - విస్తీర్ణమైన సముద్రమని భావము.

లంకనుగూర్చి కూడ యిచ్చట ప్రసంగవశమున కొంత చెప్పుటవసరము. లంకయొక్క భౌగోళిక స్వరూపమును గూర్చి అనేక అభిప్రాయములు గలవు. కొందరు నేటి లంకను రావణుని కాలము నాటి లంకగ అంగీకరింపరు. ఈ విషయములో క్రీ.సం. 1948 సం॥లో జరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్సును ప్రారంభించుచు శ్రీమాధవ శ్రీహరి అణే మహోదయుడు చేసిన భాషణలో లంకకు సంబంధించిన కొన్ని ముఖ్య అంశములు క్రింది యివ్వబడినవి. -

రామాయణములోని సుందరకాండ, లంకాకాండములలో వర్ణింపబడిన లంక నేటి లంకను పోలియున్నది.

సీలోన్‌కు పట్టణమైన ఉరువేల్ రామాయణములోని సువేల్ బహుశః ఒక్కటే యైయుండవచ్చును. దీనికి ఉత్తరమున మూడు ఎత్తైన పర్వతము లున్నవి. వీనినే రామాయణములో త్రికూట పర్వతమనిరి. లంక పట్టణము త్రికూట పర్వతశిఖరముపై నున్నదనుట సత్యము. బందర్‌బేలా, తోతాపల్లా,

కనిగల్‌పోతా మరియు ఆదమ్ - ఈమూడు శిఖరములు ఒకేచోట కలిసియున్నవి.

న్యూరేలియాకు ఆరుమైళ్ళ దూరములో నేడు 'హెగేల్ గార్డెన్' అని పిలువబడుచున్న అతిసుందర ఉద్యానవనము గలదు. పర్వత వాసులు మరియు న్యూరేలియా నివాసులు దీనిని 'అశోకవన' మందురు. ఈ ప్రాంతమంతా ఎర్రని పూలతో నిండిన అశోక వృక్షములతో నిండి యున్నది.

న్యూరేలియాకు నాలుగుమైళ్ళ దూరములో 'సీతా ఎలియా' ఉన్నది. అచ్చట పర్వతముపైనుండి ప్రవహించు ఒకధారను అచ్చటి ప్రజలు 'సీతధార' యని పిలుతురు. లంకలో బంధింపబడినపుడు సీతాదేవి యిచ్చటనే యుండెడిది. ఒక హిందూ స్త్రీ అచ్చట ఒక మందిరమును నిర్మింపజేసి సీతారామ లక్ష్మణుల విగ్రహములను స్థాపించెను. ఆ విగ్రహము లామెకు అచ్చటనే లభించినవి.

స్వర్గీయ సర్. పి. రామనాథమ్ గారు నమన్‌కూల్ పర్వతమును గూర్చి విశేష పరిశోధనలు జరిపి రామాయణ కాలమునాటి 'హనుమాన్ కూల్ పర్వతమే ఈ 'నమనకూల్' పర్వతమని నిర్ణయించిరి. ఈ పర్వత శ్రేణులలోనే హనుమంతుడు డేరావేసెను. ఇచ్చటనే 'రావణ పర్వతముగ' పిలువబడుచున్న 'ఇలా' పర్వతము గలదు.

అవిసావేలాకు సమీపమున సీతావకా ఉన్నది. సీతావకా అనగా సీతయొక్క తెగిన శిరస్సని అర్థము.

సీత శిరస్సును ఖండించి మేఘనాథు డిచ్చటనే యుంచెను. ఇచ్చటనే 'కల్యాణీ గంగా' యను ఒక సేలయేరు పారుచున్నది.

కల్యాణీకి దగ్గరలోనే విహారములో సింహాసనములపై కూర్చొనియున్న విభీషణుని విగ్రహము స్థాపింపబడి యున్నది. ఈ విగ్రహము నందరూ పూజింతురు.

రావణుడు పులస్త్య వంశజుడు. లంకలోని పులియనఖా నగరమునకు ప్రాచీన గ్రంథములలో పులస్త్యనగరమని పేరు.

లంకకు ఆగ్నేయతీరములో హమవనతోతాయను పేరుగల పోతాశ్రయ మున్నది. దీనినే జనులు హనుమాన్ తోతాకు మారుపేరుగ భావింతురు.

గుంద్రని పోతాశ్రయమునకు నాలుగుమైళ్ళ దూరమున సముద్రములో సంజీవి మలై (పర్వతము) లేక మారుతీమలై అని నేడు పిలువబడుచున్న ఒక పర్వతము గలదు. లక్ష్మణుని రక్షించుటకై తెచ్చిన సంజీవనీ మూలికలో మిగిలిన భాగము అచ్చటనే విడిచివేయబడినదని చెప్పుచుందురు. ఇప్పటికీ ఆ పర్వతముపై విలువైన ఓషధులు దొరకునని ఎంతోదూరమునుండి వైద్యులు అచ్చటకు ఓషధులకొరకై వచ్చుచుందురు.

అచ్చటి గ్రామవాసులు రామాయణ కథను చెప్పుచుందురు. కంబూకగం నది ఒడ్డుననున్న ఒక స్థలమునకు 'హోమగ్రామ' మని పేరు. ఇంద్రజిత్ యిచ్చటనే యజ్ఞమును చేయుచుండెడివాడని చెప్పుచుందురు.

లంకావాసులు రామాయణమును శ్రద్ధాభావముతో చూచుచుందురు. లంకాకాండము యొక్క టీకాకూడ సింహళుల భాషలో నున్నది.

(ఈపై ప్రమాణముల వలన) నేటి లంకే రామాయణ కాలము నాటి లంకారాజ్యమనుటలో నెట్టి సందేహముండదు.(భారతీయ ప్రతీక విద్యా - డా. జనార్ధన మిశ్రా. పేజీలు 140-141) ]

వానరులంతా ఈ సలహా నంగీకరించిరి. అప్పుడు విశ్వకర్మపుత్రుడు వారధిని నిర్మించు టారంభించెను. ఆయనకు సహాయము చేయుటకు

**శ్లో॥ హస్తిమాత్రాన్ మహాకాయాః పాషాణాంశ్చ మహాబలాః ।**
**పర్వతాంశ్చ సముత్పాట్య యంత్రైః పరివహన్తి చ ॥ (వా.రా. యు. 22-59)**

మహాకాయుడు, మహాబలి వానరయోధులు ఏనుగు ఆకారములో నున్నట్టి పెద్ద పెద్ద బండరాళ్ళను యంత్రములతో పర్వతముల నుండి తీసుకొనివచ్చుచు నలుని ఆదేశప్రకారము వానిని సముద్రములో వేయసాగిరి. 5 రోజుల కఠోర పరిశ్రమతో 58 మైళ్ళ పొడవుగల వంతెనను తయారుచేసి శ్రీరాముని సంపూర్ణసేన ఈ వంతెనమీదుగా లంకానగరమును చేరి ఆక్రమణ జరుపుటకు ఆలోచనలు జరుపసాగిరి.

అంగద రాయభారము :

లంకకు చేరిన తరువాత శ్రీరాముడు సైన్యమునంతనూ నాలుగు భాగములుగ విభజించెను. ఉత్తర ద్వారమున లక్ష్మణునితో శ్రీరాము డుండెను.

నీలుడు తూర్పు ద్వారమున, అంగదుడు దక్షిణ ద్వారమున, హనుమంతుడు పశ్చిమ ద్వారమున కాపలా కాయుచుండిరి. ఈవిధముగా నలుద్వారములలో సైన్యమును కాపలాఉంచి శ్రీరాముడు అంగదుని ద్వారా రావణునకీ క్రింది రాయభారమును పంపెను.

శ్లో॥ న చేచ్ఛరణమభ్యేషి మాముపాదయ మైథిలీమ్ ।
ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠః సంప్రాప్తోఽయం విభీషణః ॥
లంకైశ్వర్యం ధ్రువం శ్రీమానయం ప్రాప్నోత్యకంటకమ్ ॥

(వా.రా.యు. 41-67, 68)

' ఓ రావణ! నీవు నన్ను శరణువేడుకొని సీతాదేవిని నాకప్పగింపనిచో నన్ను శరణుకోరిన ధర్మాత్ముడు, రాక్షస - శ్రేష్ఠుడైన విభీషణుడు లంకకు రాజై సకల ఐశ్వర్యములను నిరాటంకముగ పొందును.'

రావణుని సభలో ప్రవేశించిన అంగదుడు - నేను వాలి పుత్రుడను, నాపేరు అంగదుడు. నేను శ్రీరామచంద్రుని రాయభారిని. "గౌరవముగ సీతాదేవిని నాకప్పగించు. లేకున్నచో బంధుజనులతో సహా నిన్ను యమపురి కంపెదను" అని శ్రీరాముడు మీకు సందేశము నంపెను. అనగా రావణుడతనిని పట్టుకొని చంపుడని ఆజ్ఞాపించెను. నలుగురు భయంకర రాక్షసులు అంగదుని పట్టుకొనిరి. అంగదు డొక గంతుతో వారిని నేలపై పడవేసి సింహగర్జన చేయుచు రాముని దళమునకు వచ్చి చేరెను. (అంగదుడు నేలపై తన పాదము నుంచగా రాక్షసులెంత ప్రయత్నించినను అతని పాదమును కదుపలేక పోయిరను మాట సంపూర్ణ వాల్మీకి రామాయణములో ఎచ్చటను లేదు.)

**యుద్ధమును ప్రకటించుట :**

శ్రీరాముడు యుద్ధమును ప్రకటింపగానే వానరులు భయంకరమైన సింహనాదముతో లంకలోని కోటగోడలు ద్వారములు, ఉద్యానవనములను నాశనమొనర్పసాగిరి. నలువైపులనుండి వారు లంక నాక్రమణ గావించి సుగ్రీవునకు జయజయ నినాదములు చేయసాగిరి.

లంకలో రావణుడుకూడా యుద్ధమున కాజ్ఞయివ్వగానే రాక్షసులు గర్జించుచు యుద్ధమునకు తలపడగానే యిరు పక్షముల మధ్య భయంకర

మైన యుద్ధము జరిగి వేలాది రాక్షసులు చనిపోయిరి. రాక్షస వానరులమధ్య జరిగిన యుద్ధములో రక్తము నదులై పారినది. భూమి ఎర్రబడినది. తదుపరి ప్రముఖ వానర - రాక్షసవీరుల మధ్య ద్వంద్వ యుద్ధము జరిగినది. అంగదుడు- ఇంద్రజిత్తు; హనుమంతుడు - జంబుమాలి; సుగ్రీవుడు - ప్రఘసేనుడు; లక్ష్మణుడు - విరూపాక్షుడు; సుషేణుడు - విద్యున్మాలి ఇట్లు ఒకరితో నొకరు యుద్ధమునకు తలపడి వానరవీరులు రాక్షసవీరులను యమపురి కంపిరి.

రాత్రి అయినను యుద్ధమాగలేదు. యుద్ధము తీవ్రరూపమును దాల్చి అనేకమంది వీరులు మరణించిరి. అంగదుడు ఇంద్రజిత్తు సారథిని గుఱ్ఱములను చంపెను. ఇంద్రజిత్తు తన పరాజయమునకు సిగ్గుచెంది చాటునుండి బాణములను వేయుచు రామలక్ష్మణుల నిరువురను నాగాస్త్రముతో బంధించి విజయ ఘోష మ్రోగించగా లంకానగరమున ఆనందోత్సాహములు మిన్ను ముట్టెను.

నాగాస్త్రముచే పాశబద్ధుడైనను శ్రీరామచంద్రుడు చేతనముతోనే నుండెను. కాని లక్ష్మణుని దురవస్థను చూచి దుఃఖించుచు ఆయన -

శ్లో॥ **కిన్ను మే సీతయా కార్యం కిం కార్యం జీవితేన వా ।**
**శయానం యోఽద్య పశ్యామి భ్రాతరం యుధి నిర్జితమ్ ॥**
**శక్యా సీతా సమా నారీ మర్త్యలోకే విచిన్వతా ।**
**న లక్ష్మణసమో భ్రాతా సచివః సాంపరాయికః ॥**

**(వా.రా.యు. 49-5, 6)**

నా సోదరుడు యుద్ధభూమిలో పరాజితుడై కదలలేని స్థితిలో పడియుండగా సీతను చెరవిడిపించి తీసుకొని వెళ్ళిగాని, నేను జీవించి యుండిగాని ఏమి ప్రయోజనము? ప్రయత్నించిన సీతవంటి స్త్రీ లోకములో దొరుకును. కాని లక్ష్మణునివంటి సోదరుడు, సహాయకుడు, చతురతగల యోధుడు దొరకడు. లక్ష్మణుడే మరణించినచో నేనుకూడ వానరులముందే ప్రాణములను త్యజింతును. అనెను. ఆహా! వారి సోదరప్రేమ ఎంత గొప్పది.

శ్రీరాముని చూచి వానరులుకూడ విలపింపసాగిరి. ఇంతలో గరుత్మంతు డచటికి వచ్చి తన నాగపాశ విమోచన విద్యతో యిరువురను విడిపించి వెళ్ళెను.

(గరుత్మంతుడు పక్షికాదు. వారు సర్వవిద్యలో ప్రావీణ్యం గల ఒక జాతి (తెగ) కి చెందినవారు. రామాయణములో గరుత్మంతుని గూర్చి వర్ణన యిట్లు గలదు-

శ్లో॥ కో భవాన్ రూపసంపన్నో దివ్యస్రగను లేపనః ।
వసానో విరజే వస్త్రే దివ్యాభరణభూషితః ॥ (వా.రా. యు. 50-44)

రూపవంతులు, దివ్య - పూలమాలాలంకృతులై, గంధము పూయబడి సుందర వస్త్రములను ధరించినట్టి, అలంకారములకే అలంకారప్రాయముగ నున్నట్టి మీ రెవరు?

పైన చెప్పిన వర్ణన మనుష్యులవర్ణనో లేక పక్షివర్ణనో పాఠకులే ఆలోచించి నిర్ణయింపగలరు. )

శ్రీరాముడు స్వస్థుడగుట చూచిన రామదండులో ఆనందోత్సాహములు వెల్లివిరిసి వానరులు సింహగర్జన చేయసాగిరి. యుద్ధభేరీలు మ్రోగించి తిరిగి యుద్ధమునకు వానరవీరులు సిద్ధమైరి.

ఈ హర్షధ్వనులు విన్న రావణునకు సందేహము కలిగినది. రామలక్ష్మణు లిరువురు క్షేమముగా యున్నట్లు దూతలద్వారా విన్న రావణుని ముఖ మండలము కాంతి విహీనమైనది. రెండవరోజు రావణుడు ధూమ్రాక్షుని యుద్ధమునకు పంపెను. అతడు పెద్ద సైన్యముతో యుద్ధమునకు రాగా హనుమంతుడు వానిని చిత్తుగా ఓడించి చంపెను. మూడవరోజున వజ్రదంష్ట్రుని పంపగా అంగదుడు వానితో తలపడి వాని రథమును గుఱ్ఱములను నాశనము చేసి తలను మొండెమును వేరు చేసెను. రాక్షసులంతా అదిచూచి పారిపోయిరి.

నాలుగవ రోజున అకంపనుడు యుద్ధభూమికి వచ్చి రక్తమును నదులుగ ప్రవహింపజేసెను. వానరసేన అతనిని చూచి భయకంపిత మగుటతో హనుమంతుడు వానితో తలపడెను. అకంపనుడు 14 బాణములతో హనుమంతుని గాయపరుపగా హనుమంతుడు ఒక వృక్షముతో వాని శిరస్సును బాదగా అతడు నేలపై పడి ప్రాణములు విడిచిపెట్టెను. (వృక్షమనగా చెట్టుకాదు. ఒక అయుధము పేరు)

ఈవిధముగా తనవారంతా హతులగుట వలన రావణుడు మిక్కిలి

దుఃఖము నొందెను. ఐదవరోజున తన సైన్యాధిపతి ప్రహస్తుని యుద్ధమునకు పంపెను.

ఇరుపక్షములవారు జయింపవలయునను కోరికతో భయంకర అస్త్ర - శస్త్రములను ప్రయోగింపసాగిరి. వానరసైన్యము వెనుకంజవేయుట చూచిన నీలుడు ప్రహస్తు నెదుర్కొనెను. అతని గుఱ్ఱములను చంపి ధనుస్సును ముక్కలుచేసి మూసలమను ఆయుధముతో అతని శిరస్సును నరకగా అతడు తెగిన వృక్షమువలె నేలపై పడెను. ప్రహస్తుని మరణవార్త విన్న రావణుడెంతో దుఃఖించుచు ఆరవదినమున తానే స్వయముగ యుద్ధమునకు బయలు దేరుటకు నిశ్చయించెను.

**రావణుడు యుద్ధములో పరాజయము నొందుట :**

స్వయముగ యుద్ధభూమికి వచ్చిన రావణుని చూచి శ్రీరాముడు

శ్లో॥ **అహో దీప్తో మహాతేజా రావణో రాక్షసేశ్వర : ।**
**ఆదిత్య ఇవ దుష్ప్రేక్షో రశ్మిభిర్భాతి రావణః ॥** (వా.రా.యు. 59-29)

రాక్షసరాజు రావణుడు చాలా కాంతివంతుడు, ప్రతాపము గలవాడు. కాంతికిరణములతో ప్రకాశించు సూర్యునివలె అతనివైపు ఎవరూ చూడలేరు. ఈ దుష్టుడు నేడు నా సౌభాగ్యమువలన నా ఎదుట పడెను. సీత నపహరించిన వీనిపై నా శౌర్యమును చూపెదనని తలంచి యుద్ధమునకై ధనుర్బాణములను గైకొనెను.

తనవైపు వచ్చుచున్న రావణుని ముందుగ సుగ్రీవుడు ఎదుర్కొనెను. కాని సుగ్రీవుని రావణుడు గాయపరచెను. లక్ష్మణుడు, హనుమంతుడుకూడ రావణునెదుర్కొనిరి. రావణుడు హనుమంతుని ఒక దెబ్బ గట్టిగా కొట్టగా అతడు దెబ్బకు తట్టుకొని వెంటనే రావణునొక దెబ్బ కొట్టగానే అతడు చలించి పోయెను.

శ్లో॥ **సాధువానర! వీర్యేణ శ్లాఘనీయోఽసి మే రిపుః ॥ (వా.రా.యు. 59-65)**

ఓ వానర! నీవు నా శత్రువైనను నీ బల-వీర్యములు కొనియాడదగినవి. అనిన రావణునితో హనుమంతుడు -

శ్లో॥ **ధిగస్తు మమ వీర్యేణ యస్త్వం జీవసి రావణ ।** (వా.రా.యు. 59-66)

నా దెబ్బ తినికూడ యింకా నీవు జీవించియుండుట నాబల వీర్యముల కవమానము. అనగా రావణు డామాటలకు మండిపడుచు హనుమంతుని గాయపరచి నేలకూల్చెను. ఎదురునిలిచిన నీలుని ఒకే ఒక బాణముతో మూర్ఛితుని గావించెను. తదుపరి లక్ష్మణునితో యుద్ధము చేయ నారంభించెను. లక్ష్మణుడు రావణుని బాణములను ఆకాశములోనే కూల్చివేయుచు అతని ధనస్సునుకూడ విరిచివేసెను. వెంటనే క్రోధముతో రావణుడొక శక్తివంతమైన బాణముతో లక్ష్మణుని మూర్ఛిల్లజేసి అతనిని తన రథముపై వేసుకొని లంకానగరమునకు తీసుకొని పోవుటకు యత్నించుచుండగా ఆ సమయమునకు హనుమంతుడు వచ్చి రావణుని బలముతోకొట్టి మూర్ఛిల్లజేసి లక్ష్మణుని తీసుకొని రాముని దళమును చేరెను. తదుపరి రావణుడు వానరసైన్యమును సంహరించుట చూచి రాముడతనితో తలపడి తన అద్భుత యుద్ధనైపుణ్యముతో రావణుని రథమును ముక్కలు ముక్కలు చేసెను. గుఱ్ఱమును సారథిని చంపి మెరియుచున్న కిరీటమును ముక్కలుచేసి సంధ్యాసమయ మగుచున్నందున శ్రీరాముడు రావణునితో -

**శ్లో॥ కృతం త్వయా కర్మ మహత్సుభీమం,**
**హత ప్రవీరశ్చ కృతస్త్వయాహమ్ ।**
**తస్మాత్ పరిశ్రాన్త ఇవ వ్యవస్య,**
**న త్వాం శరైర్ మృత్యువశం నయామి ॥ (వా.రా.యు. 59-142)**

ప్రాతఃకాలమనుండి ఘోరయుద్ధము చేసి మీ వీరత్వమును చూపిరి. మాసైన్యములో చాలామంది వీరులు మీవలన హతులైరి. బాగా అలసిపోయినందున మిమ్ములను వధించుట చాలా సులభము. కాని అలసియున్న శత్రువును వధించుట ఆర్యుల మర్యాదకు విరుద్ధము. కనుక మీరిప్పుడు ఇంటికి మరలిపొండు. రేపు యుద్ధములో మీకు తగినట్లుగ స్వాగతము చెప్పుదుననెను .

శ్రీరాముడు శత్రువులకు కూడ ఆదర్శమైనవాడు. రావణుడు మనస్సులో శ్రీరాముని గుణగణములను తలంచుచు నగరములో ప్రవేశించెను. శ్రీరాముడు తన గుడారమునకు చేరుకొని లక్ష్మణునకు ఉపచారము చేయసాగెను.

కుంభకర్ణుని పరాక్రమము :

రావణుడు పరాజయమునకు దుఃఖించుచు మంత్రిమండలిని పిలిచి మరునాడు యుద్ధమునకై కుంభకర్ణుని సేనాపతిగ నియమించెను. అతడొక భయంకర రాక్షససైన్యమును తీసుకొని యుద్ధభూమికి రాగా వానర సైన్యమతనిని చూచి పారిపోసాగిరి. పారిపోవుచున్న సైన్యమును చూచి అంగదుడు (కుంభకర్ణుడు ఆరుమాసములు నిద్రించి యుండెడివాడని అందురు. కాని వాస్తవముగ అతడు రాచకార్యములకు దూరముగ నుండెడివాడు. అతనిని గూర్చి రావణుడిట్లనును.

శ్లో॥ **కుంభకర్ణః సదా శేతే మూఢో గ్రామ్యసుఖే రతః ।** (వా.రా.యు. 60-20)

'మూర్ఖుడు కుంభకర్ణుడు భార్యా - పిల్లల సుఖములలో మునిగి ఎల్లప్పుడు నిద్రించుచుండును'. రాచకార్యములలో పాల్గొనకుండా భార్యా బిడ్డలతో సుఖము లనుభవించుచు గృహమున నుండుటే అతని నిద్ర.)

శ్లో॥ **దారా హ్యపహసిష్యన్తి స వై ఘాతస్తు జీవినామ్ ।**
**కులేషు జాతాః సర్వేస్మ విస్తీర్ణేషు మహత్సు చ ॥**
**క్వ గచ్ఛథ భయత్రస్తా హరయః ప్రాకృతా యథా ।**
**అనార్యాః ఖలు యద్భీతా స్త్యక్త్వా వీర్యం ప్రధావతః ॥**

**(వా.రా.యు. 66-22)**

ఓ వానరులారా! మీ పిరికితనమునకు మీ భార్యలు నవ్వుదురు. అది మీకు మరణముతో సమానము. గొప్ప కుటుంబములలో జన్మించిన మీరు సాధారణ వానరులవలె ఎచటికి పరుగెత్తుచున్నారు? మీ బలమును మరచి భయపడుచున్నారు. కనుక మీరు నీచులతో సమానము. అని ఈవిధముగ పౌరుషవచనములతో వారికి ధైర్యము చెప్పుచుండెను. కాని కుంభకర్ణుని శస్త్రముల తీవ్రతకు వారు తాళలేకుండిరి. ఇదిచూచిన హనుమంతుడు కుంభకర్ణునితో తలపడెను. కుంభకర్ణుడొక శూలముతో హనుమంతుని గాయపరిచెను. ఇంతలో నీలుడు రాగా అతనిని కూడా తరిమికొట్టెను. తిరిగి అంగదుడు కుంభకర్ణునితో తలపడగా అతని నొకదెబ్బతో మూర్ఛిల్లజేసెను. తదుపరి శూలముతో సుగ్రీవునిపైకి లంఘించి అతనిని గాయపరచి మూర్ఛితుని

గావించెను. మూర్ఛనొందిన సుగ్రీవుని తీసుకొని కుంభకర్ణుడు లంకా నగరమునకు పోవుచుండగా రాజమార్గమున చేయబడు జలప్రసేచనముతో చల్లబడిన గాలికి మూర్ఛనుండి తేరుకొనిన సుగ్రీవుడు కుంభకర్ణుని బంధనము నుండి విడిపించుకొని యుద్ధభూమివైపు పారిపోయెను. సుగ్రీవుని వెంబడించుచు కుంభకర్ణుడు మరల యుద్ధభూమికి చేరెను.

లక్ష్మణుడు క్రోధముతో కుంభకర్ణునితో యుద్ధముచేయ నారంభించి కొద్దిసమయములోనే భయంకర బాణముల వర్షముతో వాని శరీరమును తూట్లు గావించెను. లక్ష్మణుని యుద్ధకౌశల్యమును చూచి కుంభకర్ణుడు -

**శ్లో॥ అద్య త్వయాఽహం సౌమిత్రే బాలేనాపి పరాక్రమైః ।**
**తోషితో గన్తుమిచ్ఛామి త్వామనుజ్ఞాప్య రాఘవమ్ ॥**

(వా.రా.యు. 67-112)

ఓ సుమిత్రనందన! నీవు బాలకుడవైనా నేడు నీ బల పరాక్రమములు చూచి నేను సంతోషము నొందితిని. నీ ఆజ్ఞతో నేనిపుడు శ్రీరామునివద్దకు పోవుదునని చెప్పి శ్రీరామునివద్దకు పరుగిడగా వారిరువురిమధ్య భయంకర యుద్ధము జరిగినది. తదుపరి శ్రీరాముడు వాయవ్యాస్త్రముతో కుంభకర్ణుని కుడిభుజమును నరికెను. అప్పుడు కుంభకర్ణుడు ఒకేచేతితో యుద్ధము చేయుచుండగా శ్రీరాముడు ఐన్ద్రాస్త్రముతో రెండవభుజమును కూడా తెగ నరికెను. రెండు భుజములు తెగిననూ ఆ రాక్షసుడు ముందు కురుకుచుండగా శ్రీరాముడు రెండు చంద్రాకార బాణములతో వాని రెండుకాళ్ళు నరికివేసి ముఖమంతా బాణములతో నింపి ఐన్ద్రాస్త్రముతో వాని శిరమును ఖండించెను.

తన సోదరుడు కుంభకర్ణుని మరణవార్త విన్న రావణుడు దుఃఖముతో మూర్ఛిల్లి భూమిపై పడెను.

రావణుని దుఃఖమును చూచిన త్రిశిర రామలక్ష్మణులను వధింతునని ప్రతిజ్ఞచేసెను. అతనితో దేవాంతకుడు, నరాంతకుడు, అతికాయులు కూడా ఉత్సాహముతో యుద్ధభూమికి వెళ్ళిరి. ఇరువైపుల భీకరయుద్ధము జరిగినది. ఎంతో సైన్యము నష్టమైనది. యుద్ధములో అంగదుడు నరాంతకుని, హనుమంతుడు దేవాంతకుని, త్రిశిరలను, లక్ష్మణుడు అతికాయుని యమపురి

కంపిరి. వీరి మరణముతో రావణుని పక్షముననున్న ప్రముఖ రాక్షస వీరులందరూ సమాప్తమైరి. ఈ సమాచారము విన్న రావణుడు చాలా దుఃఖించెను. తండ్రి దుఃఖమును చూచిన మేఘనాదుడు (ఇంద్రజిత్తు) రామలక్ష్మణులను వధింతునని ప్రతిజ్ఞపూని మరునాడు పెద్ద సైన్యముతో యుద్ధమునకు బయలుదేరెను. భయంకర యుద్ధముచేయుచు వానరసైన్యమును వధించుచుండెను. గన్ధమాదనుడు, నలుడు, మయన్దుడు, జాంబవానుడు, సుగ్రీవుడు, అంగదుడు మున్నగు వానర ప్రముఖులందరిని బాణములతో గాయపరచి మృత ప్రాయులను గావించెను. రామలక్ష్మణులను సమీపించి వారితో భీషణ యుద్ధము చేసి బాణముల వర్షముతో వారిని మూర్ఛితులను చేసెను. వారిరువురు చనిపోయిరని తలంచి సింహగర్జన చేయుచు విజయఢంకా మ్రోగించుచు మేఘనాదుడు లంకానగరమునకు వెళ్ళిపోయెను.

శ్రీరామ లక్ష్మణులు మూర్ఛనొందుట, వానరసైన్యమంతా ఏమి చేయుటకు దిక్కుతోచని స్థితిలో నుండుటను చూచి జాంబవంతుడు మృతసంజీవినీ మూలికను తెచ్చుటకై హనుమంతుని ఋషభక పర్వతమున కంపెను. పర్వత శిఖరమునకు చేరుకొనిన హనుమంతునకు ఆమూలిక ఆకులు కావలయునా, లేక మూలిక, పుష్పములలో నేది కావలయునను సందేహము కలిగి పూర్తి వృక్షమును పెకలించి తీసుకొని లంకకు చేరుకొనెను. ఆ దివ్య ఔషధముయొక్క సుగంధపు వాసనకు రామలక్ష్మణులు వానర సైన్యమంతా మూర్ఛనుండి తేరుకొనిరి. తదుపరి సుగ్రీవుని ఆదేశానుసారము వానరసైన్యము లంకానగరము నాక్రమించి నిప్పంటించసాగిరి. దానితో లంకానగరమున హాహాకారములు చెలరేగినవి. ఆరాత్రి రాక్షసులకు కాళరాత్రి యైనది. రావణుడు తక్షణమే కుంభకర్ణుని పుత్రులగు కుంభ, నికుంభులను యుద్ధమునకు పంపెను. కుంభుని సుగ్రీవుడు, నికుంభుని శ్రీరాముడు చంపిరి. తరువాత రావణుడు ఖరుని పుత్రుడు మకరాక్షుని యుద్ధమునకు పంపగా శ్రీరాముడు వానినికూడ వధించెను.

**మేఘనాదుని (ఇంద్రజిత్తు) యుద్ధ నైపుణ్యము, అతని వధ :**

మకరాక్షుని మరణముతో రావణుడు పళ్ళునూరుచు చివరకు తన

కుమారుడు ఇంద్రజిత్తును యుద్ధమునకు పంపెను. విజయ యాగమును చేసి మేఘనాదుడు అదృశ్యరథమును, బ్రహ్మాస్త్రాదులను సంపాదించి యుద్ధ రంగమున ప్రవేశించెను. అదృశ్యముగ (ఇతరులకు కనబడకుండా) నుండియే మేఘనాదుడు శ్రీరామలక్ష్మణులపై బాణముల వర్షము కురిపించసాగెను. శ్రీరామ లక్ష్మణులుకూడా దివ్యాస్త్రములను ప్రయోగించుచున్నను మేఘనాదుడు కనబడకుండుట వలన వారికి యుద్ధము చేయుట కష్టమగుచుండెను. అందువలన మేఘనాదుని వధించుట కొక భయంకర అస్త్రమును ప్రయోగించుటకై శ్రీరాము డాలోచించుచుండగా విషయమును గ్రహించిన మేఘనాదుడు యుద్ధమునాపి లంకానగరమునకు వెళ్ళిపోయెను .

కొంత సమయము తరువాత సీతాదేవి విగ్రహము నొకదానిని రథముపై నిడుకొని తిరిగి యుద్ధభూమికి వచ్చి వానరసైన్యము ఎదుట ఆ విగ్రహపు శిరస్సును తెగగొట్టెను. అదిచూచి వానరసైన్యము దుఃఖింపసాగెను. ఈవార్త తెలిసిన శ్రీరాముడు మిక్కిలి దుఃఖించుచుండగా చూచిన విభీషణుడు అది సీతాదేవి విగ్రహమని చెప్పి, మేఘనాదుడు ఆవిధముగ వానరులను మోసగించి విజయ-యజ్ఞమును చేయుటకు వెళ్ళెనని అతడా యజ్ఞమును పూర్తిచేయక ముందే అతనిని వధింపవలయునని అందుకు లక్ష్మణుని వెంటనే పంపుడని చెప్పెను. శ్రీరాముని ఆజ్ఞానుసారము లక్ష్మణుడు ఆయుధములను సైన్యమును తీసుకొని ఇంద్రజిత్తును వధించుటకు విభీషణునితో పాటుగ బయలుదేరెను. మందిరమునకు చేరగానే లక్ష్మణుడు బాణముల వర్షము కురిపించి రాక్షస సేనను చెల్లాచెదురు గావించెను. రాక్షససైన్యమును చంపుట చూచిన మేఘనాదుడు యజ్ఞమును అసంపూర్ణముగనే విడిచిపెట్టి యుద్ధమునకు సన్నద్ధమై రథముపై బయలుదేరెను. లక్ష్మణుడతనిని చూడగనే యుద్ధమునకు ఆహ్వానించెను. ఇరుపక్షములవారు జయింపవలయునను కోరికతో యుద్ధము చేయసాగిరి. రక్తము ప్రవహింపసాగినది. లక్ష్మణుడు తన యుద్ధ నైపుణ్యమును చూపుచు మేఘనాదుని సారథిని గుఱ్ఱములను చంపి రథమును ముక్కలు చేసెను. మేఘనాదుడు నేలమీదనుండి యుద్ధము చేయుచునే ఎంతో నేర్పుగా తప్పించుకొని లంకానగరమునకు పోయి ఒక బంగారు అభరణములతో అలంకరించిన రథముపై నెక్కి యుద్ధక్షేత్రమునకు వచ్చి యుద్ధము చేయసాగెను.

లక్ష్మణుడు అతని నెదుర్కొని అతని ధనుస్సును విరుగగొట్టెను. సారథిని చంపి రథమును నాశనమొనర్చెను. మేఘనాదుడు నేలమీదనుండి యుద్ధము చేయసాగెను. లక్ష్మణుడు మేఘనాదుని వధింప నిశ్చయించుకొని ఐన్ద్రాస్త్రమును ధనుస్సున సంధించి

శ్లో॥ ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది ।
పౌరుషే చాప్రతిద్వన్ద్వః శరైనం జహి రావణిమ్ ॥ (వా.రా.యు. 91-73)

దశరథనందనుడైన శ్రీరాముడు ధర్మాత్ముడు, సత్యవాది, అద్వితీయ పరాక్రమవంతుడు ఐనచో ఈ బాణము ఇంద్రజిత్తును వధించునుగాక! అని బాణమును వదలగా అది మేఘనాదుని వధించినది.

**రావణుని మరణము :**

ఇంద్రజిత్తు మరణించగానే విభీషణుడు, హనుమంతుడు లక్ష్మణునకు జయజయ ధ్వానములు చేయసాగిరి. ఇంద్రజిత్తు మరణవార్త విన్న రావణుడు మూర్ఛిల్లి నేలపై కొరిగెను. రావణుడు ఏకాకి అయ్యెను. తానే స్వయముగ యుద్ధమునకు బయలుదేరుచుండగా అతని మంత్రి సుపార్శ్వుడు -

శ్లో॥ అభ్యుత్థానం త్వమద్యైవ కృష్ణపక్షచతుర్దశీమ్ ।
కృత్వా నిర్యాహ్యమావాస్యాం విజయాయ బలైర్వృత : ॥
(వా.రా.యు. 93-65)

నేడు కృష్ణపక్ష చతుర్దశి. నేడే యుద్ధమునకు సన్నద్ధమై రేపు అమావాస్య రోజున విజయ-యాత్ర జరుపుడనెను.

బ్రహ్మాస్త్రము, బ్రహ్మకవచములను ధరించి స్వర్ణరథమును అధిరోహించి మిగిలియున్న సైన్యముతో రావణుడు యుద్ధక్షేత్రమునకు వచ్చెను. భయంకర బాణవర్షమును కురిపించుచు రాముని సైన్యములో కలవరమును రేకెత్తించెను. వానర సైన్యమును వధించుచు శ్రీరామలక్ష్మణులవద్దకు వచ్చెను. ముందుగ తామసాస్త్రమును ప్రయోగించి వానర సైన్యమును దహించివేసెను. తదుపరి పదిబాణములు వేసి శ్రీరాముని మర్మావయవములను బాధించెను. శ్రీరాముడు కూడ అనేక బాణములతో రావణుని శరీరమును ఛేదించెను. ఇంతలో లక్ష్మణుడు కోపముతో రావణుని రథధ్వజమును విరిచి సారథిని చంపి ధనుస్సును విరుగగొట్టెను. విభీషణుడు రావణుని రథముయొక్క నాలుగు

గుఱ్ఱములను చంపెను. వెంటనే రావణుడు రథము మీదినుండి క్రిందికి ఉరికి విభీషణునిపై ఒక శక్తివంతమైన బాణమును విడిచెను. దానిని చూచిన లక్ష్మణుడు వెంటనే ముందుకు వచ్చి నిలువగానే ఆశక్తితో కూడిన బాణము లక్ష్మణుని శరీరమును తాకగా అతడు మూర్ఛనొంది నేలపైకొరిగెను.

తమ్ముని స్థితిచూచిన శ్రీరాముడు సోదరప్రేమతో ఉదాసీను డయ్యెను. ఐనా సుగ్రీవుని, హనుమంతుని లక్ష్మణునకు కాపలా ఉంచి శ్రీరాముడు భయంకర యుద్ధము చేసెను. ఆయన బాణముల వర్షమునకు తట్టుకొనలేక రావణుడు యుద్ధమును మాని పారిపోయెను.

లక్ష్మణుని దీనావస్థను చూచి శ్రీరాముడు యిట్లు విలపింపసాగెను. (శ్రీరామునకు తన చిన్న తమ్మునిపై గల ప్రేమ ఇది. లక్ష్మణుని ప్రేమకూడా అటువంటిదే. ఔషధములతో లక్ష్మణుడు స్వస్థత నొందిన తరువాత నీకెటువంటి బాధ కలిగినదని అడుగగా అతడు యిట్లనెను.

శ్లో॥ ఈషన్మాత్రమహం వేద్మి స్ఫుటం యోవేత్తి రాఘవః ।
వేదనా రాఘవేన్ద్రస్య కేవలం వ్రణినో వయమ్ ॥

(హనుమన్నాటకము 13-38)

'నాకు కలిగిన బాధ కొంచెమే. వాస్తవముగ అధికముగ బాధననుభ వించినవాడు శ్రీరాముడే. ఏలయన కేవలము నాకు దెబ్బమాత్రము తగిలినది. కాని దానికి సంబంధించిన బాధనుమాత్రము శ్రీరాముడనుభవించెను' ఆహా ! వారి సోదరప్రేమ ఎంత ఆదర్శవంతమైనది.)

శ్లో॥ కిం మే రాజ్యేన ప్రాణైర్ యుద్ధే కార్యం న విద్యతే ।
యత్రాయం నిహతః శేతే రణమూర్ధని లక్ష్మణ ః ॥
దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాన్ధవాః ।
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః ॥

(వా.రా.యు. 102 - 12, 13)

నేనిప్పుడీ రాజ్యము నేమిచేసుకుందును. అసలు నేను బ్రతికి యుండి కూడా ఏమి ప్రయోజనము? నేనిప్పుడు రావణునితో యుద్ధము చేయు అవసరముకూడా లేదు. ఏలయన లక్ష్మణుడు యుద్ధభూమిలో

నిద్రించుచున్నాడు. స్త్రీలు బంధువులు అంతటా లభింతురు. కాని సహోదరుడు దొరకు స్థలమేదియు లభింపదు.

ఈవిధముగ శ్రీరాముడు దుఃఖించుట చూచిన సుషేణుడు ఆయనకు ధైర్యమును చెప్పుచు హనుమంతునితో - ఓ వీర! నీవు వెంటనే జాంబవంతుడు చెప్పిన ఋషభపర్వతమునకు వెళ్ళి విశల్యకరణి, సావర్ణ్యకరణి, సంజీవని, సంధానకరణీ మున్నగు మూలికలను తీసుకొని సూర్యోదయమునకు ముందే యిచ్చుటకు రమ్ము. లేకున్న లక్ష్మణుడు జీవించుట కష్టము. అని చెప్పగానే హనుమంతుడు శీఘ్రముగ ఆ పర్వతమునకు వెళ్ళెను. కాని ఆమూలికలను కనుగొనలేక పోయినందున ఆయన

శ్లో॥ ఫుల్లనానాతరుగణం సముత్పాద్య మహాబలః । (వా.రా.యు. 102-29)

అనేక రకముల పుష్పములతో కూడిన వృక్షములను సమూలముగ పెకలించుకొని సూర్యోదయమునకు ముందే రాముని సైన్యములో వచ్చి చేరెను. ఆ మూలికలన్నింటిని చూచిన సుషేణుడు ఆశ్చర్యముగ - 'అహో! నీవు పర్వతమునంతా తీసుకొని వచ్చితివి' అనెను. వాస్తవముగ హనుమంతుడు పర్వతము నెత్తుకొని రాలేదు. అదొక అతిశయోక్తి. నేడుకూడా అటువంటి ప్రయోగములు మనము వాడుచుందుము. పిల్లలు అల్లరి చేయుచున్నపుడు తల్లులు పిల్లలతో - నీవు ఇల్లు నెత్తిపై పెట్టుకున్నావందురు. వాస్తవముగ ఇల్లు వాని నెత్తిన ఉండదు.

సుషేణుడు ఆ వనమూలికలను ప్రయోగింపగా వాని వాసన తగలగానే లక్ష్మణుని గాయములు మాని ఆరోగ్యవంతుడయ్యెను. శ్రీరాముడతనిని ఆలింగనము చేసుకొనగా వానరులు హర్షధ్వానములు చేసిరి.

ప్రాతఃకాలమున రావణుడు సంపూర్ణ అస్త్రశస్త్ర బలగముతో రథముపై బయలుదేరి యుద్ధభూమికి వచ్చెను. ఇంద్రుడు సారథి - మాతలికి తన రథమునిచ్చి శ్రీరామునివద్దకు పంపెను. ఇంద్రుని కొనియాడుచు రాముడు రథమునెక్కి వెడలిపోయెను. ఇరుపక్షములవారు భయంకరమైన ఆయుధములను ప్రయోగింపసాగిరి. అపూర్వము, అద్భుతము, రోమాంచకము నైన ఆ భయంకర యుద్ధమును ఆదికవి వాల్మీకి యిట్లు వర్ణించెను -

శ్లో॥ గగనం గగనాకారం సాగరః సాగరోపమాః ।
రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ ॥ (వా.రా.యు. 110-24)

నక్షత్ర మండలముతో ప్రకాశించు ఆకాశమునకు ఆకాశమే ఉపమాన మైనట్లు సముద్రముతో పోల్చుటకు సముద్రమే తగినట్లు రామరావణుల యుద్ధమునుగూర్చి పోల్చిచెప్పుటకు రామరావణుల యుద్ధమే సాటి.

యుద్ధములో శ్రీరాముడు విజయమును గాంచకుండుటను చూచి ఇంద్రుని సారథియైన మాతలి ఓ వీర! బ్రహ్మాస్త్రమును ప్రయోగింపుడు అనగానే శ్రీరాముడు బ్రహ్మాస్త్రమును సంధించి రావణునిపై ప్రయోగించగా అతివేగముగా అది రావణుని హృదయమును ఛేదించి బయటకు వెడలెను.

రావణుడు వీరగతినొందెను. భూమిపై పడియున్న అన్నను చూచి విభీషణుడు రోదింపసాగెను. అతనిని ఓదార్చుచు శ్రీరాముడు - రావణుడు యుద్ధము చేయుచు వీరగతినొందెను. కనుక శోకింపరాదని అంత్యేష్టికై ఆదేశించుచు

శ్లో॥ మరణాంతాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్ ।
క్రియతామస్య సంస్కారో మమాప్యేష యథా తవ ॥

(వా.రా.యు. 112-26)

వ్యక్తి చనిపోవువరకే విరోధముండును. మా ప్రయోజనము పూర్తయినది. ఇప్పుడు ఈయన నీకెట్లు సోదరుడో నాకును అట్లే బంధువు. ఈయనకు తగినట్లుగ అంత్యేష్టి సంస్కారము చేయుడు అనెను. ఎంతటి గొప్ప **ఆదర్శమిది! నేటికినీ రావణుని బొమ్మను దహనమొనర్చువారు శ్రీరాముని ఈ మాటలపై గౌరవముంచి అనిందనీయ కర్మను విడనాడవలయును.** రావణుని అంత్యేష్టి తరువాత శ్రీరాముని ఆజ్ఞానుసారము లక్ష్మణుడు విభీషణుని లంకారాజ్య సింహాసనముపై కూర్చుండబెట్టి సముద్ర జలముతో ఆయనకు అభిషేకము చేసెను.

**సీతాదేవిని అగ్ని పరీక్ష చేయుట :**

శ్రీరాముని ఆజ్ఞానుసారము హనుమంతుడు అశోకవనమునకు పోయి రావణుని వధ శ్రీరాముని విజయములను గూర్చి సీతాదేవికి అంతా వివరముగ

తెలిపెను. విభీషణుడు సీతాదేవిని ఒక పల్లకిలో కూర్చుండబెట్టి శ్రీరాముని వద్దకు తీసుకొనిరాగా ఆమెనుచూచి శ్రీరాము డిట్లనెను -

శ్లో॥ ఏషాఽసి నిర్జితా భద్రే శత్రుం జిత్వామయారణే ।
పౌరుషాద్యదనుష్ఠేయం తదేతదుపపాదితమ్ ॥ (వా.రా.యు. 118-2)

ఓ భద్ర! నేను యుద్ధములో శత్రువును ఓడించి నిన్ను తిరిగి పొందితిని. పురుషార్థముతో చేయదగినది నేను చేసి చూపితిని.

శ్లో॥ ప్రాప్త చారిత్ర సందేహా తద్గచ్ఛ జనకాత్మజే ।
ఏతా దశ దిశో భద్రే కార్యమస్తి న మే త్వయా ॥
సుగ్రీవే వానరేన్ద్రే వా రాక్షసేన్ద్రే విభీషణే ।
నివేశయమనః సీతే యథావా సుఖమాత్మనః॥ (వా.రా.యు. 118-22, 23)

నీ చరిత్రపై నాకు సందేహము కలిగినది. నీకడ్డులేదు. నీ వెక్కడికి వెళ్ళవలెనన్న అచ్చటికి వెళ్ళవచ్చును. వానరరాజు సుగ్రీవునివద్దగాని, రాక్షస రాజు విభీషణుని వద్దగాని లేక నీకెక్కడ సుఖము లభించునో అచ్చట నీవుండ వచ్చును.

(శ్రీరాముని విషయములో - 'రామో ద్విర్నాభిభాషతే' (అయోధ్యా. 18-30) రాముడు రెండు విధముల మాటలు మాట్లాడడని ప్రసిద్ధి. ఒకటి : రాముడు సీతకు అగ్ని పరీక్ష (కఠిన పరీక్ష) పెట్టెను. రెండవది : నేను సీతను విడువలేనని స్వయముగ అనును. అందువలన రాజ్యాభిషేకము తర్వాత సీతాదేవిని వనములకు పంపుట. అందులో ఆమె గర్భమును ధరించియుండగా పంపెననుమాట అనుచితమై తర్క విరుద్ధముగ భావింపబడును. కనుక పవిత్ర మూర్తియైన శ్రీరాముని చరిత్రను కళంకము చేయుటకై ఈ ఘటనను ఎవరో తరువాత జోడించిరనుట వాస్తవము.)

శ్రీరాముని ఈ కఠోరమైన మాటలను విన్న సీతాదేవి నిర్భయముగ యిట్లనెను.

శ్లో॥ కిం మామసదృశం వాక్యమీదృశం శ్రోత్రదారుణమ్ ।
రూక్షం శ్రావయసే వీర ప్రాకృతః ప్రాకృతామివ ॥
న తథాఽస్మి మహాబాహో యథా త్వమవగచ్ఛసి ।
ప్రత్యయం గచ్ఛమే యేన చరిత్రేణైవ తే శపే ॥ (వా.రా.యు. 119-5,6)

ఓ వీర! ఎవరో అనాగరిక పురుషుడు అనాగరిక స్త్రీతో మాట్లాడినట్లు నీవిటువంటి అనుచితము, కర్ణ కఠోరమునైన, కటు వచనముల నేల పలికెదవు. ఓ మహాబాహో! నీవనుకున్నట్లు నేను శంకింపదగిన దానను కాను. నన్ను నమ్ముము. నేను నాపతివ్రత ధర్మముపై శపథము చేసి చెప్పుచున్నాను. అని లక్ష్మణునితో - వెంటనే చితిని పేర్చుము. అని చితి తయారుకాగానే ప్రాణత్యాగమునకై అగ్నిలో దూకుచుండగా యక్షరాజు కుబేరుడు, శత్రువుల నణచు యముడు, దేవతలకు రాజైన ఇంద్రుడు, మహారాజు వరుణుడు, మహాదేవుడు, బ్రహ్మ మున్నగువారు తమ విమానములపై శ్రీరామునివద్దకు వచ్చి తమ చేతులెత్తి ఓ రామ! మహా జ్ఞానివయ్యు అగ్నిలో ప్రవేశించు సీతాదేవిని చూచి ఊరుకొనుచున్నావేమి? అనిరి. మహర్షి అగ్నిదేవుడు సీతాదేవిని తన ఒడిలో నుంచుకొని -

శ్లో॥ ఏషా తే రామ వైదేహీ పాపమస్యాం న విద్యతే ।
నైవ వాచా న మనసానైవ బుద్ధ్యా న చక్షుషా ॥ (వా.రా.యు. 121-6)

ఓ రామ! ఈ సీతాదేవి నీది. ఈమె మనస్సు, వచనము, బుద్ధి, నేత్రములలో దేనిలోను పాపములేదు (పవిత్రమైనది) అనిన అగ్ని దేవుని మాటలకు శ్రీరాముడు పరమానందము చెందెను. కళ్ళలో అశ్రువులు నిండినవి. ఆయన గద్గదస్వరముతో అగ్నిదేవునితో యిట్లనెను. సీతాదేవి సర్వదా పవిత్రమైనదనుట నిశ్చయము. కానీ ఈ సౌభాగ్యవతి చాలాకాలముగ రావణుని రాణివాసమున నున్నది.నేనీమె పవిత్రతను పరీక్షించనిచో అందరూ నన్ను - దశరథ మహారాజు పుత్రుడు రాముడు మహాకాముకుడు, మూర్ఖుడు అని అందురు.

**శ్లో॥ విశుద్ధా త్రిషులోకేషు మైథిలీ జనకాత్మజా ।**
**న హి హాతుమియం శక్యా కీర్తి రాత్మ వతా యథా ॥ (వా.రా.యు. 121-20)**

జనకపుత్రి సీత సర్వథా శుద్ధమైనది. కీర్తిమంతుడు తన కీర్తిని విడువలేనట్లే నేనీమెనుకూడ విడువజాలను.

**అయోధ్యకు ప్రయాణము :**

మరునాడు శ్రీరాముడు విభీషణునితో నేను అతి శీఘ్రముగ అయోధ్యకు చేరవలయును. కాని మార్గము చాలా దూరము. దుర్గమము (పోవుట చాలా

కఠినము) అనగా విభీషణుడు - నేను మిమ్ములను దివ్యము, ఉత్తమ వేగవంతమైన, రావణుడు కుబేరుని నుండి లాగుకొన్న పుష్పక విమానము ద్వారా ఒకేరోజులో అయోధ్యకు చేర్చెదను. కనుక దయతో మీరింకొకరోజు యిచ్చటనే ఉండి నా ఆదరసత్కారములను స్వీకరింపుడనెను. అందులకు శ్రీరాముడు ఓ సౌమ్య! నీ సహాయముతోనే నాకు ఇచ్చట ఆదర సత్కారములు లభించినవి. నా మనస్సు యిప్పుడు భరతుని కలియుటకై తొందరపడుచున్నది. కనుక తొందరగా విమానమును తెప్పింపుము. అనెను.

వెంటనే పుష్పక విమానమును తెప్పించి విభీషణుడు - ఓ రాఘవ! నావలన యింకా జరుగవలసిన సేవ ఏదైనా ఉన్నదా! అని అడుగగా శ్రీరాముడు లక్ష్మణునితో మాట్లాడి - విభీషణ! ఈ వానరులు యుద్ధములో గొప్ప శౌర్యమును చూపిరి. వీరివలననే నేను విజయమునొందితిని. నీవు ధన రత్నాదులతో వీరిని సత్కరింపుమనగా విభీషణుడు వెంటనే వారి పదవులు, మర్యాదలకు తగినట్లుగ ధనకనక రత్నాదుల నిచ్చి సంతోషపరచెను. సీతా లక్ష్మణులతో శ్రీరాముడు విమానమునెక్కి అందరికీ ధన్యవాదములు చెప్పచు బయలుదేర బోవుచుండగా విభీషణుడు, వానరయోధులు వారితో పాటు అయోధ్య వచ్చుటకు ప్రార్థించిరి. శ్రీరాముడు అనుమతింపగా విభీషణ సుగ్రీవులు తమ తమ మంత్రులు, విశిష్ట సైనికాధిపతులతో విమానములో బయలుదేరిరి.

శ్లో॥ **అనుజ్ఞాతం తు రామేణ తద్విమాన మనుత్తమమ్ ।**
**హంసయుక్తం మహానాదముత్పపాత విహాయసమ్ ॥** (వా.రా.యు. 123-1)

హంసలతో కూడియున్న ఆ విమానము ఆకాశమున ఎగురుచూ భయంకర ధ్వని చేయసాగినది.

శ్రీరాముడు సీతాదేవికి ఆకాశమునుండే లంకలోని యుద్ధభూమి. సముద్రము, కిష్కింధలను చూపెను. సుగ్రీవుని భార్యనుకూడా అయోధ్యకు తీసుకువెళ్ళుదుమని సీతాదేవి శ్రీరాముని ప్రార్థింపగా విమానమును కిష్కంధలో ఆపి సుగ్రీవుని భార్యలను తీసుకొని మరల బయలుదేరిరి. మార్గములో శ్రీరాముడు ఋష్యమూక పర్వతమును, పంపా సరోవరమును, అగస్త్యుని ఆశ్రమము, చిత్రకూట పర్వతము, గంగానది మున్నగువానిని సీతాదేవికి

చూపుచు -

శ్లో॥ పూర్ణే చతుర్దశే వర్షే పంచమ్యాం లక్ష్మణాగ్రజః ।
భరద్వాజాశ్రమం ప్రాప్య వవన్దే నియతో మునిమ్ ॥

(వా.రా.యు. 127-1)

14 సంవత్సరముల వనవాసము పూర్తియైన పిదప చైత్ర శుక్ల పంచమీ రోజున మహర్షి భరద్వాజుని అశ్రమమునుచేరి యథావిధిగ అయనకు ప్రణామ మొనర్చెను.

[శ్రీరాముని రాజ్యాభిషేకము చైత్రమాసములో జరుగవలసి యుండెను. (18వ పేజి చూడుడు) కనుక 14 సంవత్సరములు చైత్ర మాసములోనే పూర్తియగును. యుద్ధములో ఆలస్యమైనదనుట కూడా సరికాదు. ఏలయన చిత్రకూటములో భరతుడు శ్రీరామునితో ఒక్క రోజు ఆలస్యమైనను నేను సజీవదహన మొనర్చుకొందునని చెప్పెను. (49 వ పేజి చూడుడు) కనుక విజయదశమినాడు రావణుడు చంపబడెననుట గాని, దీపావళినాడే రాముని రాజ్యాభిషేకము జరిగెననుట గాని సత్యము కాదు. శ్రీరాముడు విజయదశమి నాడు బయలుదేరెననుట సత్యము.

శ్లో॥ శ్రావణర్క్షే తు పూర్ణాయాం కాకుత్స్థః ప్రస్థితో యతః ।
ఉల్లంఘయేయుః సీమానం తద్దినర్క్షే ఽతతో నరాః ॥

(నిర్ణయ సింధు, విజయదశమీ - నిర్ణయము)]

అయోధ్య సమాచారమంతా అచ్చట శ్రీరామునకు తెలిసినది. ఐనా భరతుని గూర్చి వ్యాకులతతో తాము క్షేమముగ తిరిగి వచ్చితిమను సమాచారమును హనుమంతుని ద్వారా అయోధ్యకు తెలియజేసెను. హనుమంతుని ద్వారా శ్రీరాముని రాకనుగూర్చి తెలుసుకొని భరతుడు అమితోత్సాహము నొందెను.

**భరతుని కలుసుకొనుట :**

భరతుని ఆదేశముతో అయోధ్యానగరము నూతన వధువువలె అలంకరింపబడినది. రోడ్లమీద సుగంధ శీతజలమును చల్లిరి. అనేక చోట్ల ధ్వజములను, ఝుండాలను అలంకరించిరి. నానారకముల బ్యాండు మేళములు వాయించుచుండిరి. అయోధ్యనుండి నంది గ్రామము వరకూ

మార్గము లన్నింటిని బాగుగా అలంకరించిరి. అన్నీ సిద్ధమైన తరువాత మంత్రి, ప్రముఖ సైనికులు, బ్రాహ్మణులు, ముఖ్యవైశ్యులు ఏనుగులపై గుఱ్ఱములపై నెక్కిరి. కౌసల్యాది రాణులు రథములపై కూర్చొని నంది గ్రామమునకు చేరుకొనిరి. భరతుడు రాముని పాదుకలను తన శిరస్సుపై నుంచుకొని శ్రీరామునకు స్వాగతము చెప్పుటకు ముందుగ నడుచుచుండెను.

అందరి దృష్టి ఆకాశము వైపున్నది. ఆకాశములో పుష్పక విమానమును చూచి హనుమంతుడు శ్రీరాముని రాకను తెలిపెను. హనుమంతుని నోటినుండి శ్రీరాముని పేరు వినినంతనే 'శ్రీరామ చంద్రుడు వచ్చెను' అను నినాదము ఆకాశమంతటా వ్యాపించినది. బాజాభజంత్రీలతో ఆకాశము మారుమ్రోగినది. పుష్పక విమానము క్రిందకు దిగినది. శ్రీరాముడు ముందు పుష్పక విమానములోనుండి దిగెను. వెంటనే భరతుడు ఆయన పాదములు తాకి ప్రణామమొనర్చెను. శ్రీరాముడతనిని హృదయమునకు హత్తుకొనెను. తరువాత లక్ష్మణునకు సీతాదేవికి భరతుడు నమస్కరించెను. తదుపరి సుగ్రీవుని, జాంబవంతుని, అంగదుని, మయనుని, ద్వివిదుని, విభీషణాదులను కలిసెను. శ్రీరాముడు తనకంటె పెద్దవారికి, పూజ్యులకు నమస్కరించుచు నగరవాసులను కలసినపుడు వారంతా "స్వాగతం తే మహాబాహో।" హే కౌసల్యా నన్దవర్ధన! మీకు యిచ్చట శుభమగుగాక! అనిరి. శ్రీరాముడు వారికి కృతజ్ఞతలు తెలుపగానే భరతుడు చిత్రకూటమునుండి తెచ్చిన శ్రీరాముని పాదుకల జోడును శ్రీరాముని కాళ్ళకు స్వహస్తములతో ధరింపజేసి యిట్లనెను -

**శ్లో॥ అద్య జన్మ కృతార్థం మే సంవృత్తశ్చ మనోరథః ।**
**యస్త్వాం పశ్యామి రాజానమయోధ్యాం పునరాగతమ్ ॥**
**అవేక్షతాం భవాన్ కోశం కోష్ఠాగారం పురం బలమ్ ।**
**భవతస్తేజసా సర్వం కృతం దశగుణం మయా ॥**

**(వా.రా.యు. 130-55 ,56)**

'నేడు నాజన్మ సఫలమై మనస్సులోని కోరిక పూర్తియైనది. ఏలయన నేడు అయోధ్య మహారాజు అయోధ్యకు తిరిగివచ్చుట నేను చూచుచున్నాను. మీరు ధనగారమును, ధాన్యశాలను, పట్టణమును, సైన్యమును చూచుకొనుడు.

మీ గొప్పతనమువలన నేను వీటన్నింటిని ముందున్న వానికంటె 10 రెట్లు పెంచితిని.

నాతల్లిగారు నాకిచ్చిన రాజ్యమును ఎట్టి షరతులు లేకుండా మీకు తిరిగి యిచ్చివేయుచున్నాను. నేనీభారమును మోయుటకు అసమర్థుడను. మీరు దీనిభారమును వహించి ప్రజలను సుఖపెట్టుడు'. అనిన భరతుని ప్రార్థనను శ్రీరాముడు అంగీకరించెను. క్షౌరము స్నానాది కర్మలను ముగించుకొని శ్రీరాముడు రథమునెక్కి అయోధ్యకు బయలుదేరెను. అయోధ్యలో శ్రీరామునకు రాజ్యాభిషేకము వేదమంత్రములతో విధిపూర్వకముగ జరిగినది.

ఈ శుభసందర్భముగ లక్ష అవులను 30 కోట్ల బంగారునాణెములను బ్రాహ్మణులకు దానముగ నిచ్చిరి. సుగ్రీవునకు, అంగదునకు మణులు పొదిగిన రెండు హారములు యిచ్చిరి. సీతాదేవి హనుమంతుడు చేసిన ఉపకారమునకు గుర్తుగ తన మెడలోని హారమునుతీసి బహూకరించిరి. ఆ హారమును ధరించి హనుమంతుడు అత్యంత ఆనందముగ నుండెను. ఇతర వృద్ధులు, ముఖ్యులైన వానరులకు కూడా రత్నాదులను యిచ్చి యథారీతిగ సత్కరించి అందరిని సాగనంపిరి. (వీడ్కోలు చెప్పిరి)

**రామ రాజ్యము :**

మహాబల కీర్తిశాలియైన శ్రీరాముడు శత్రువులను జయించి భూమండలమును పరిపాలించుచుండెను. రామరాజ్యమును మహర్షి వాల్మీకి యిట్లు వర్ణించెను

శ్లో॥ న పర్యదేవన్ విధవా న చ వ్యాలకృతం భయమ్ ।
న వ్యాధిజం భయం చాసీద్రామే రాజ్యం ప్రశాసతి ॥ (95)

శ్రీరాముని రాజ్యములో స్త్రీలు విధవలు కాకుండిరి. సర్పముల వలన ఎవరికిని భయముండెడిది కాదు. ఎవరూ వ్యాధిగ్రస్తులు కాకుండిరి.

శ్లో॥ నిర్దస్యు రభవల్లోకో నానార్థం కంచి దస్పృశత్ ।
న చ స్మ వృద్ధా బాలానాం ప్రేత కార్యాణి కుర్వతే ॥ (96)

రామరాజ్యములో నలుదిశలా బందిపోట్లు మాటేలేదు. ఇతరుల ధనము నపహరించు మాటటుంచి దానిని తాకనైనా తాకకుండిరి. వృద్ధు

లెన్నడునూ బాలకుల మృతకకర్మను చేసెడివారు కారు. అనగా అకాల మరణములులేక పూర్ణాయువును అనుభవించుచు ప్రజలు సుఖముగ జీవించుచుండిరని భావము.

శ్లో॥ సర్వం ముదితామేవాసీ త్సర్వో ధర్మపరోఽభవత్ ।
రామమేవానుపశ్యన్తో నాభ్యహింసన్ పరస్పరమ్॥ (97)

రాముని రాజ్యమునందలి ప్రజలంతా వర్ణానుసారముగ తమతమ ధర్మకార్యములను అనుష్ఠించుటవలన అంతా సుఖముగ నుండెడివారు. శ్రీరాముడు బాధపడునని తలంచి ఎవరూ యితరులను కష్టపెట్టెడివారు కారు.

శ్లో॥ నిత్య పుష్పా నిత్యఫలాస్తరవః స్కన్ధ విస్తృతాః ।
కాలే వర్షీ చ పర్జన్యః సుఖస్పర్శశ్చ మారుతః ॥ (100)

రామరాజ్యములో వృక్షము లెల్లపుడూ పుష్పలతలతో నిండి యుండి ఫలించుచుండెడివి. వాని కొమ్మలు విస్తరించి యుండెడివి. వర్షఋతువులో వర్షించి సుఖస్పర్శతో కూడిన వాయువు వీచుచుండెడిది.

శ్లో॥ బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రో లోభ వివర్జితాః ।
స్వకర్మసు ప్రవర్తన్తే తుష్టాః స్వైరేవ కర్మభిః ॥
ఆసన్ ప్రజా ధర్మరతా రామే శాసతి నానృతాః ।
సర్వే లక్షణ సంపన్నాః సర్వే ధర్మపరాయణాః ॥
(వా.రా.యు. 101-102)

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులలో ఎవరూ లోభులు కారు. తమతమ పనులుచేయుచు సంతృప్తిగా జీవించుచుండిరి. ప్రజలంతా ధర్మపరాయణులై అనృతమునకు దూరముగా నుండెడివారు. అందరూ శుభ లక్షణములు కలవారై ధర్మాత్ములుగ నుండెడివారు.

ఈ విధముగ శ్రీరాముడు 11000 సంవత్సరముల వరకూ భూమండలమును పరిపాలించెను.

(పాఠకులారా! 11వేల శబ్దమును చూచి ఆశ్చర్యపడకండి. 11 సహస్రములనగా 30 సంవత్సరముల 1 మాసము 20 దినములు. ఇదెట్లని మీకు సందేహము

కలుగును వినండి -

మీమాంసా దర్శనములో వేల సంవత్సరములు యజ్ఞము చేయవలయు నని వర్ణన గలదు. మానవుల ఆయువే అంత లేనపుడు యిన్ని సంవత్సరముల యజ్ఞము ఎట్లు జరుగునను సందేహమునకు సమాధానము యిట్లు యివ్వబడినది.

శ్లో॥ సంవత్సరో విచాలిత్వాత్ ॥ (మీమాంసా. ద. 6-7-38)

సంవత్సరమనునది కేవలము 365 రోజుల సంవత్సరమునకు వాచకము కాదు. అచ్చటచ్చట ఋతువను అర్థములో వచ్చును. ఇంకా యితర అర్థములు కూడా కలవు.

శ్లో॥ అహాని వాzభి సంఖ్యత్వాత్ ॥ (మీ. ద. 6-7-40)

దినవాచకము కూడా సంవత్సర మనబడును. అందువలన శ్రీరాముడు సుమారు 30 సంవత్సరముల రాజ్యపరిపాలన చేసెను. విశేషించి కావ్యములలో పెద్దవారిని గూర్చి చెప్పు మాటలు గొప్పగా వ్రాయబడుచుండును. 1959వ సంవత్సరములో బుల్గానిన్ కృశ్చేవ్‌లు భారతదేశమునకు వచ్చినపుడు వారు శ్రీ నెహ్రూగారితో సంభాషణలు జరిపిరి. సమాచార పత్రములలో వారు 90 నిమిషములు సంభాషించిరని ప్రచురించిరి. 1 1/2 గంటలను 90 నిమిషములని వ్రాసిరి.

మరొక విధముగా ఆలోచించినచో - 25 సంవత్సరముల వయస్సులో శ్రీరాముని వివాహము జరిగినది. తరువాత 12 సంవత్సరముల వరకు వారు రాజభవనములో నుండిరి. 36 సంవత్సరముల వయస్సులో వారు వనములకు వెళ్ళి 14 సంవత్సరములు వనములలో నివసించిరి. 51 సంవత్సరముల వయస్సులో పట్టాభిషేకము జరిగినది. తదుపరి 30 సంవత్సరములు రాజ్యపాలన చేసి రఘువంశ పరంపర ననుసరించి వనములకు వెళ్ళిపోయిరి. )

## ఆర్య విద్వాంసుల పరిశోధనల సారాంశము

### 1. శ్రీరాముడు ఈశ్వరుడా ?

వేదములు ఈశ్వరుని అజన్ముడు, అశరీరుడు, నాడీబంధనములు లేనివానిగ వర్ణించెను. ఉపనిషత్తులు కూడ ఈశ్వరుని నిరాకారునిగ చిత్రించెను. సర్వవ్యాపకుడు సర్వదేశియైన వానికి అవతారము ఎట్లుండును? మర్యాదా పురుషోత్తముడైన రాముడు ఈశ్వరుడు కాడు. ఈశ్వర అవతారమూ కాదు. మేము కొన్ని ప్రమాణములను ఇచ్చట వ్రాయుచున్నాము.

రామాయణారంభములో మహర్షి వాల్మీకి నారదమునిని ఇప్పుడు ప్రపంచములో ధర్మాత్ముడు, చరిత్రవంతుడు, ప్రియదర్శనుడు ఎవరున్నారని అడిగినపుడు

శ్లో॥ 'మహర్షే త్వం సమర్థోఽసి జ్ఞాతుమేవ విధం నరమ్ ।

'ఓ మహర్షి! మీరటువంటి మానవుని గూర్చి తెలిసికొనుటకు సమర్థులు' అను ఈ వాక్యమునుబట్టి మహర్షి వాల్మీకి తన కావ్యమును ఒక మహాపురుషుని గూర్చి వ్రాసినట్లు, ఈశ్వరుని గూర్చి కాదని స్పష్టమగుచున్నది. స్వయముగ శ్రీరాముడే తనను ఈశ్వరునిగ అంగీకరింపడు. చూడుడు -

చిత్రకూటమునకు వెళ్ళి భరతుడు శ్రీరాముని "అయోధ్యకు తిరిగి రమ్ము" అనినపుడు ఆయన తిరస్కరించుచూ -

**శ్లో॥ నాత్మనః కామకారోఽస్తి పురుషోఽయమనీశ్వరః। (వా.రా.అయోధ్య. 105-15)**

'భరత! మనుష్యుడు ఈశ్వరుడు కానందున తన యిష్టప్రకారమేదియు చేయజాలడు' అనెను.

రావణుని బంధమునుండి విడిపించి ఆయన సీతతో యిట్లనెను.

**శ్లో॥ దైవ సంపాదితో దోషో మానుషేణా మయా జితః। (వా.రా.యు. 118-5)**

' ఓ దేవి! నీకు కలిగిన దైవసంబంధమైన ఆపదను తొలగించి మానవుడనైన నేను విజయము పొందితిని' ఇచ్చట రాముడు తనను మనుష్యునిగ చెప్పుకొనెను.

ఒకప్పుడు లోకపాలురు శ్రీరాముని ఈశ్వరుని అవతారముగ చెప్పినపు డాయన -

శ్లో॥ 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్ ।'

(వా.రా.యు. 110-11)

'నన్ను నేను దశరథ మహారాజు పుత్రునిగ - ఒక మనుష్యునిగ తలంతును' అనెను.

మహర్షి పతంజలి ఈశ్వరుని స్వరూపము (లక్షణము)ను వర్ణించుచు-

శ్లో॥ క్లేశ కర్మ విపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః ।'

(యోగశాస్త్రము 1-25)

"అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశమను ఐదు క్లేశము (కష్టము)లు;కర్మఫలము, విషయ వాసనల సంబంధము లేని విశేష పురుషునకు ఈశ్వరుడని పేరు" అని చెప్పెను. శ్రీరాముని జీవనమును పైన చెప్పిన ఈ లక్షణముతో ఆలోచించి చూచినచో ఆయన ఈశ్వరుడుగ అగుపడడు. ఆయన ఎన్నోకష్టముల ననుభవించి తనను తాను కర్మఫలములు అనుభవించు వానిగ అంగీకరించెను. అడవులలో సీతాదేవిని వెదకుచు దుఃఖముతో విలపించుచు లక్ష్మణునితో -

శ్లో॥ పూర్వం మయా నూన మభీప్సితాని,
పాపాని కర్మణి అసకృత్ కృతాని, ।
తత్రాయమద్య పతితో విపాకా,
దుఃఖేన దుఃఖం యదహం విశామి ॥ (వా.రా.అరణ్య 63-64)

'ఓ లక్ష్మణ! నేను నిశ్చయముగా నా పూర్వజన్మలలో అనేక పాపములను చేసితిని. అందువలననే నాకు దుఃఖములు ఒకదాని తరువాత మరొకటిగ కలుగుచున్నవి' అనెను. శ్రీరాముడు ప్రతిదినము సంధ్యోపాసన చేయుచుండెను. ఆయనే ఈశ్వరుడైనచో ఆయన ఎవరిని ఉపాసించుచుండెడివారు. నిత్యము శ్రీరాముడు సంధ్యోపాసన జపములు చేయుచుండుట వలన ఆయన ఈశ్వరుడు కాడని తెలుపుచున్నది. సుప్రసిద్ధ రామాయణ విద్వాంసుడైన గౌ॥ శ్రీనివాసజీ శాస్త్రిగారు కూడా - 'To me Shri Ram is not divine' 'శ్రీరాముని నేను ఈశ్వరునిగ అంగీకరింపను' అని తన (Lectures on Ramayana -పేజి8) గ్రంథములో వ్రాసిరి.

శ్రీరాముడు భగవంతుడు కానట్లయితే రామాయణ గ్రంథములో అయనను 'భగవంతు' డను శబ్దముతో ఏల సంబోధింపబడినదని పాఠకులు అడుగవచ్చును. దీనికి జవాబు -

శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః ।
జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా ॥

(విష్ణు పురాణము 6-5-74)

సంపూర్ణ ఐశ్వర్యము, ధర్మము, కీర్తి, శ్రీ, జ్ఞానము, వైరాగ్యములను ఆరింటికి 'భగ' మని పేరు. వీనిలో ఏ ఒక్కటి కలవానినైనా 'భగవానుడని' పిలుతురు. శ్రీరామునిలో యివన్నియు అధికముగా ఉండెను. అందువలన ఆయన భగవంతుడని పిలవబడుదురు. ఆయన భగవంతుడు, అంతేగాని సృష్టికర్తయైన ఈశ్వరుడు గాని ఆయన అవతారముగాని కాడు. ఒక మహామనీషి. ఆయననొక మహాపురుషునిగ తలంచి ఆయన జీవన విధానమును అధ్యయనము చేసి ఆయనలోని మంచి గుణములను ఆచరించినప్పుడే మనము లాభమును పొందుదుము.

**2. శ్రీరాముడు - మాంసాహారము :**

శ్రీరాముడు మాంసమును తినెడివారా? లేదా? అనునది అత్యంత వివాద విషయము. కొందరాయన క్షత్రియుడు కనుక మాంసమును తినుచుండె ననుచుందురు. కాని ఇది సరికాదని మా అభిప్రాయము. రామాయణములోని కొన్ని ఘట్టములను చూతము. శ్రీరాముడు వనవాసమునకు వెళ్ళుటకు ముందు తల్లి కౌసల్య అజ్ఞను దీసుకొనుటకై రాజభవనమునకు వచ్చినపుడు తల్లి ఆయనను కూర్చుండబెట్టి కొన్ని తినుభండారముల నిచ్చినది. అప్పుడు శ్రీరాముడు -

శ్లో॥ చతుర్దశ హి వర్షాణి వత్స్యామి విజనే వనే ।
మధుమూలఫలైర్ జీవన్ హిత్వా మునివదామిషమ్ ॥

(వా.రా. అయోధ్య. 20-29, 30)

"అమ్మా! నేనిప్పుడు ఘోరవనములలో 14 సంవత్సరములు నివసించుటకు వెళ్ళుచున్నాను. నేను ఆడంబరముతో కూడిన భోజనములను

వదలి మునులు భుజించు కందమూలములు, ఫలములు, తేనే మున్నగునవి భుజించుచునే నా జీవనమును గడుపుదును" అనెను.

ఈ శ్లోకములోని 'ఆమిష' శబ్ధమును చూచి మాంసమును భుజించువారు శ్రీరాముడు మాంసమును తినుచుండిరని, అందువలననే నేను ఆమిషను వదలి కందమూల, ఫలాదులతో జీవనము గడుపుదునని ఆయన చెప్పెనని అందురు. పై శ్లోకమునకు యిట్లే అర్థమును చెప్పినచో రామాయణములో ముందుముందు మాంసభక్షణను గూర్చి చెప్పబడిన శ్లోకములన్నియు ప్రక్షిప్తములు (తరువాత చేర్చబడినవి) గ చెప్పవలసి వచ్చును. సంపూర్ణ రామాయణములో రాజభవనములోని రాజపరివారములోని వారు మాంసాహారమును భుజించినట్లు ఎచ్చటా వర్ణనలేదు. కనుక ఈ శ్లోకముతోనే శ్రీరాముడు మాంసాహారి కాదని చెప్పవచ్చును.

శబ్దకోశములో 'ఆమిష' శబ్దమునకు ప్రియమైన లేక మనోహరమైన (నచ్చిన) వస్తువు అను అర్థముకూడ కలదు. కనుక నేను మధురమైన, ప్రీతికరమైన నాకు నచ్చిన వస్తువులను విడిచి మునులు తినెడు ఆహారమును భుజింతునని చెప్పిన పై శ్లోకమునకు సరియైన అర్థమగును. ఈ అర్థము సరియైనదై శ్రీరాముని భావనలకు అనుకూలముగ నుండును. ఇందుకు మరొక తిరుగులేని ప్రమాణమున్నది. పండిత భగవద్దత్ గారిచే సంపాదింపబడిన రామాయణ సంస్కృత వివరణములో ఈ శ్లోకమున్నది -

**శ్లో॥ 'స్వాదూని హిత్వా భోజ్యాని ఫలమూల కృతాశనః ॥'**

**(వా.రా. అయోధ్య 20-21)**

ఇచ్చట స్వాదు పదార్థములను విడిచి ఫలములు, కందమూలాదులను తినునట్లు వర్ణనగలదు. 'ఛిన్నే మూలే నైవ శాఖా న పత్రమ్।' వ్రేళ్ళునరికిన వృక్షమునకు కొమ్మలుగాని ఆకులుగాని ఉండనట్లుగ ఈ శ్లోకముతో మాంసభక్షణ ప్రసంగమే లేకుండా పోయినది.

రామాయణములో సీతాదేవి గంగానదికి కుండలతో కల్లును మాంసముతో కూడిన నైవేద్యము యిచ్చినట్లు వర్ణనగలదు. కాని ఈ ప్రసంగమును వామ మార్గీయులు (నాస్తికవాదులు) ప్రక్షిప్తముచేసిరి. ఇది

సీతాదేవి భావనలకు పూర్తిగా విరుద్ధమైనది. సీతాదేవి శ్రీరామునితో కలసి వనములకు వత్తునని ప్రార్థించుచు

శ్లో॥ 'ఫలమూలాశనా నిత్యం భవిష్యామి న సంశయః ।'

(వా.రా.అయోధ్య. 27-25)

'నేను వనములలో నుండు కందమూలములను ఫలములను తినుచు జీవించెదను. ఇందులో ఏమాత్రము సందేహము లేదు' అనును.

శ్లో॥ పిత్రా నియుక్తా భగవన్ ప్రవేక్ష్యామ స్తపోవనమ్ ।
ధర్మమేవ చరిష్యామ స్తత్ర మూల ఫలాశనాః ॥ (వా.రా. అయోధ్య 54-16)

శ్రీరాముడు భరద్వాజుని ఆశ్రమమును చేరినపుడు తన పరిచయము నిచ్చి తన వనవాసమును గూర్చి చెప్పి - 'భగవన్! మేము మా తండ్రిగారి ఆదేశానుసారము తపోవనమునకు వెళ్ళి అచ్చట ఫలమూలాదులను తినుచు ధర్మము నాచరించు చుందుము' అనెను. శ్రీరాముడు గుహునితో కూడ యిట్లనెను -

శ్లో॥ కుశచీరాజిన ధరం మూలఫలాశినం చ మామ్ ।
విద్ధి ప్రాణిహితం ధర్మే తాపసం వనగోచరమ్ ॥

(వా.రా. అయోధ్య 50-44, 45)

నేను నార చీరలు, మృగచర్మములను ధరింతును, ఫలములను కందమూలాదులను భుజింతును. నేను నా తండ్రిగారి ఆజ్ఞతో ధర్మమును పాలించుచు వనములలో చరించు తపస్విగ నన్ను భావింపుడు.

శ్రీరాముడు చేసిన రెండు ప్రతిజ్ఞలు ప్రసిద్ధమైనవి. ఒకటి తన తల్లి కైకేయీ ముందు ప్రకటించెను.

శ్లో॥ 'రామో ద్వి ర్నాభి భాషతే ।' (వా.రా. అయోధ్య. 18-30)
రాముడు రెండు మాటలాడడు. అన్నదానినే చేయును.
రెండవ ప్రతిజ్ఞ సీతాదేవి ముందు ఈవిధముగ చేసెను.

శ్లో॥ అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణమ్ ।
న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః ॥

(వా.రా. అరణ్య 10-19)

'నేను నా ప్రాణములు విడువవలసి వచ్చినా, లేక నిన్ను లక్ష్మణుని విడువవలసి వచ్చినా సరేకాని నా ప్రతిజ్ఞను మాత్రము విడువజాలను. ముఖ్యముగ బ్రాహ్మణుల ముందు చేసిన ప్రతిజ్ఞను విడువజాలను' అనెను.

శ్రీరాముడు కందమూల ఫలాదుల శాకములను భుజింతునను ప్రతిజ్ఞను కేవలము తన గృహములో తల్లిముందు చేయుటేగాక మరల మహర్షి భరద్వాజుని సమక్షమునకూడ తిరిగి ఆ ప్రతిజ్ఞను రెండవసారి చేయుటవలన ఆయన మాంసమును తినలేదనుట స్పష్టము.

వనముల కెళ్ళు సమయములో లక్ష్మణుడు తన రాకవలన ప్రయోజనమును చెప్పుచు -

శ్లో॥ ఆహరిష్యామి తే నిత్యం మూలాని చ ఫలాని చ ।
వన్యాని యాని చాన్యాని స్వాహార్హాణి తపస్వినామ్ ॥

(వా.రా. అయోధ్య 31-26)

'నేను మీకై కందమూలములు - ఫలములు తపస్వులు భుజించు శాకములు మున్నగు వస్తువులను నిత్యము తెచ్చుచుందును ' అనును.

ఈ విధముగ శ్రీరాముడు, సీతాదేవి, లక్ష్మణాదుల వచనములను చూచినవారు మాంసమును తినలేదని నిశ్చయముగ చెప్పవచ్చును. వారు మాంసమును భుజించినట్లుగ వర్ణనగలచోట ప్రసంగములు నిశ్చయముగ యితరులచే ప్రక్షిప్తములు చేయబడినవి.

### 3. మర్యాదాపురుషోత్తముడు శ్రీరాముడు

నేడు లక్షలాది సం॥లు గడచిన తరువాత కూడా మర్యాదాపురుషోత్తముడైన శ్రీరాముని వైదిక మర్యాదమయ పవిత్ర చరిత్ర ప్రజలకు ప్రేరణ నిచ్చుచు మార్గదర్శకముగ నున్నది. బాల్యమునుండి చివరివరకు ఆయన జీవనముపై దృష్టిని సారించిన ఎప్పుడూ ఆయన మర్యాదను ఉల్లంఘించినట్లు కనబడదు. విద్యార్థి జీవనములోగాని, గృహస్థ జీవనములోగాని, రాజ్యపాలనా కాలములో గాని, క్షత్రియునిగా, తండ్రి - కుమారుల ; పతి - పత్నులు ;రాజు - ప్రజలు ; యజమాని - సేవకుడు ; గురువు - శిష్యుడు గా గాని, సోదరునిగా గాని ఒక నియమబద్ధమైన ఆదర్శజీవనము గడపినందుననే

ఆయన నామమునకు ముందుగ, 'మర్యాదాపురుషోత్తముడను' విశేషణము చేర్చబడినది. అది ఆయన పవిత్ర ఉజ్జ్వల జీవితమును పరిచయము చేయును. ఈ బిరుదునేటి వరకూ ఏ మహాపురుషుడును పొందలేదు.

మనము అట్టి మహాపురుషుని చిత్రపటమును పూజించువారలముగ కాక ఆయన చరిత్రను పూజించువారము కావలయును. అంతట కర్మఠుడైన దిగ్విజయ చక్రవర్తి పేరున భిక్షను యాచించుట వారి మందిరముల రక్షణకై యాచించుట మున్నగు పనుల ద్వారా శ్రీరాముని భక్తులు ఆయన చిత్రమునే తప్ప చరిత్రను అనుసరించుటలేదని స్పష్టమగచున్నది.

**4. స్థితప్రజ్ఞుడు :**

శ్రీరాముడు స్థితప్రజ్ఞుడగుట వలన ఎంతటి కష్టసమయములోనైనా విచలితుడు కాకుండెను.

శ్లో ॥ న వనం గన్తు కామస్య . . . . . . . (వా.రా. అయోధ్యా. సర్గ 16)

శ్లో ॥ ఆహూతస్యాభిషేకాయ . . . . . . .

యువరాజుగ పట్టాభిషేకము జరుగునని సంతోషము గాని వనవాసమునకు వెళ్ళునపుడు విషాదఛాయలుగాని ఆయనలో కొంచెమైనా లేకుండెను. అట్లు సుఖ దుఃఖములలో సమానముగ నుండగలుగువ్యక్తి వేదవిజ్ఞుడు మరియు స్థితప్రజ్ఞుడై యుండవలయును.

**5. దేశభక్తుడు :**

సృష్ట్యాది నుండి నేటివరకూ ఎంతోమంది రాజులు జన్మించి రాజ్యపాలన చేసిరి. ఇకముందు కూడా జన్మింతురు. కాని ఆదర్శ పరిపాలన నొనర్చురాజుగ చెప్పవలసివచ్చినపుడు ప్రప్రథమముగ అగ్రగణ్యుడుగ శ్రీరాముని పేరు ఎంతో గౌరవపూర్వకముగ చెప్పవలయును. ఆయనకు ప్రజలపై గల ప్రేమ, ప్రజల భావములను ఆదరించుట, వారిని సమభావనతో తన సంతానమువలె సంరక్షించుట, ప్రజలను సుఖపెట్టుట, అసురులను (రాక్షస ప్రవృత్తిగల మానవులను) సంహరించి సజ్జనులను రక్షించుట మున్నగు గుణములు అందుకు ముఖ్యకారణములు. వీనిని అనుసరించినచో నేడుకూడా రామ రాజ్యమును చూడవచ్చును. శ్రీరాముని రాజ్యంలో సామ్రాజ్యవాదము మరియు

ప్రజాతంత్రములలోనుండు దోషములులేవు.

**6. పితృవాక్య పరిపాలకుడు :**

ప్రపంచ చరిత్రలో శ్రీరామునివంటి పితృభక్తుడు లభించుట దుర్లభము. ఆయన నిత్యము ప్రాతః సాయం సమయములలో తల్లిదండ్రులకు, సాదరముగా పాదాభివందనము చేసి వారి శుభాశీస్సులందుకొనుచుండెడివారు.

**శ్లో ॥ స ప్రాంజలి రభిప్రేత్య ప్రణతః పితురన్తికే ।**
**నామ స్వం శ్రావయన్ రామో వవన్దే చరణౌ పితు : ॥**

శ్రీరాముని పితృభక్తి ప్రపంచ ఇతిహాసములో ఒక అనుపమాన ఉదాహరణ. ఆయన తన జీవితములో తమ వంశపరంపరలు మర్యాదల నన్నింటిని చక్కగా తగినట్లు నిర్వహించెను. మర్యాదాపురుషోత్తముడైన శ్రీరాముడు మానవమాత్రులకు గర్వింపదగిన మహామానవుడు. ఆయన వాస్తవముగ మానవతకు ప్రతీక. ఆయన స్థాపించిన మానవతావిలువలను నేటి వరకూ ఎవరు మార్చజాలకపోయిరి. ఆయన పావన చరిత్ర కోట్లాదిమానవులకు ప్రేరణనిచ్చు మూలాధారమైనది. మానవ విలువలు నశించి పితృభక్తి క్షీణించుచున్నట్టి నేటి యుగములో శ్రీరాముని స్మరించు అవసరము పెరిగినది. ఆర్యసమాజము ఆయన చరిత్రను పూజించుటలో విశ్వసించును. ఆర్యసమాజ మొక్కటే శ్రీరాముని పావన చరిత్ర ద్వారా స్వయముగ ప్రేరణనొంది ఆయన చరిత్రను అనుకరించుటకై ఎల్లప్పుడు యితరులను ప్రేరేపించుచుండును.

**7. పితృభక్తి పరీక్ష :**

మహారాణి కైకేయీ దశరథ మహారాజును శ్రీరాముని వనములకు పంపవలెనని మొదటి వరమును, భరతునకు రాజ్యాభిషేకము చేసి యువరాజును చేయవలయునని రెండవ వరమును కోరినది. ఆసమయములో దశరథుని స్థితి చాలా దయనీయముగ నున్నది. ఏలయన ప్రాణప్రియుడైన శ్రీరాముని విడుచుకొనుటకు గాని, తానిచ్చిన వాగ్దానమును తప్పుటకు గాని ఆయనకు యిష్టము లేకుండెను. ఖిన్నుడైయున్న తండ్రి నోటినుండి ఎటువంటి మాట రాకుండుట చూచి శ్రీరాముడు కైకేయీతో అన్నమాటలు ఆయనకు గల దృఢమైన పితృభక్తిని తెలుపును. ఆయన ఇట్లనెను -

శ్లో॥ అహం హి వచనా ద్రాజ్ఞః పతేయమపి పావకే ॥
భక్షయేయం విషం తీక్ష్ణం పతేయమపి చార్ణవే ॥

నా తండ్రిగారు ఆదేశించినచో అగ్నిలో దూకుదును. భయంకరమైన విషమును తినగలను. సముద్రములో దూకగలను. మాతాకైకేయీ! తండ్రిగారి ఆజ్ఞను త్వరగా చెప్పుడు. అనును. దీనికన్న విషమ పరీక్షా సమయము - పుత్ర వాత్సల్యముతో మాతా కౌసల్య రాముని వనములకు వెళ్లవలదని అనుచూ ఓ రామ! నీ తల్లి ఆజ్ఞను పాలింపవా అనినపుడు ఎదురగును. ఆ సమయములో అయోధ్యలో రాజవిద్రోహమేర్పడు పరిస్థితులు ఏర్పడినవి. కాని నీతికోవిదుడైన శ్రీరాముడు తల్లిని శాంతపరచుచు యిట్లనును -

శ్లో ॥ నాస్తి శక్తిః పితుర్వాక్యం సమతిక్రమితుం మమ ।
తండ్రిగారి ఆజ్ఞనుల్లఘించుట నాకు సాధ్యముకాదు.

**8. సోదర వాత్సల్యము :**

శ్రీరామునిలోని పితృభక్తివలెనే భ్రాతృవాత్సల్యమును ఆదర్శవంతమైనదై అందరూ అనుసరింపదగినట్టిది. లోకమున తండ్రి ఆస్తిని పంచుకొనుటకై సోదరులు సర్వసాధారణముగ తగవులాడుకొనుచుందురు. రాజ్యాధికారము కొఱకై సోదరుల మధ్య రక్తపాతములతో కూడిన విప్లవములు జరిగినవి. కాని శ్రీరాముని జీవితములో రాజ్యాధికారము తుచ్ఛము. సోదర ప్రేమ అన్నింటికన్న మించినది. అందువలననే కుటిల ఆలోచనలతో మన్థర, మాత కైకేయీ రాజ కుటుంబములో రాజ ద్రోహమునకు నాటిన విషబీజములు కాలాంతరమున కలిగించు దుష్పరిణామములను దూరమొనర్చుటలో శ్రీరామునిలోగల భ్రాతృప్రేమ భావమే సహాయపడినది. 'సనోబన్ధుః' అనువేదమంత్రములో పరమేశ్వరుడు కూడా సోదరునివలె సుఖముల నిచ్చువానిగ చెప్పబడినది.

**9. ప్రతిజ్ఞాశీలి :**

'ప్రాణములు పోయినా మాట తప్పరాదనుట' సూర్యవంశరాజుల నియమము. హరిశ్చంద్రుడు తన మాటను నిలుపుకొనుటకై రాజ్యమునువదలి చండాలుని వద్ద పనిచేయవలసి వచ్చినది. శ్రీరాముడు కూడ తన జీవితములో ఆడిన మాటను తప్పలేదు. గురువులు, ఋషి మునులను

వెంటబెట్టుకొని శ్రీరాముని తిరిగి తీసుకొని వెళ్ళుటకై చిత్రకూట పర్వతమునకు భరతుడు వచ్చినపుడు ఆయన యిచ్చిన సమాధానము ప్రపంచచరిత్రలో అద్వితీయమైనది. 'లక్ష్మిచంద్రుని, హిమము (మంచు) హిమాలయమును విడిచినను, సముద్రము తన హద్దులను దాటినను నేను నా తండ్రి గారి వద్ద చేసిన ప్రతిజ్ఞను దాటలేను. నేను నా ప్రాణములను, సోదరులను, భార్యను విడువగలను గాని, చేసిన ప్రతిజ్ఞను మాత్రము వీడజాల' ననెను. కాని నేడారాముని వంశమున జన్మించిన వారి స్థితి విపరీతముగ నున్నది. తండ్రి - కుమారుని, సోదరుడు - సోదరుని, పుత్రుడు - మాతను, అన్న - చెల్లెలును, పిన్నలు - పెద్దవారిని ఒకరినొకరు విశ్వసింపలేకున్నారు. ఒకరిమాటలపై మరొకరికి నమ్మకమే లేదు. ఇట్టి అవిశ్వాసము కారణముగనే ప్రతియింటిలో ప్రతిఒక్కరు తమ తమ గదులకు వేర్వేరుగ తాళములను వేసుకొనుచుందురు. ఐనా ఖరీదైన వస్తువులు సువర్ణాభరణాదులు ఇంటిలో నుంచక బ్యాంకులలోని లాకర్లలో నుంచుచున్నారు ! అంతా అవిశ్వాసమువలన ఏర్పడిన దుఃఖ దావాగ్నికి బలియగుచు రక్షణకై తల్లడిల్లుచున్నారు.

**10. ఆదర్శ విద్వాంసుడు :**

శ్రీరాముడు వేదవేదాంగములలో విద్వాంసుడు. బాలకాండ - 18 సర్గలో ఆయనను గూర్చి

**'సర్వే వేద విదః శూరాః సర్వేలోక హితే రతా : అని చెప్పబడినది.**

**శ్లో॥ సమ్యగ్ విద్యావ్రతస్నాతో యథావత్ సాంగవేద విద్ । (2-27)**

సీతాదేవి లంకలోనున్నపుడు తన వద్దకు వచ్చిన హనుమంతుని పరీక్షించుటకై - నీవు నిజముగ రాముని దూతవైనచో రాముని గుణములను వివరింపుమనగా -

**శ్లో॥ యజుర్వేదే వినీతశ్చ వేదవిద్భిః సుపూజిత : ।**
**ధనుర్వేదేచ వేదేచ వేదాంగేషుచ నిష్ఠితః ॥ (సుందరకాండ 35-14)**

యజుర్వేదములో ప్రావీణ్యత గలిగి, వైదికవిద్వాంసులచే

సత్కరింపబడు వాడు ; ధనుర్వేదము, వేదవేదాంగములలో ప్రవీణత గలవాడుగ రాముని, హనుమంతుడు వర్ణించెను. ఆయన కేవలము వేదముల నధ్యయన మొనర్చుటే గాక వాని ఉపదేశములను జీవితములో పాటించువాడు. ఈ వేద జ్ఞానమే ఆయననొక ఆదర్శపురుషునిగ ప్రపంచఖ్యాతి పొందుటకు దోహదపడినది. శ్రవణము, మననము, నిధి ధ్యాసనము, సాక్షాత్కారములను సోపానములనధిరోహించువాడే ఆదర్శవిద్వాంసుడు. రాముడటువంటివాడు.

**11. ఆదర్శ పుత్రుడు :**

శ్రీరాముడు తన ముప్వరు తల్లులను సమానముగా గౌరవించెడివాడు. మన్థర కైకేయితో రాముని రాజ్యాభిషేకమును గూర్చి తెలిపినపుడు ఆమె అత్యంత సంతోషముతో —

శ్లో॥ యథామే భరతో మాన్యస్తథా . . . . . (అయోధ్య 8-18)

నాకు భరతుని కంటె రాముడు అధిక ప్రియుడు. ఏలయన అతడు కౌసల్యకంటె నాకధికసేవ చేయును. అనును. రాముడు చిత్రకూటమున నుండగా ఆయనను తీసుకొని వచ్చుటకై భరతుడు వెళ్ళగా రాముడు మాటలలో కౌసల్య, సుమిత్ర, కైకేయిాల క్షేమమును ముందుగనే అడుగును.

ఏ తల్లి కారణముగా రాజ్య సింహాసనమును అధిష్ఠించుటకు బదులుగా 14 సం॥రంలు వనవాసము చేయవలసి వచ్చెనో ఆమె క్షేమమును కూడా అడుగునట్టి రాముడెంతటి ఆదర్శపుత్రుడు !

**12. ఆదర్శ పతి :**

భారతీయ సంస్కృతికి రాముడాదర్శ పురుషుడు. సీతాదేవి రామునితో వనములకు బయలుదేరినపుడు ఆమెతో రాముడన్న మాటలాయన ఆదర్శపతిగ తెలియజేయును.

శ్లో॥ **న దేవి తవ దుఃఖేన స్వర్గమప్యభిరోచయే ॥ (30-27)**

**నే దానీం త్వదృతే సీతే స్వర్గో ऽ పి మమ రోచతే ॥ (30-42)**

ఓ సీతాదేవి ! నీకు వనవాసమునకంటె యిచ్చట అధిక దుఃఖము కలిగించినచో నీకు దుఃఖమును కలిగించు స్వర్గము కూడా నాకు యిష్టముండదు. నీవులేని స్వర్గము కూడా నాకు సుఖమునివ్వదు.

అశోకవనమున సీతాదేవి రామలక్ష్మణుల క్షేమమును గూర్చి అడిగినపుడు హనుమంతుడు ఆమెతో -

శ్లో॥ అనిద్ర ః సతతం రామః సుప్తో z పిచ నరోత్తమ ః ।
సీతేతి మధురాం వాణీం వ్యాహరన్ ప్రతి బుధ్యతే ॥ (36-44)

ఓ దేవీ ! మీ వియోగమువలన రాముడు నిద్రించుట లేదు. ఎప్పుడైనా కొద్ది సమయము నిద్రించినా సీతా, సీతా అంటూ మేల్కొనును. అనును. రామునకు పత్నిపైగల ఆదర్శప్రేమ - 'చక్రవాకేవ దంపతీ' (అథర్వ 14-2-64) అను వేదవాక్యమునకు సాక్షాత్ ప్రత్యక్ష నిదర్శనము. 'సమాపో హృదయాని వః ' మా యిరువురి హృదయములు ప్రశాన్తముగ కలిసి యుండునుగాక ! అను (వధూవరుల ) వాక్యమునకు ప్రత్యక్ష ఉదాహరణము.

**13. ఆదర్శమిత్రుడు :**

రాముని స్నేహము కూడ ఆదర్శవంతమైనదే. సుగ్రీవుని మిత్రునిగ చేసుకొని కిష్కింధకు అతనినే రాజుగ చేసెను. శరణుజొచ్చిన విభీషణుని లంకకు రాజుగ చేసెను. ఆయనకు స్నేహితులకు యివ్వవలయుననే గాని వారినుండి తీసుకొనవలయునని యుండదు.

**14. ఈశ్వరభక్తుడు :**

విశ్వామిత్ర ఋషితో రామలక్ష్మణులు యాగ రక్షణకై వెళ్ళునపుడు ప్రాతః కాల సమయమున ఋషి -

శ్లో॥ కౌసల్యా సుప్రజా రామ.... (బాల 13-3)

కౌసల్య సుపుత్రుడవైన ఓ రామ ! ప్రాతః కాలమైనది. నర శ్రేష్ఠ, లేచి సంధ్యాది దినచర్యను అనుష్ఠింపుము. అనిన ఋషి పవిత్ర వాక్కును విని వారిరువురు సోదరులు స్నాన సంధ్యాది జపములనొనర్చిరి.

శ్లో ॥ తస్యర్షే ః పరమోదారం . . . . . (బాల 23-3)

మిథిలానగరమునకు వెళ్ళు సమయమున వారిరువురు సంధ్యాగ్ని హోత్రాదులు గాయత్రీ జపమును చేసిరి.

**15. శరణాగత పాలకుడు :**

విభీషణుడు రాముని వద్దకు వచ్చినపుడు అతనిని సందేహించుట

స్వాభావికమే. అతడు తన శత్రువునకు సోదరుడు. విభీషణుని విషయములో మీ అభిప్రాయమేమని అడిగినపుడు ఆయన యిట్లనెను. స్నేహముతో వచ్చిన వారినెప్పుడును నేను త్యజింపజాలను. ఈయనలో దోషములున్నప్పటికిని శరణాగతుని (శరణుకోరినవారిని) విడిచిపెట్టు సత్పురుషులు నిందింప దగిన వారగుదురు. ఓ సుగ్రీవ, ఒకసారి వచ్చి నేను మీ వాడను, అన్నవారెవరికైనా అభయహస్తము నొసంగుట నా వ్రతము. అతనిని తీసుకొనిరా. అభయమొసంగుము. విభీషణుడే కాదు - అతడు రావణుడైనా సరే. అనును.

**16. ధర్మమునకు ప్రతిరూపము :**

అయోధ్యానరేశుడైన రాముని ప్రథమ పరిచయమును గూర్చి ఆదికవి వాల్మీకి అడిగినపుడు -

'జ్ఞాతుమేవం విధం నరమ్' అను వాక్యమును బట్టి ఆయన రచించిన చరిత్రలోని రాముడొక మనుష్యుడే యని తెలియుచున్నది. భగవంతుని అవతారము కాదు. వాల్మీకి ప్రశ్నకు నారదుడిచ్చిన జవాబులో కూడ 'నర' శబ్దమునే ఆయన వాడెను.

'మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్తః శ్రూయతాం, నర ః।

నేను మీరు అడిగినటువంటి నరుని గూర్చియే నిశ్చయముగ చెప్పుదును వినుడు. ...................

రాముడు శ్రీతో కూడినవాడు. శత్రువినాశకుడు. సమస్త ప్రాణుల రక్షకుడు. ధర్మ రక్షకుడు. ఆశ్రయించినవారికి అభయమొసంగువాడు. ఆయన వేదములను వ్యాకరణాది వేదాంగములలోని తత్త్వములను చక్కగా హృదయంగమము చేసుకొని ధనుర్విద్యలో నిష్ణాతుడు. శాస్త్రముల తత్త్వములన్నింటి నెరిగిన అద్భుతమైన స్మృతి ప్రతిభల ధని. అటువంటి సర్వలోక ప్రియుడు, సాధు స్వభావము కలవాడు, ఎల్లప్పుడు దీనతకు దూరముగా నుండు శ్రీరాముని గూర్చి సంక్షిప్తముగ తెలుపవలెనన్న ఆయన ఆదర్శములకు ప్రతీక వంటివాడు.

ధైర్యములో హిమాలయముతో సమానుడు. సముద్రముతో సమాన గంభీరుడు. బలములో విష్ణుసమానుడు. చంద్రుని వంటి ప్రియదర్శనుడైన

రాముడు పుష్పమువలె కోమల స్వభావము గలిగియు వజ్రముతో సమానముగ కఠోరస్వభావుడు. శత్రువులపై కోపించినపుడు ఆయన క్రోధము కాలాగ్నివలె కనుపించును. ఆయన ఓర్పునకు కూడా హద్దులేదు. అన్నింటిని సహించు భూమివలె సహనశీలుడు. దానగుణములో కుబేరునితో సమానుడు. ఈ విధముగ రాముని గుణగణములను వర్ణించిన తరువాత రామాయణ సంపూర్ణ కథను సారరూపములో నారదుడు వాల్మీకికి వినిపించెను.

ఈ విధముగ దశరథ మహారాజు పుత్రుడైన రాముని గూర్చి విపులముగ తెలుసుకొనిన వాల్మీకి మహర్షి గంగానదికి సమీపముననున్న తమసానది ఒడ్డున తిరుగాడు చుండగా ఒక వేటగాడు క్రౌంచపక్షి జంటలోని మగ పక్షిని నిర్దాక్షిణ్యముగ చంపుటను చూచుట తటస్థించినది. వేటగాని బాణముతో చంపబడిన పక్షియొక్క ఆడ క్రౌంచపక్షి ఎంతో దీన స్వరముతో విలపించుటను చూచిన సమయమున పరమకరుణా హృదయుడైన మహర్షి వాల్మీకి నోటినుండి అకస్మికముగ వెలువడిన ఈ క్రింది శ్లోకముతో ఈ రామాయణము మానవునిచే నిర్మింపబడిన ప్రథమ కావ్యముగ కీర్తింపబడుచున్నది.

శ్లో ॥ **మానిషాద ప్రతిష్ఠాం త్వమగమ : శాశ్వతీ : సమా : ।**
**యత్ క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్ ॥**

వాల్మీకి నోటి నుండి వెలువడిన ఈ శ్లోకము స్వయముగ నాలుగు పాదములు కలిగి సమాక్షరములతో తంతులతో కూడిన లయలు గలిగిన ఈ విచిత్ర శబ్ద రచనతో పరమాశ్చర్యము నొంది తానే స్వయముగ యిట్లు తెలియ జేసెను.

**"శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా" ।**

శోకభావముతో నిండిన హృదయముతోనే శ్లోక రూప కావ్యము ఉత్పన్నమైనది. (రచింపబడినది) కరుణారస స్థిరరూపమే శ్లోకము. ఈ విధముగ మహర్షి హృదయములోని కరుణభావము శ్లోక రూపములో బహిర్గతమై ఛందోబద్ధముగ రామాయణ కావ్యమును రచించుటకు కవికి ప్రేరణ లభించినది. ఈ భూమిపై పర్వతములు తమ శిఖరములు పైకి ఎత్తి ఉంచి నిలబడియుండు వరకు, నదులు గలగల ధ్వనులతో పారుచుండువరకు,

అర్యుల ఆదర్శ చరిత్రకు చరమ రూపమగుట వలన రామాయణ కావ్యము ప్రపంచమున వ్యాపించుచుండును.

శ్లో॥ యావత్ స్థాస్యన్తి గిరయ ః సరితశ్చ మహీతలే ।
తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి ॥

17. ఆర్యసంస్కృతికి ప్రతీక :

హిమాలయములనుండి వింధ్యాచలము వరకు గంగానది నుండి కావేరి వరకు అంతటా రామనామమే మారు మ్రోగుచుండును. పంజాబు సింధు కన్యాకుమారి రామేశ్వరముల వరకు తూర్పు పశ్చిమోత్తర దక్షిణముల ఏ ప్రదేశమునకు పోయినా అంతటా రాముని గూర్చిన స్మృతులు నిండి యున్నవి. నేటి పాకిస్థాన్‌లో నున్న తక్షశిల, లవపుర (లాహోర్) కుశపుర (కసూర్) లు మర్యాదాపురుషోత్తమ శ్రీరాముని అయన వంశజుల స్మారకములు.

కవులు, మహాత్ములు రామకథను సంప్రదాయమునకు చెందినదిగ కాకుండ చేయుటవలన బౌద్ధులు, జైనులు కూడా రామకథను గానము చేయుచున్నారు. గోండులు, భిల్లులు మున్నగు శిక్షిత, అశిక్షిత వర్గములవారు కూడా రామకథను గానము చేయుదురు. స్యామ, అనామ, జావా, కంబోడియా, ఇండోనేషియా, మలయాసియా దేశాలలో కూడా రామకథ ప్రాకినది. మెక్సికోలో రామ - సీతల పేర్లతో ఉత్సవములు ఊరేగింపులు జరుపుచుందురు. మిశ్ర దేశపు రాజులు రాముని పేర్లు పెట్టుకుందురు. బాంకాక్‌లో రామాయణముపై సమ్మేళనములు జరుగుచుండును. మారిషస్‌లో తులసీ రామాయణ గుటికా (లఘు పుస్తకము)లను ఒక లక్ష ప్రతులు ఇంటింటా పంచబడినవి. ఈ విధముగా మరే చారిత్రక మహాపురుషుడు ఇంత విస్తృత ఖ్యాతిని పొందియుండి యుండక పోవచ్చును.

మర్యాదాపురుషోత్తమ శ్రీరాముని కాలమున మూడు సంస్కృతులు స్పష్టముగ కనబడును. 1. ఆర్యసంస్కృతి 2. వానర సంస్కృతి 3. రాక్షస సంస్కృతి. సృష్ట్యారంభమున ఒకే మానవ వంశము ఉండియుండ వచ్చును.కాని తరువాత కాల ప్రవాహములో అచార - విచారములు, జీవన విధానములలో

మార్పులు కలుగుచు వారు వేర్వేరు సంస్కృతులను పోషించు వారుగ విభజింపబడిరి. ఈ మూడు సంస్కృతులు వైదిక ధర్మములోనివే. వారిలో వేదములను అధ్యయనము చేయు పరంపర గలదు. ఈ మూడు సంస్కృతులకు మూడు ముఖ్య కేంద్రములు గలవు. ఆర్యసంస్కృతికి అయోధ్య కేంద్రము. వానర సంస్కృతికి కిష్కింధ కేంద్రము. రాక్షస సంస్కృతికి కేంద్రము లంక. వానరులకు 'తోక' మున్నగునవి పౌరాణికులు కల్పించినవే. వానరులు కూడా అయోధ్యా వాసులైన ఆర్యుల వంటి మానవులే. వానరులనగా కోతులని గాక వనములందు నివసించువారలని అర్థము. వారు అడవులలో కొండలమీద నివసించెడు 'అడవి' జాతుల వారు. పాశ్చాత్య రచయితలను అనుకరించుచు మనము తెలియక భ్రమతో వారిని 'ఆదివాసులని' పిలుచుచున్నాము. కాని వారిని వనవాసులు లేక గిరిజనుల'ని పిలచుట సరియైనది. 'వనవాసి' లేక 'వానర' శబ్దములకు అర్థమొక్కటే. వానరులు కోతులు కానట్లే రాక్షసులు కూడా 'మానవేతరులు' కారు. వారు కూడా అయోధ్యావాసులైన ఆర్యులవంటి సామాన్య మనుష్యులే. వీరి ముప్వురి సంస్కృతులులో భేదముండెడిది.

భౌతిక వస్తువులు సమృద్ధిగా లభించుటలో కిష్కింధకాని, లంకకాని అయోధ్యకంటె తక్కువ కాదని వాల్మీకి రామాయణకథ ద్వారా తెలియుచున్నది. భౌతిక సంపదల కారణముగనే లంకకు 'శ్రీలంక' (బంగారులంక) యని పేరు వచ్చెను. భౌతిక సంపదలలోగాక, ఆచార - విచారములలోను సంస్కృతిలోను స్పష్టమైన తేడాగలదు. వానర రాక్షసులు మదిరా పానము చేయువారు. కాని అయోధ్యలో మదిరపానమును గూర్చిన వర్ణన కనబడదు. వాలి, సుగ్రీవుల మధ్య అన్నదమ్ములలో కలహము వానర సంస్కృతికి ప్రతీకగనే చెప్పవచ్చును. అయోధ్యలో ఇటువంటి అన్నదమ్ముల మధ్య వైరమును ఊహింపలేము. సుగ్రీవుని పత్నిని వాలి అపహరించుట, వాలి మరణము తరువాత అతని పత్ని తారను సుగ్రీవుడు వరించుట వానర సంస్కృతిలోని విశేషణములే కాని ఆర్య సంస్కృతిలోనివి కావు. ఇక రాక్షసుల విషయమాలోచించిన వారు పూర్తిగా విషయలంపటులే. రావణ - విభీషణుల కలహము కూడ అన్నదమ్ముల

మధ్య కలహముగ వారిలో కూడ కనబడుచున్నది. రావణుడు అనేకమంది పరస్త్రీలను అపహరించిన ఘటనలనేకములు రామాయణమున గలవు.

ఈ మూడు రాజ్యములలో రాజశాసన పద్ధతి ఉండెను. మూడు చోట్ల మంత్రి పరిషత్తులు కలవు. కాని రావణుడు తన మంత్రి పరిషత్తు సలహాలను పాటింపక స్వేచ్ఛా చారిగ వర్తించుచుండెను. ఇందు మూలముగనే విభీషణుడు వేరు కావలసి వచ్చినది. వేదాధ్యయనముతో పాటు బ్రాహ్మణులుకూడా కిష్కింధలోనూ, లంకలోను ఉండిరి. ఆర్యేతర సంస్కృతులలో ఆశ్రమముల పరంపరలేదు. ఇదే ఆర్య, వానర, రాక్షస సంస్కృతులలోని పెద్ద తేడా. ఆర్య రాజ్యములలో అంతటా ఋషులు, ఆశ్రమములు కలవు. వానిలో వేదాధ్యయనముతో పాటు ఆర్యసంస్కృతి వ్యాప్తికొరకు ఆలోచనలు జరుపబడుచుండెను. తపస్సు స్వాధ్యాయములలో నిరంతరము గడపుచు ఋషులు యజ్ఞ - యాగముల నొనర్చు చుండగా వారి యాగములకు విఘ్నములు (ఆటంకములు) కలిగించుటే తమ గొప్పతనముగా రాక్షసులు తలంచుచుండిరి. ఆర్యులు స్వభావసిద్ధముగ అహింసా ప్రియులు. కాని రాక్షసుల అకృత్యముల కారణముగ చివరకు ఋషులే స్వయముగా అయోధ్యకు చెందిన ఆర్యరాజ్య రాజకుమారుని శస్త్రములను గ్రహించి లంకను జయించుటకై (ప్రణాళిక) కార్యక్రమమును చేపట్టవలసినదిగ ప్రేరేపింతురు.

ఈ విధముగ వానర రాక్షస సంస్కృతులతో ఆర్యసంస్కృతిలోని విశేషతను పోల్చిచూచినచో ఆర్యులు తపస్సు, త్యాగము, వైదిక పద్ధతుల ననుసరించి వర్ణాశ్రమముల మర్యాదలను పాలించుచు జీవితమును నిరంతరము ఉన్నతిని పొందుచు ఆదర్శవంతమైనదిగ చేసుకొనుటకు ప్రయత్నించుచుండిరనియు, వానర రాక్షసుల జీవితములలో అట్టివైదిక ఆదర్శములు లేకుండెనని సారాంశము తెలియును. రాక్షసులు తిను - త్రాగు - అనుభవించు అనునట్టి భోగవాదమునకు చిహ్నముకాగా ఆర్యులు త్యాగవాదమునకు చెందినవారు. వానర సంస్కృతి ఈ రెండింటికి మధ్యనున్న సంస్కృతి.

ఆర్యుల త్యాగవాదములో మర్యాదతో కూడిన హద్దుమీరని భోగవాదమున్నది. జీవితములో ధర్మముతో అర్థములను కామములను

భోగించుచు మోక్షము సంపాదించుటకై ప్రయత్నము కనిపించును. రాక్షసుల భోగవాదము మర్యాదలేనిది. (హద్దుమీరినది) దానిలో త్యాగవాదము కొంచెమైనా లేదు. వారు హింసామార్గముతో తమ రాజ్యమును విస్తరింపజేసుకొన యత్నింతురు. ఆర్యసంస్కృతిని అనుసరించువారు అహింసా ఆయుధము విఫలమైనపుడే హింసను ఆశ్రయించి దుష్టులను దండించి విడిచిపెట్టుదురు. రాక్షస సంస్కృతి హింసతో కూడినదికాగా ఆర్య సంస్కృతి అహింసతోకూడిన యజ్ఞములను ప్రోత్సహించును. వానరసంస్కృతి నవలంభించువారు ఆర్య సంస్కృతి వైపు ఆకర్షితులగుచున్నను ఆర్యుల ఉపేక్ష కారణముగ వారు ఉన్నత ఆదర్శములతో నైతిక విలువలతో కూడిన ఆర్యసంస్కృతిని పాటింపజాలకున్నారు.

ప్రథమముగ రాముడు వారికి సహకారమునందించుట వలన వారు సంతోషముగ రాక్షసులతో యుద్ధముచేయుటకు ఆర్యులకు సహకరించిరి. నేడు కూడ అటవీతెగలవారు ఆర్యులచే ఉపేక్షింపబడుచున్నారు. వారు ఆర్యుల స్నేహసహకారమును కోరుచుందురు. కాని ఆర్యులు వారిపై ధ్యానముంచక రాక్షసులవైపు పయనించుచున్నారు. రాక్షస సంస్కృతిపై విజయమును సాధించుటకై ఆర్యులకు, అటవీ తెగలవారితో కలయిక అవసరము. ఈ కార్యములో ఆర్యులే ముందుకు రావలయును. శ్రీరాముడు వారికి మార్గమును చూపెను. ఆ మార్గము ననుసరించినచో ఆర్య సంస్కృతికి విజయము చేకూరును. విజయము వైపుగ పయనించు ఆ ఆర్యసంస్కృతికి చిహ్నము శ్రీరాముడు.

**18. శ్రీరాముడు రావణుని విజయదశమినాడు వధించెనా ?**

శ్రీరాముడు రావణుని వధించి విజయమును పొందుటకు - విజయదశమి పర్వమునకు ఎట్టి సంబంధమును లేదని మహర్షి వాల్మీకిచే రచింపబడిన రామాయణ కావ్యమును పరిశీలించిన తెలియును. లోకములో జరుగుచున్న రామలీలలతో సామాన్య ప్రజల మనస్సులలో విజయదశమి నాడే రావణుని శ్రీరాముడు వధించెనను భ్రమ వ్యాపించినది. ఈ భ్రమను తొలగించుటకై సీతాపహరణము మొదలు రావణుని వధించువరకు జరిగిన

ఘట్టము లన్నింటిని పరిశీలించుట అవసరము.

వృందయను పేరుగల ముహూర్తములో మాఘమాస కృష్ణపక్ష అష్టమినాడు రామలక్ష్మణులులేని సమయమున రావణుడు సీతాదేవిని అపహరించెనని స్కంధ పురాణ బ్రహ్మ ఖండములో నున్నది. ఒప్పందము ప్రకారము శ్రీరాముడు వాలిని చంపిన తరువాత సుగ్రీవుడు కిష్కింధకు రాజయ్యెను. అది వర్షఋతువులోని శ్రావణమాసారంభము. వర్ష, శరదృతువులలోని శ్రావణ, భాద్రపద, ఆశ్వియుజ, కార్తీక మాసములు నాల్గింటికి చాతుర్మాస్యమని పేరు. ఈ నాలుగు మాసముల తరువాత సీతాదేవిని వెదుకుటకు శ్రీరాముడు సుగ్రీవునకు ఆదేశము నిచ్చెను. అందువలన ఆశ్వియుజ దశమినాడు రావణుని వధ జరుగలేదు.

నాలుగు మాసముల గడువు తరువాత శ్రీరాముని హెచ్చరికతో సుగ్రీవుడు తన సైన్యమును సేనాధిపతులను పిలచి సీతాదేవిని వెదకుటకై ఒక మాసము గడువునిచ్చి, ఈ గడువును అతిక్రమించినవారికి మరణ దండన విధింపబడునని హెచ్చరించి వారిని నలుదిశలకు పంపెను.

హనుమంతుడు అంగదుడు మున్నగువానరవీరులు దక్షిణదిశగా వెళ్ళి సీతాదేవిని వెదకుచు ఒక మాసము గడచిన తరువాత అనగా మార్గశిర మాసములో జటాయువు సోదరుడు సంపాతియిచ్చిన సమాచారముతో హనుమంతుడు లంకలో ప్రవేశించును. స్కందపురాణములోని బ్రహ్మఖండము 3 అ. 30 ననుసరించి హనుమంతుడు అశోకవనములోని అశోక వృక్షముపై ద్వాదశిరోజున దాగుకొని కూర్చుండెను. అక్షయుడు మరియు యితర రాక్షసులతో త్రయోదశినాడు యుద్ధము జరిగినది. చతుర్దశినాడు మేఘనాధుడు బ్రహ్మాస్త్రముతో హనుమంతుని బంధించెను.

శ్రీరాముని సందేశమును విన్న సీతాదేవి హనుమంతునితో - హే హనుమాన్ ! నిర్దయుడైన రావణుడు నాకిక్కడ ఒక సం॥ర గడువు యిచ్చెను. ఇప్పుడు పదవ మాసము జరుగుచున్నది. ఇక రెండు మాసములే యున్నవి. శ్రీరాముని అతి శీఘ్రముగ ఇచ్చటకు రావలయునని చెప్పుమనెను. పైన చెప్పినట్లుగా సీతాదేవి హరణము మాఘమాసములో జరిగినచో తరువాత

10 నెలలకు మార్గశిర మాసమగును. పద్మపురాణములో (పాతాళ ఖం. అ 36) కూడా యిదే విధముగనున్నది.

రావణుని వధ తరువాత శ్రీరాముడు అయోధ్యకు విమానములో బయలుదేరి భరద్వాజుని ఆశ్రమమునకు చేరినట్లుగ రామాయణమున కలదు.

శ్లో ॥ పూర్ణే చతుర్దశ వర్షే పంచమ్యాం లక్ష్మణాగ్రజః ।
భారద్వాజాశ్రమం ప్రాప్య వవన్దే నియతో మునిమ్ ॥
(వా.రా. యుద్ధ 127 సర్గ)

శ్లో॥ చైత్రః శ్రీమానయం మాసః పుణ్యః పుష్పిత కాననః ।
యౌవ రాజస్య రామస్య సర్వమేవోపకల్ప్యతామ్ ॥
(అయోధ్య సర్గ 3. శ్లో. 4)

శ్రీరాముని రాజ్యాభిషేక మాసము చైత్రము. అదే మాసమున రాముడు వనవాసమునకు వెళ్ళెను. కనుక 14 సం॥రముల వనవాస సమాప్తి కూడా చైత్రమాసములోనే సంభవమగును. భారద్వాజుని ఆశ్రమమునకు శ్రీరాముడు వెళ్ళినది కూడా చైత్ర శుక్ల పంచమినాడే. ఈ విధముగ రావణుని వధ ఆశ్వీయుజ దశమి రోజున గాక చైత్ర బహుళ చతుర్దశినాడు, అన్త్యేష్టి అమావాస్యనాడు జరిగినది.

**(పురాణములలో అమావాస్యతో మాసము పూర్తగును. వాల్మీకి రామాయణములోని మాసములు పౌర్ణమితో పూర్తగును.)**

**19. హనుమంతుడు కోతా ?**

రామాయణములో శ్రీరామునివలె వీరహనుమంతుని చరిత్ర కూడ మహత్త్వపూర్ణమైనది. మొదటిసారిగ హనుమంతుని విద్వత్తును గూర్చి ప్రశంసించుచు లక్ష్మణునితో యిట్లనును. (కిష్కింధా 3 సర్గ)

ఓ లక్ష్మణ! ఋక్, యజు, సామ వేదములను అధ్యయనము చేయని వ్యక్తి ఈ విధముగ సంస్కృత భాషను మాట్లాడలేదు. ఇతడు తప్పక సంపూర్ణ వ్యాకరణమును కూడా చదివెను. ఏలయన ఈయన మాటలలో ఎక్కడా ఒక్క శబ్దముకూడ వ్యాకరణ రీత్యా అశుద్ధమైనది లేదు. అనెను. అటువంటి వేదవేదాంగములలో మహా విద్వాంసుడైన వీరహనుమంతుని కోతిగ నెంచువారు

శ్రీరాముని వచనములను గుర్తింపవలయును. కోతి ఎన్నడైన వేదములను చదివి శుద్ధ ఉచ్ఛారణతో మాట్లాడగలదా ?

హనుమంతుడు సుగ్రీవుని మంత్రి. ఈరోజులలో అధికారులగుటకు I.A.S. పరీక్షలలో ఉత్తీర్ణులగుట అవసరమైనట్లే ప్రాచీనకాలములో కూడా రాచకార్యములను నిర్వర్తించువారి అర్హతలను గూర్చి మనుస్మృతిలో యిట్లు గలదు.

**'మౌలాన్ శాస్త్రవిదః శూరాన్ లబ్ధ లక్షాన్ కులోద్గతాన్' (మను 7-54)**

మంత్రిపదవి నలంకరించుటకు -

1) స్వదేశములో జన్మించినవారై యుండవలయును.
2) వేద శాస్త్రములలో విద్వాంసుడు
3) శూర వీరుడు
4) తన లక్ష్యము, ఆలోచనలు వ్యర్థము కాని వారు
5) గొప్ప వంశములో పుట్టినవారై యుండవలయును.

దీనివలన కూడా మంత్రికి ఉండవలసిన అన్ని గుణములు కల హనుమంతుడు కోతియగుట సంభవము కాదని తెలియుచున్నది.

వీర హనుమంతుడు లంకానగరమున సీతాదేవిని వెదకుచు రావణుని అంతఃపురములో ప్రవేశించి ఎవరకూ కనబడకుండా అంతటా తిరిగి వచ్చెను.

**శ్లో॥ చతురంగుళ మాత్రో z పి నావకాశః స విద్యతే ।**
**రావణాన్తపురే తస్మిన్ యం కపిర్న జగామ స ః ॥ (సుందర. 12 సర్గ)**

నాలుగు అంగుళములు స్థలము కూడా ఖాళీలేని ఆ అంతఃపురములో కాపలావారికి తెలియకుండా హనుమంతుడు ప్రవేశించుటనుబట్టి ఆయన యోగ సిద్ధిని పొందినవారని తెలియనగును. యోగదర్శనములో పతంజలి ఋషి **'కాయాకాశయోః సంబంధ సంయమాత్ లఘుతూల సమాపత్తేశ్చ ఆకాశగమనమ్ ॥ (యోగ. 3-41)**

శరీరమునకు ఆకాశముతో గల సంబంధమును సంయమముతో ఏర్పరచుకొనుటవలన శరీరముదూదివలె తేలికయగునని చెప్పబడినది. ఇది యోగులు సాధనచే పొందు అష్ట సిద్ధులలో ఒకటి. ఇది కోతికి సాధ్యమా ?

రామాయణములోని వానరమున్నగు శబ్దములకు అర్థమేమి అను విషయముపై పూర్తి పరిశోధన జరుగవలయును. లోకములో వాడబడు శబ్దముల సమానత వలననే భ్రాంతులు కలుగుచున్నట్లుగ తెలియుచున్నది. ఉదాహరణకు జనకుని పుత్రికపేరు సీత, సంస్కృత భాషలో నాగలిముందు భాగమును కూడా 'సీతా' అందురు. ఆ రెండు శబ్దములు ఒకటి అగుట వలననే సీతాదేవి భూమిని దున్నుతుండగా భూమిలో దొరికినట్లుగ ప్రసిద్ధియైనది. వానరశబ్దము కూడా లోకవ్యవహారములో ప్రసిద్ధిగాంచిన 'కోతి' అను అర్థమునే ధ్యానమున నుంచుకొని రామాయణ కాలమునాటి పాత్రలకు వేషములను తయారు చేసిరి. కాని రామాయణ కాలమునాటి వ్యవహారమును కూడా తెలుసుకున్నపుడే సత్యార్థములు తెలియగలవు. హనుమంతుడు, సుగ్రీవుడు మున్నగువారు వానరులే. కాని కోతులు మాత్రము కారు. వానర, కపి మున్నగు శబ్దములపై ఆర్యవిద్వాంసుల దృష్టి కోణమిట్లున్నది.

వానర : నేడు మనుష్యజాతిలో అనేక ఉపజాతులున్నట్లే రామాయణ కాలములో కూడ ఉండెడివి. వానరజాతిని వానరులనుటకు కారణము వానర = వా + నర = ఒక విశేషనరుడు. నేతృత్వగుణముగల మనుష్యుడని గాని లేక వనములలో నివసించుట వలనగాని 'వానరులని' పేరు వచ్చి యుండవచ్చును. వీరు నివసించు స్థానభేదము వలన నేపాల్, చైనా వారి వలె అకారములో కొంత భేదముండవచ్చును. మానవులవలె భాష మాట్లాడుటతో పాటు యితర వ్యవహారములన్నీ మానవుల వలె చేయుచుండుటవలన వారు మానవులే. రామాయణములోగల వానరుల స్త్రీ పాత్రలకు తోకలెందుకు తగిలించలేదని ఎవరూ ఆలోచింపనేలేదు. మగ కోతులకున్నట్లు ఆడ కోతులకు తోకలుండవా ?

కపి : ఈ శబ్దమునకు లోకములో కోతియను వ్యవహారము ఉన్నమాట నిజమే. కాని వేరు అర్థములు కూడ కలవు. వైదిక సాహిత్యములో 'కపి' మరియు 'వృషాకపి' శబ్దములున్నవి. వాని అర్థములు కపి - కంపింపచేయు (కదలించు) వాడు. లేక ధర్మము. సుఖము. జలాదులను వర్షింపజేయువాడు, [illegible] వీర, శూరతలతో దుష్టులను కంపింపజేయువాడు. మహాభారతములోని

శాంతిపర్వములో (342 అ 86 శ్లో.) కపిర్వరాహః శ్రేష్ఠశ్చ ॥ అనగా కపి శబ్దమునకు "శ్రేష్ఠమను అర్థము కూడ యున్నది

**లాంగూలము** : దీనికి 'తోక' అను అర్థము కూడ కలదు. కాని రామాయణములో వానరజాతి ధరించునట్టి ఒకానొక అభరణము లేక గుర్తునకు లాంగూలమని పిలుచుచుండిరి.

**'కపీనాం కిల లాంగూల మిష్టం భవతి భూషణమ్ ।** (సుం. కాం. 53 వసర్గ)

కపిజాతి వ్యక్తులకు లాంగూలమనెడు ఆభరణము చాలా యిష్టము. ఆర్యులకు యజ్ఞోపవీతము, శిఖా, మేఖలాది చిహ్నములు రక్షింపదగినవైనట్లుగ దీనిని వారు యుద్ధసమయములో ప్రాణములతో సమానముగ రక్షించుచుండిరి. ఈ విధముగ ఇతర శబ్దములను గూర్చి కూడా బాగుగా ఆలోచించుట అవసరము.

## రామాయణముపై స్వామీ వివేకానందుని అభిప్రాయములు

1. రామాయణ మహాభారతములు రెండూ ప్రాచీన ఆర్యజీవనమును ఆదర్శ సభ్యతను వర్ణించు మనుష్యజాతి ఆకాంక్షించునట్టి మహాపురుషుల విశ్వకోశములు.

2. సీతారాములు భారతదేశమున కాదర్శవంతులు. సీతాదేవిని భారతదేశ ఆదర్శనారిగా చెప్పుదురు. ఆమె నారీత్వమున కాదర్శము.

3. సీతాదేవిని గూర్చి ఏమని చెప్పుదును. ప్రపంచ ప్రాచీన సాహిత్యము నంతనూ శోధించిననూ, భవిష్యత్తులో రచింపబడు సాహిత్యములో కూడా సీతాదేవి వంటి చరిత్ర లభింపదు.

4. సాక్షాత్తుగా పవిత్రమునకు కూడా పవిత్రము, ధైర్యమునకు నిధియై అన్నిరకముల ననుభవించినట్టి ఈ గరిమామయి - సీతాదేవిని భారతవాసుల హృదయ సింహాసనమునుండి ఎవరూ తొలగింపజాలరు. ఈమె మన దేశవాసులందరికి పూజ్యురాలుగ నుండును.

## వాల్మీకి రామాయణములోని కొన్ని సుభాషిత రత్నములు

1. పతివ్రతానాం నా కస్మాత్ పతన్తి అశ్రూణి భూతలే (యుద్ధకాండ)
2. ఉపకారఫలం మిత్రమ్ అపకారో అరిలక్షణమ్ (కిష్కింధ)
3. అవశ్యమేవ లభతే ఫలం పాపస్యకర్మణః । (యుద్ధకాండ)
4. శుభకృత్ శుభమాప్నోతి పాపకృత్ పాపమశ్నుతే । (యుద్ధకాండ)
5. అభక్ష్యాణి చ మాంసాని । (కిష్కింధ)
6. సన్తశ్చారిత్ర భూషణా : (యుద్ధకాండ)
7. మరణాంతాని వైరాణి । (యుద్ధకాండ)
8. జ్యేష్ఠో భ్రాతా పితాచాపి యశ్చ విద్యాం ప్రయచ్ఛతి త్రయస్తే పితరో జ్ఞేయాః । (కిష్కింధ)
9. రామోద్విర్నాభిభాషతే । (అయోధ్యకాండ)
10. న పరః పాపమాదత్తే పరేషాం పాపకర్మణామ్ । (యుద్ధకాండ)

## రామాయణముపై - శంకా సమాధానములు

**1. సీతాదేవిని శ్రీరాముడు అగ్నిలో ప్రవేశింపజేసి పరీక్షించెనా?**

ఉ. వాల్మీకి రామాయణములోని 116వ సర్గలో ఈ ప్రసంగమున్నది. దానిద్వారా లక్ష్మణుడు చితిని చేయగా సీతాదేవి దానిలో ప్రవేశించినట్లు తెలియుచున్నది. 'వివేశ జ్వలనం దీప్తం నిశ్శ కేనాన్త రాత్మనా ' ఇది తరువాత వారు ప్రక్షిప్తము చేసిరి. అగ్ని పరీక్ష యనునది ఒక భాషా శైలి మాత్రమే. అనగా కఠోరమైన పరీక్షచేయుటయని అర్థము. దోషిని కాల్చుటకు శుద్ధ చరిత్ర కలవారిని కాల్చకుండుటకు తగిన జ్ఞానము జడ పదార్థమైన భౌతికాగ్నికి ఎక్కడిది? సత్పురుషులెవరైనా స్వయముగా అగ్నిలో చెయ్యినుంచి పరీక్షింప వచ్చును! సృష్టి నియమములకు విరుద్ధమైన ఇటువంటి మాటల నెన్నడూ విశ్వసింపరాదు.

**2. శ్రీరాముడు తపస్సుచేయుచున్నట్టి శూద్రునెవరినైనా వధించెనా ?**

ఉ. వాల్మీకి రామాయణమునకు ఉత్తర కాండకూడ ఉన్నది. అనగా ఈ కాండము తరువాత వ్రాయబడినదని అర్థము. ఉత్తరకాండలో ఒక బ్రాహ్మణ

బాలుడు మరణించుట వలన అతని తల్లిదండ్రులు ఏడ్చుచూ రాముని దర్బారుకు వత్తురు. శంబూక మనుపేరుగల ఒక శూద్రుడు దక్షిణ దిశలో ఒక పర్వతముపై తపస్సు చేయుచుండుట వలననే ఆ బాలుడు మరణించెనని నారదుడు చెప్పగా, రాముడు విమానములో అచ్చటికి వెళ్ళి ఆ శూద్రుని చంపి బ్రాహ్మణపుత్రుని బ్రతికించెనని కలదు.

ఈఘటన రామాయణ కావ్యములోని ఘట్టములకు, సృష్టిక్రమమునకు విరుద్ధమగుటవలన ఇది అసత్యము. రామరాజ్యములో -

**నచస్మ వృద్ధా బాలానాం ప్రేతకార్యాణి కుర్వతే ।**

వృద్ధులుండగా చిన్నవారు మరణించెడి వారు కారని చెప్పగా బ్రాహ్మణ బాలకుడెట్లు మరణించెను? శూద్రుడు తపస్సుచేయుచున్నచో దానికి బ్రాహ్మణ బాలుని మృత్యువుతో ఏమి సంబంధము ? ఒకరిని చంపి మరణించిన మరొకరిని బ్రతికించుట వీలగునా ? రామరాజ్యకాలములో నాలుగు వర్ణములవారు ధర్మపరాయణులై యుండగా, ధర్మకార్యములాచరించుటకు అందరికీ సమాన అధికారములుండగా శూద్రుడు తపస్సు చేయరాదను ఆంక్ష ఎందులకు? శబరి యిచ్చిన ఎంగిలి ఫలములను పాద్యాది ఆతిథ్యమునెంతో ప్రేమతో స్వీకరించిన రాముడు శూద్రుల యెడల పక్షపాతవైఖరిని చూపునా ? ఆయనలోని గుణములలో ఒకటియైన " ఆర్యః సర్వసమైశ్చైవ' అందరితో సమానముగ మెలగుటవలన రాముడు 'సర్వసముడు' గ చెప్పబడుచుండెను. అటువంటి రామునకు శూద్రులపై భేదభావముండునా ? పై విషయముల నన్నింటిని బాగుగా ఆలోచించిన పౌరాణికులచే ప్రభావితులైన కొందరు ప్రక్షిప్తములు చేసినట్లుగ స్పష్టమగును.



# మా గాయత్రీ ఆశ్రమ ప్రచురణలు

12-10-586/6, వ్యాస్ నగర్, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 061

| పుస్తకము పేరు | రచయిత | వెల |
|---|---|---|
| 1. గోమాత | (డా॥ కోడూరి సుబ్బారావు) | 7.00 |
| 2. వైదిక వైజ్ఞానిక సంస్కృతి | ,, | 10.00 |
| 3. మానవ ధర్మము | ,, | 3.50 |
| 4. గాయత్రీ మహిమ | ,, | 6.00 |
| 5. వైదిక క్రాంతి పథం | ,, | 15.00 |
| 6. చతుర్దశ భువనములు | ,, | 3.00 |
| 7. అగ్ని హోత్ర వైజ్ఞానిక స్వరూపము | ,, | 15.00 |
| 8. యజ్ఞోపవీత వైశిష్ట్యము | ,, | 2.00 |
| 9. జననీ - జన్మభూమి | ,, | 5.00 |
| 10. దౌహృదిని (ఋషులదృష్టిలో గర్భిణిస్త్రీ) | ,, | 10.00 |
| 11. యుగపురుషుడు శ్రీకృష్ణుడు | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 8.00 |
| 12. పురుషోత్తముడు శ్రీరాముడు | ,, | 14.00 |
| 13. వైదిక వివాహ వైశిష్ట్యము | (సంధ్యావందనం లక్ష్మిదేవి) | 5.00 |
| 14. మాతా పుత్రికల జ్ఞాన చర్చ | (లోక మల్హరి) | 15.00 |
| 15. బ్రహ్మచర్య విజ్ఞానము | (టి. సూర్యనారాయణ) | 15.00 |
| 16. వైదిక అర్థనీతి | ,, | 2.00 |
| 17. దయానందుని ఆదర్శ రాజ్యము | ,, | 1.00 |
| 18. వైదిక సంధ్యాగ్ని హోత్ర విధి | | 1.50 |
| 19. దైనిక అగ్ని హోత్ర విధి | | 4.00 |
| 20. THE GREAT GAYATHRI | | 2.00 |
| 21. శాంతి ప్రార్థన | | 0.75 |
| 22. మహర్షి మనువుపై విరోధమెందుకు? | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 3.00 |
| 23. వేదములలో విజ్ఞాన బీజాలు | ,, | 10.00 |
| 24. అక్కాచెల్లెండ్ల ధార్మిక చర్చ | లోకా మల్హరి | 20.00 |
| 25. ధర్మవీర్ పం. లేఖరాం | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 3.00 |
| 26. శ్రీమతి లక్ష్మిదేవి ప్రేరణాత్మక జీవనం | ,, | ఉచితము |
| 27. చాణక్యనీతి | (అ. వెంకయార్య) | 40.00 |
| 28. శ్రీ దయానంద హృదయము | జాస్తి నరసింహారావు | 12.00 |